లిపి, యేర్పడిన పిమ్మటగూడ వెంటనే అది సావ్యరచనకు అక్కఱకురాదు. కొంతకాలము రాజకీయాది లౌకిక వ్యవహారములకు మాత్రమే వినియోగపడి పిమ్మట సారస్వత సాధనముగా పరిణమించును. ఈ ధర్మము లోకములోని అన్ని భాషలకును సామాన్యమే. కావున నన్నయభట్టు భారతము ప్రారంభించునాటికే మన భాషకు ఈ దశలన్నియుగడచి సుస్థిరమైన రూపమేర్పడినది.

ఇప్పటికి లభించిన శాసనముల ఆధారములనుబట్టిచూడగా, మనభాషను తొలుత 7 వ శతాబ్దిలో రాజభాషగా స్వీకరించిన వారు చాళుక్యరాజులనియు, అప్పటికి ఆభాష ప్రాకృతబహుళముగా నుండెననియు, పిమ్మట మూడు శతాబ్దుల కాలములో ఆ రాజుల పరిపోషణవలననే క్రమపరిణతినొంది స్వతంత్రమై పద్యరచనకు గూడ సాధనమయ్యెననియు విదితమగు చున్నది. అదేకాలమున దేశియచ్ఛందములలో చిన్నచిన్న కావ్యములు పెక్కు పుట్టియుండెననియు, అవన్నియు ప్రౌఢ సాహిత్యముగా గాక పదకవిత్వముగా ఎల్లెడల వ్యాపించి యుండెననియు ఊహించుటకు పెక్కు గ్రంథస్థములైన ఆధారములును కలవు. ప్రాఙ్నన్నయ యుగమునందలి ఆంధ్ర సారస్వతస్థితి యింత మాత్రమే. ఆనాటి ఆ పదకవితావాఙ్మయమంతయు భారతము ముందు నిలువలేక తనంత అంతరించియుండును. ఆ కవిత్వము కేవలము గేయకవిత్వమే అగుటచేత, ప్రజలు పాటగా పాడినంత కాలము నిలచియుండి కాలక్రమమున నశించిపోయి యుండును.

— నన్నయ యుగము 11-వ శతాబ్ది —

గడచిన మూడు శతాబ్దులలో జరిగిన కృషివల్ల భాష ఎక్కువగా విస్తరించినను తత్సమ తద్భవాది శబ్ద నిష్పత్తిలో ఇంకను నిష్కర్షమైన నియతి యేర్పడలేదు. శాస్త్ర సమ్మతమైన సంస్కార పూర్వకముగా అట్టిపదముల కన్నిటికి నురూపత ఏర్పరుచుటకై రాజాశ్రయమున ఈ శతాబ్దిలో కొన్ని పండిత పరిషత్తులు వెలసియుండును. ఆస్థానపండిత కవి గనుక నన్నయ ఆ పరిషత్తులకు అధ్యక్షుడును అయియుండవచ్చును. ఆయనకు వాగనుశాసనుడను బిరుదువచ్చుటకు ఈ పదవియే హేతువై యుండును. కావుననే ఆంధ్రమున ప్రథమ మహాకావ్యము రచించుటేకాక, ఈ భాషను అనుశాసింపవలసిన బాధ్యతను గూడ ఆయన వహింపవలసి వచ్చెను.

ఆంధ్రభారతము సంస్కృత భారతమునకు అనువాదమే యయ్యెను. అది మూలకథా మాత్ర ప్రధానముగా నడచిన స్వతంత్ర రచనయే కాని, సంస్కృత శ్లోకములకు కేవలము ప్రతిబింబములైన తెలుగు పద్యముల కూర్పు మాత్రముకాదు. ఆ కథా ప్రధానతయు కొన్నిచోట్ల యథార్థముగా పాటింపబడ లేదు. మూలమును సంక్షేపించిన పట్లు కొన్ని, విసర్జించినవి మరికొన్నియు అందు కలవు. అనగా తెలుగు భారతము యథోచితానుసరణమేకాని యథామూలకము కాదనుట. పురాణేతిహాసములను తెనిగించిన ఆంధ్రకవులందరును నన్నయ తీసిన ఈ దారినే నడచి తమ రచనలను అనువాదములయ్యు స్వతంత్రములుగానే చేయగలిగిరి.

నన్నయ యుత్తమ జాతి కథకుడు. కథాగమనమునకు వక్రతగాని, సంకుచితత్వముగాని, అతివిస్తృతిగాని రానీక, సూటిగా ప్రసన్నముగా కథను నడపగల దక్షుడు. ఈయన కవిత్వములో ముప్పాతికవంతు సంస్కృత పదములే యుండునని లోకమనుట నిజమే. ఈయనకు మార్గదర్శకము కాదగిన పూర్వాంధ్రసాహిత్యము లేకపోవుటచేతను, ఈయన చేసిన విద్యాభ్యాసమంతయు సంస్కృత సంబంధియే అగుటచేతను, అట్టి సంస్కృత పదావలంబనము తప్పనిసరియయ్యెను. ఎంత సంస్కృతభూయిష్ఠమైనను రచన మాత్రము కఠినముగా పరుషముగానుండదు. సంస్కృత పదఘటితములైన దీర్ఘసమాసములు సైతము సుబోధముగా కర్ణపేయముగా చేయునేర్పులో నన్నయకు నన్నయయేసాటి. ఈ సంస్కృత పదబాహుళ్యముచేతను సమాసగాంభీర్యముచేతను ఆయన శైలికి ఉదాత్తతయు, ఠీవియు లభించినవి. ఎఱ్ఱాప్రెగ్గడ నన్నయను భద్రకుంజరముతో పోల్చుట ఆయన పద్యపు నడకనుబట్టియే. ఈ సంస్కృతపదజటిలత సైతము మొదటి రెండు పర్వములకంటె మూడవ దానిలో చాల తగ్గిపోయినది. గ్రంథము సాగినకొలది ఆయన శైలికి క్రొత్త వన్నెయు వచ్చినది. ఒక శైలిలోనే కాదు, కథనములో సైతము అరణ్యపర్వమే తక్కిన రెంటిని మించియుండును.

ఈ కవి సాంగవేదపరిజ్ఞానపరిశుద్ధాంతరంగుడు. భారతీయ సంస్కృతి చరిత్రయందు వైదిక యుగమునందును, ఐతిహాసిక

యుగమనియు, చెప్పబడు రెండు విభాగములలో మొదటి దానిని భావన చేసి చెప్పుటలో నన్నయ అందె వేసిన చేయి.

నన్నయకు సమకాలికులుగా చెప్పబడు కవులలో, గ్రంథ కర్తలుగా కానబడు వారెవ్వరును లేరు. నారాయణభట్టు మహా కవియే కాని ఆయన తన శక్తిని సహాయముగా నన్నయకే వినియోగించెను. భారతరచనలో నన్నయకు నారాయణుడు చేసిన సాయము మిక్కిలి కలదు. ఆ ప్రసంగమునకు ఇది యదను కాదు. మార్గ కవిత్వమును పేర ఆంధ్రులకు సంస్కృతకవిత్వమే శరణ్యమైయున్న రోజులలో, దేశికవితను పుట్టింపవలెనని సంకల్పించిన చాళుక్య రాజుల తపస్సిద్ధి నన్నయ భారత రూపమున ఫలించి, ఆంధ్రవాఙ్మయ ప్రపంచమునకు మూల స్తంభముగా నిలచెను.

### 12-వ శతాబ్ది.

ఈ శతాబ్దిని ప్రత్యేకముగా శైవయుగమని పిలువవచ్చును. ఈకాలమునందు ప్రసిద్ధులైన ముగ్గురు కవులును(నన్నెచోడుడు, పండితారాధ్యుడు, సోమనాథుడు) శివపారమ్యము నే ఉద్బోధించు గ్రంథములు వ్రాయుటచేతను, వారిలో ఇరువురు (పండితుడు, సోమనాథుడు) పరమ శైవాచారసంస్థాపకులగుటే కాక, ఆ మతమువారిచే అవతారపురుషులుగా మన్నింపబడిన ఆచార్యులగుటచేతను, మరియు ఈ యిరువురిలో సోమనాథుడు వీర శైవప్రచారమునకే తన జీవితమును కవిత్వమును అంకితము నర్చి దేహయాత్ర నడపిన వాడగుటచేతను ఈ శతాబ్దిలో పుట్టి

ఉత్తరహరివంశమను పేరిడెను. ఈఇతివృత్తమంతయు ఎఱ్ఱనహరి వంశములోని ఉత్తరభాగములోనిదే యగుటచేత దీనికి ఉత్తర హరివంశమని పేరిడెనేమోయని నాతలంపు.

సోమనను తెలుగు కవులలో ఉత్తమోత్తమవర్గమునందు ఒకనిగా పేర్కొను విమర్శకులు చాలమందికలరు. అందును తిక్కనతో సాటిరాగల కవి ఈతడు ఒక్కడే అని చాలమంది అభిప్రాయము. నారియూహకు హేతుకమేమో అనిభ్రమింపజేయు లక్షణములుగూడ ఈకవిలో చాలకలవు. అదిభ్రమమాత్రమే. సోమనకవితలో తిక్కనపోలికలు కొన్నియున్నను వారిరువురకు సాటిమాత్రము లేదు. పరమార్థమును విచారించినచో ఇతనికి ఎఱ్ఱనతోడి సాటియు లేదు. ఈతారతమ్యనిర్ణయము చేయుటలో వారివారిపద్యములను పోల్చిచూచుట చాలదు. ఒకయెడ ఒకరి పద్యములు, ఇంకొకయెడ ఇంకొకరి పద్యములు మేల్తరములుగా నుండును. కావున ఆప్రమాణమే పనికిరాదు. కవితాసృష్టికి మూలభూతమగు కర్తృమనోధర్మము, చిత్తసంస్కారము, లోనగు ప్రమాణముల పురస్కరించుకొని విమర్శించినచో సారభూతమైన నిర్ణయము తేలును.

కవితాకళ సత్త్వరజస్సులలీల. జగత్సృష్టికి రజోగుణమును దానిమర్యాదారక్షణమునకు సత్త్వగుణమును కారణములైనట్లే కవితాసృష్టికిరజస్సును, దానిమర్యాదాపరిపాలనకు సత్త్వమును కారణములగుచున్నవి. ఈరెంటిలో రజోగుణము కవిత్వమునకు ప్రాణతుల్యము. కాన దానిరాజ్యము ప్రాణమయకోశము

మాత్రమే. కవితయందలి ఆవేశము, తీక్ష్ణత, ఔజ్జ్వల్యము మొదలగు గుణములన్నియు సహజస్వంచాదితముగా విజృంభించుచుండగా వాని మాలిన్యమును ప్రక్షాళన మొనర్చి సాత్వికములుగా జేసి సముచిత స్థానమును మీరనీయకుండ పరిశాంతముగ ఆనందమయకోశము వరకు నడపుభారము సత్త్వము వహించుచున్నది. ఎవనికవిత్వమున ఈసత్త్వాధికారము న్యూనమగునో, వానిదియెంతయుజ్జ్వలరచనయైనను అనౌచిత్యమునకు వశమగుచు నేయుండును. ఈధర్మమును బట్టిచూచినచో ఎఱ్ఱనకవితలోగల సత్వశుద్ధి సోమునికవితలో లేదు. సోమనభావావేశము శృంఖలవిహారము చేయుచుండగా ఎఱ్ఱనభావము సత్వసంయమితమై గంభీరమందగమనము చేయును.

సూర్యకిరణస్పర్శచే తామరసకోరకము చలించి, వికసించి, మకరందమును గురియునట్లుగా, కవివాక్కిరణస్పర్శచే భావుక హృదయాంబుజము క్రమముగా స్పందించి, విప్పారి కరిగిపోవును. ఈ తుదియవస్థలోనే కావ్యరసాస్వాదనమునందలి యమృతసిద్ధి వడయుదుము. సోమన తనవక్రోక్తివలనను చమత్కారార్థముల వలనను సాధింపగలిగినది ఇందలి రెండవయవస్థమాత్రమే. ప్రశాంతమైన రససిద్ధి గలిగించి తన్మయుల జేయుశక్తి ఆతనికవిత్వమున లేదు. ఆతడు కలిగించు హృదయవిస్తృతినిబట్టి "ఓహో!" యని ఆశ్చర్యచకితుల మగుదుమే కాని "ఆహా!" అనెడి పరవశభావమును పొందము. ఆతని మెచ్చుకొందుమే గాని ఆతనిలో లీనము కాలేము. ఆ పరమానుభూతి ఎఱ్ఱన సుకరముగా గల్గించును. కాని ఎఱ్ఱనకవిత్వమునకు గల్గు పారవశ్యము ఎడనెడ కొన్నికొన్ని ఘట్ట

ములలోనే జరుగుచుండగా సోమన కలిగించు నాశ్చర్యము ప్రతిపద స్యందియగుచుండును. దీనికి ఇతివృత్తము కూడ కొంత కారణమై యుండును.

శృంగారరసాధిదేవత యెఱ్ఱనకు రాసోమునకు స్వచ్ఛమూర్తిలో కానరాలేదు. దాంపత్యము పరమపవిత్రముగ నొనర్చు ప్రణయ వాత్సల్య దాస్య సాహచర్యాది మధురకోమలభావములు శృంగారకవులందరు నెరుంగరు. కాళిదాసభవభూతులవంటి జగదేకకవులకే ఆపవిత్రమూర్తి గోచరించెను. తక్కిన లోకసామాన్య కవులకు శృంగారమనగా దంపతుల శరీరసంయోగమే కాని వేరుకాదు. ఎఱ్ఱన ఆ యుత్తమ వర్గమున జేరును; సోమన యీ రెండవవర్గములో చేరును. ఎఱ్ఱన శృంగారమునకు ప్రేమ బీజము. సోమన శృంగారమునకు కామము బీజమని సాహసించి చెప్పవచ్చును.

సోమన నాగరజనమర్యాద లెరిగినమేటి. ఎఱ్ఱన సమగ్రముగా నెరిగినది పల్లెజన జీవితము. గోకులమును మిషగా గైకొని ఎఱ్ఱన చిత్రించిన నిరాడంబర జానపదజీవితము పోతనచిత్రమును గూడ మించిపోయినది. యుద్ధాదులను వర్ణించునప్పుడును సోమనదే పైచేయి. కాని సందర్భోచితమును, ప్రసన్నమును, సాత్త్విక భావ జనకమును రసస్యందియును అగునట్లు కథ నడవు నేర్పు సోమనకు లేదు. ఆభాషకూడ కంటకశిలాప్రదేశములలో ప్రవహించు ఝరీవేగమున నడుగిడునుగాని ప్రసన్నగంభీరముగా నడవదు. ఈ సోమన భారతమును వ్రాయవలసివచ్చుటలో

గ్రుద్ధపంచకమున కొన్ని ఘట్టములు వ్రాయుగలడేమో కాని తిక్కనవలె తుదివర్వములను గాని ఎఱ్ఱాప్రగ్గడవలె అరణ్య పర్వమునుగాని వ్రాయలేడు. ఆ రచనకావశ్యకమైననిగ్రహమే ఆ చిత్తమునకు లేదు. సంస్కృతమున వ్యాసవాల్మీకి కాళిదాసాది మహాకవులకును, నైషధాది కావ్యకర్తలకును ఏ వాసియుండునో ఆవాసియే తెలుగులో కవిత్రయమువారికిని ఇతర ప్రబంధ కర్తలకును కలదు. అదియే ఈ యిరువురకు ఉన్న భేదము.

భాస్కరరామాయణము ఏకకాలముననే బహుకర్తృక మగుటకు హేతువు, ఎఱ్ఱన రామాయణమునకు అదిసమకాలిక మగుటచే దానికంటె ముందు పూర్తికావలెననెడి కృతిపతికోరిక కావచ్చును. ఆ కవులు నలువురిలో హుళక్కి భాస్కరుడు ఉత్తమజాతికవి. గ్రంథము పూర్తిచేసిన అయ్యలార్యుడును ఇంచుమించు అంతవాడే. వీరిరువురును భారతకవుల మర్యాదలను నేర్చి అనుకరించిన సమర్థులు.

మల్లికార్జునభట్టు, తండ్రియంతవాడు కాడు. ఈతని రచన గుణదోషసమ్మిశ్రితమై ఇతనిని మధ్యమజాతి కవిగా కన్పరుచును.

మదిరిదేవునివి అప్పుడప్పుడే బాల్యదశవదలిన కవిత్వము.

శ్రీనాథుని యుగము (1350-1500)

ఆంధ్రకవులలో తిక్కనతరువాత శ్రీనాథునివంటిపద్వత్కవి యింకొకడు లేడు. కవిబ్రహ్మవలెకవిసార్వభౌముడును తనకాలమున సాహితీగురుపీఠ మధిష్ఠించిన మహామూర్తి. ఆయన వలెనే

ఈయనయు రాజాస్థానములలో అధికారము నెరపి రాజభోగములనన్నిటిని అనుభవించినపుణ్యశాలి. ఆయన నవలెనే తన పేర ఒకశైలిని వెలయించి అర్వాచీనులకు భిక్షపెట్టినఒకగురువు. సర్వవిద్యాపరిశ్రమచేసిన పండితాఖండలుడయ్యు 'చిన్నారి పొన్నారి చిరుతకూకటినాడే' కావ్యములనురచించిన ఆగర్భకవి భీమఖండము మిషగా చేసికొని గోదావరీమండలమునందలి నదులను పర్వతములను, గుళ్లను గోపురములను, వనములను ఆరామములను, క్షేత్రములను తీర్థములను పద్యకుసుమములతో పూజించిన దేశభక్తుడు. అఖండపాండితీస్ఫోరకమగు ప్రౌఢసాహిత్య నిర్మాతయయ్యు తనున్నత పదమునుండి దిగివచ్చి పామర జనమునకు చెలిమికాడై పిచ్చుకుంటులకును, ఎఱ్ఱగొల్లలకును పదములను సుద్దులను వ్రాసిపెట్టి పాడించిన మెచ్చువు దేశకవి. భీమఖండములోని ఆ దేశభక్తియే ఈ పదములకును ప్రేరకము. ఇదియే కాదు, ఆయనచాటువులలో పెక్కులు ఆంధ్రతాస్తోత్రములే. జీవితపరిస్థితులనుబట్టి ఆయన చేయవలసి వచ్చిన దేశ సంచారములు, సహజముగానున్న సౌందర్యదిదృక్ష, పరిహాస రసికత ఈ చాటువులకన్నిటికిని ముఖ్యకారణములు.

క్రీడాభిరామ రచనకు, ఈ పరిహాసరసికతయే హేతువు. మన భాషలో పుట్టిన మొదటి హేళన కావ్యమిదియే. ఇదియే లక్షణయుక్తమైన ప్రథమరూపకముకూడ. ఇటీవల చంద్రరేఖావిలాపాది కొన్ని హేళనకావ్యములు పుట్టినవిగాని అవి వ్యక్తిగతదూషణలతో నిండియున్న బూతులబుంగం.

క్రీడాభిరామమునకు అట్టికళంకము లేదు. సంఘమందలి లోపము లను, మనోదౌర్బల్యముకలవారి ధౌర్త్యప్రవృత్తిక్రమమును కవి పరి హాసపూర్వకముగా ఎత్తిచూపి ఎగతాళి చేసి మందముగ మంద లించునేకాని కఠినముగా శపించి శిక్షింపడు. అదిగాక దీనివంటి సాంఘికకావ్యము మన సాహిత్యమునకటి లేనేలేదు. ఎన్నడో నశించి పోయిన ఓరుగల్లు పట్టణస్వరూపమంతయు ఈ యుద్ధమున ప్రతి బింబించుచుండును. కావున ఆంధ్రదేశపరములైన శ్రీనాథుని కృతులలో ఇది యింకొకటి.

సంస్కృతవాఙ్మయము ఆంధ్రమునకు అవతరించినదశలలో శ్రీనాథుని ఆంధ్రీకరణపద్ధతి రెండవది. మొదటిది కవిత్రయము వారుచేసిన భారతాంధ్రీకరణపద్ధతి. ఎరిఙ్ఞపదమైన భాషాంతరీ కరణమనియే పిలువరాదు. అది మూలమును నిమిత్తమాత్రము గానే కైకొనిసాగించిన స్వతంత్రరచన. ఇక, శ్రీనాథుడు మొద లిడినది ప్రబంధానువాదము గనుక నిసర్గముగా దానికిని దీనికిని భేదముండక తీరదు. భారతమువలెకాక నైషధమున ప్రతిశ్లోకమును గణనీయముగానే యుండును. ప్రతిశబ్దము, అపరిహార్యముగానే కన్పడును. అచ్చటవలె ఇచ్చట కథామాత్ర ప్రాధాన్యము పనికిరాదు. మరి, పరిగణనీయముగదా అని ప్రతిశ్లోకమును ఆంధ్రీకరించుచో కావ్యము యొక్క సౌందర్యము చెడును. ఈ సంకటమునుండి తొలగుటకు శ్రీనాథుడొక మధ్యమార్గము నవలంబించెను. మూలమునననుసరించినట్లే కనిపించునుగాని దానికి దాస్యము చేసినట్లు మాత్రము కనపడదు. మూలశ్లోకముచే

తననోటిని తన చేతిని బంధించుకొనక ఆ శ్లోకార్థము నే తన పద్యగర్భమున ఇముడునట్లు చేయును. అనుచితమును అనావశ్యకమును అని తోచిన నో ఎంతగొప్ప శ్లోకమైనను త్యజించుటకు వెనుదీయుడు. ఆవశ్యకమని తోచినచో శ్లోకమునంతను యథాతథముగా యథాక్షరముగా అనువదించుటకు జంకడు ఒక నైషధమునే కాక ఇతర గ్రంథములందు సైతము ఆయన సంస్కృతానువాదము ఈ పద్ధతినే నడచినది. పాషాణములనంటి మయూరాది మహాకవుల సద్గ్రంథములు శ్రీనాథుని చేతిలో, వెన్నవలె కరిగి సీసపద్యప్రటుప్పులో ఆయన కిచ్చవచ్చిన రూపము దాల్చినవి. ఆ యుగములో పిదపవీరభద్రుడు, నందిమల్లయ, ఘంటసింగయ మున్నగు కవులందరు తెలుగుసేతలో ఈయన అడుగుజాడలనే నడచిరి.

అనువాదసరణికివలె ప్రబంధరచనకును శ్రీనాథుడే మార్గదర్శకుడయ్యెను. పురాణేతిహాసములనుండి ఆంధ్రరసికుల దృష్టిని ప్రబంధములవైపునకు మరల్చినది ఈయన నైషధమే. ఆప్రబంధములకు అనువైన శయ్యాసౌభాగ్యమున ఒరగినగురువు శ్రీనాథుడే. మరి, ఆగ్రంథమున తొల్లిటినుండియు అక్షరరమ్యతి సాధించిన కవివర్గమొకటియు, అర్థగౌరవము పాటించిన కవివర్గమింకొకటియు రెండువిధములనుండగా, ఆ రెండుగుణములను సమ్మేళనమొనర్చి శబ్దార్థముల రెంటికిని సమప్రాధాన్యము నొసంగిన శిల్పియు శ్రీనాథుడే.

ఈవిధముగా నానాముఖవ్యాప్తమైన సారస్వతఖ్యాతిని.

చారిత్రికప్రసిద్ధిని ఆర్జించిన ఈ కవి సార్వభౌముని గూర్చి కీర్తిశేషులైన చిలుకూరి వీరభద్రరావుగారు ఒక యథార్థమైన వాక్యమును పలికిరి. "శ్రీనాథుని జీవితచరిత్ర వ్రాయుటయనగా పదునైదవ శతాబ్దియందలి ఆంధ్రదేశచరిత్ర వ్రాయుట" అని. ఆకాలమున ఉచ్చస్థితిలో నున్న ఆంధ్రకర్ణాట రాజులతో ఆయనకుగలసంబంధము, నానామంత్రులతోడిమైత్రి, వివిధదిశల నొనర్చినసంచారము, శ్రీనాథుని ఆంధ్రలోకైకకవినిగాచేసినవి. కొండవీటిచరిత్ర వ్రాయుఐతిహాసికుడు శ్రీనాథునకు ఒకప్రకరణమేనియు అంకితమీయకతప్పదు. శ్రీనాథుని జీవితమువ్రాయు చరిత్రకారుడు రెడ్డిరాజ్యచరిత్రముతో కలిపిగాని వ్రాయలేడు. కనకాభిషేకమును వర్ణించుకవి కన్నడ రాజ్యలక్ష్మిని గురించి వర్ణింపకతప్పదు. రాచకొండలోని విద్యాప్రదర్శనమును ఉగ్గడించునప్పుడు వెలమరాజులకును రెడ్డిరాజులకునుగల వైరమును వివరింపకమానలేము. ఈవిధముగా ఆమహామహుని జీవితమంతయు ఆనాటి రాజులయు, మంత్రులయు, రాజబంధువులయు జీవితములతో పడుగుపేకలుగా అల్లుకొని యుండుటచేత ఈమహాకవికి అట్టిచారిత్రిక ప్రసిద్ధి లభించినది.

శ్రీనాథుని సమకాలికులలో ప్రథముడును, ఆంధ్రకవిప్రవక్తలలోద్వితీయుడును అయిన పోతనామాత్యునిభాగవతము ఏల ఉత్పన్నమైె, బహుళవ్యాప్తికి పాల్పడినదో చెప్పలేము. ఈభక్తుడు చైతన్యస్వామికంటె నలుబదియేబది సంవత్సరములు పూర్వుడు. ఆభక్తశిఖామణి వంగదేశమున రాధాప్రేమ

యాత్మకమైన కృష్ణతత్త్వమును ప్రబోధింపకపూర్వమే ఈభక్త శిఖామణి ఆంధ్రదేశమున నవరసమూర్తియగు శ్రీకృష్ణతత్త్వమును గానముచేసి ఆంధ్రుల మనోలోకమున ఒక పరివర్తనము కలిగించెను.

తెనుగునగల పురాణేతిహాసములలో భాగవతమువలె సర్వజనసమ్మతమైన గ్రంథమింకొకటి లేదు. శిల్పమున, భారతము దీనికంటె మిన్నయైనను దీనివలె సార్వజనీనమైన అనురంజకత్వమును పొందలేకపోయెను. ఇందుకు రెండుమూడు కారణములు కలవు:—

భారతము నందలి పరమార్థము (సంసారతరణో పాయముగా అది నిర్దేశించిన నిష్కామకర్మయోగము) జ్ఞానధనులైన పరిపూర్ణులకుతప్ప అందరకును అవలంబనీయము కాదు. అది యెంతి యుత్తమమార్గమైనను లోకము దాని ననుగమింప జాలదు. ఇక భాగవతమో, సర్వజంతుతారకమగు సులభ భక్తియోగమును స్ఫుటముగా ఆదేశించెను. సంసారఖిన్నమైన లోకము, ఎట్టి జ్ఞానవిజ్ఞానములతోను సంబంధము లేకుండ, పూలువంచినట్లుమెత్తనైన ఈమార్గమునవడచి దరిజేరవలయునని ఆశించుటలో వింతలేదు. సాధారణలోకము యొక్క మనఃస్థితికిని సంస్కారమునకును అనురూపమును ప్రియమును అయిన ఈ ఆలంబనము ప్రసాదించిన గ్రంథరాజము కుటచేతనే, లోకము భాగవతము నెడభక్తిబద్ధమైనది. ఆపద్వేళల, గజేంద్రమోక్షమును సంజీవనీమంత్రముగా జపించు ఆంధ్రులును, గోపికాగీతలను

భగవద్గీతలవలె పారాయణముచేయు ఆంధ్రులును నేటికిని అనేకులు కలరు.

భారతమునందలి శిల్పచాతురి సర్వకళా వేత్తృతగల ప్రౌఢరసికులకేగాని ఇతరులకు గోచరముకాదు. తిక్కనసోమయాజి, భారత నిర్మాణ నిర్మాణములో ఏ పద్యమున కెంత ప్రాధాన్యమునో అంతమాత్రమే యిచ్చి, అప్పటికలయికకు సిద్ధపొందిన మూర్తిసౌష్ఠవమునెడ దృష్టినిల్పెనుగాని, ఎచ్చటను పద్యములసొగసుకొరకే పద్యములు వ్రాయలేదు. అందుచేత సందర్భమునుండి విడదీసి విడిగా, అలవోకగా పాడుకొని సంతోషింపదగినపద్యములు భారతమున మచ్చునకైనను ఉండవు. ఇక, పోతన కృతమునైన భాగవత పద్యములు, మధురాతిమధురమునై భజనకీర్తనలవలె, పెండ్లి పాటలవలె, ఏలపదములవలె ఎల్లరును ఎల్లవేళల పాడుకొనుటకు అనుకూలమై సర్వత్ర గాలివలె వ్యాపించినవి. వానిలోని శ్రుతిలయలు ఉచ్చారణమాత్రముననే మనస్సును లోగొనును. ఉత్తమ మధురకవిత్వమునకు ఒక లక్షణమైన గీతి (Music in lyrical Poetry) భాగవత పద్యములందు నిండారియుండుటచే వానికి ఇంత ప్రచారము వచ్చినది.

కవి అనుభవించిన దారిద్ర్యము, ఆకాలరాత్రి నెమరొత్తని పోతన ఆయన ధీరత్వము, ఆశ్చర్యజనకములై లోకమునకు ఆయనయెడ సంతోషము పూజ్య భావమును కలిగించినవి. ఇవి గాక ఇంకేమేని కారణములుండవచ్చును.

స్వభావముచేత పోతన భావకవి (Lyrical Poet) అందును

భక్తి శృంగార భావములు వర్ణించునట్టి అతిమాత్రమునకు పాల్పడు భావలోలుడు. ఆఘట్టములలో ప్రత్యక్షరమునను ఆయన ఆత్మభావమే ప్రతిఫలించుచుండును. తెలుగులో ఇట్టివాడు పాల్కురికి సోమనాథుడొకడే. పురాణకర్తలలో ఇంత శృంగార ప్రియుడైన కవి ఇంకొకడు లేడు. ఆశృంగారము ప్రబంధ శృంగారమువంటిది కాక ఆధ్యాత్మిక కోశమును ముట్టినదియగుటచే ఆరసమునకు ఇతరకవులెవ్వరును సాధింపజాలని పవిత్రతను పోతన సాధించెను.

ఆంధ్రకవులలో తిక్కన సూర్యునివంటివాడనియు, పోతన చంద్రునివంటివాడనియు ఒకచోట ప్రసంగవశమున పూజ్యులు శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారనిరి. అనగా ఆంధ్రలోకమునకు వీరిద్దరును రెండు నేత్రములు. ఇరువురును తమతమ కాలములలో తెలుగుజాతికి తెలుగువేదములనదగిన మహాగ్రంథముల ప్రసాదించిన ఋషిపుంగవులు, ప్రవక్తలు అని చెప్పదగిన మహాకవులు. పోతన జీవితము తిక్కన జీవితమువలె పరిపూర్ణమైనది కాదు. ఆయన నిస్పృహత్వము కతన ఐహిక సుఖానుభవము దూరమైనది.

తిక్కన లోకప్రవృత్తి యందువలెనే కవిత్వమునందును వ్యక్తావ్యక్త స్వరూపమునగా పట్టువడియు పట్టువడక సంచరించును. ప్రతివాక్యమునందును ఆయనమూర్తి స్ఫురించుచునేయుండును; మరల కాదనిపించుచుండును. ఇక పోతన కవి, సంసారమున పట్టువడకపోయినను కవిత్వమున తడవినంతనే చేతికి అందును.

ఇది సాధారణముగా నాటకకవులకును భావకవులకును గల తారతమ్యములలో నొకటి.

ఛందోనిబద్ధమగు శబ్దము, కళాధర్మములైన శ్రుతిలయలను ఎంతవరకు సాధింపగలుగునో పోతనవలె దృష్టాంతపూర్వకముగా చూపిన పూర్వకవి ఇంకొకడు లేడు. ఆయన శబ్దాలంకార ప్రియత్వము దీనికి మరికొంత వన్నె పెట్టినది. సముచిత ప్రయుక్తమైనచోట ఆయన అనుప్రాసాలంకారము భాగవతకవితా గానమునకు మృదంగవ్యాపారము నిర్వహించుచున్నట్లుండును. కవి స్వేచ్ఛగా పాడుకొను భక్తిగానము, ఆగానమునకు అనురూపమైన మధురపేశల శబ్దము, ఆ శబ్దముల కూర్పునకు మకుటాయమానమైన అంత్యప్రాసము కారణములుగా భాగవతపఠనము, తాళము మద్దెల సహాకారములుగా ప్రవర్తిల్లు గానసభ కాక మరేమగును!

ఈ యుగమున ప్రసిద్ధులైన గౌరన, జక్కన, అనంతామాత్యుడు, పినవీరన, మగ్గన, నందిమల్లయ, ఘంటసింగయ, మొదలైన ఇతరకవులు చాలమంది కలరు.

చిరకాలముక్రిందనే వెనుకబడిపోయిన ద్విపదరచనను పునరుద్ధరించినవాడు గౌరన. శ్రీనాథుడు నాందీశ్లోకమును పఠించిన ప్రబంధమహానాటకమునకు, శృంగార శాకుంతల రూపమున ప్రస్తావన జరిపిన సూత్రధారుడు పిల్లలమఱ్ఱి పినవీరన. పురాణకథలను కాక, కొంతవరకు చరిత్రాత్మకములైన చిత్రకథా కావ్యములను వ్రాసినవారు జక్కనయు అనంతామాత్యుడును.

సంస్కృతనాటకమును తెలుగుప్రబంధముగా అవతరింపజేసిన వారు నందిమల్లయ, ఘంటసింగయ.

మొత్తముమీద వీరందరి యత్నములును ప్రబంధ రచనోన్ముఖములుగానే పరిణమించినవి. ఆశాఖకు తగిన దోహద మంతయు ఇయ్యెడనే యేర్పడెను. ఈకాలమున వెలసిన పురాణ ములయందు సైతము పురాణేతిహాసోచితమైన సాధుత్వము తగ్గి ఆలంకారిక శైలి (Ornate Style) యేర్పడుటచే, ఈకాలమును పురాణప్రబంధముల సంగమస్థానముగా చెప్పుకొన వచ్చును. ఎఱ్ఱనలో బీజముగను, సోమనలో అంకురముగను పొడచూపిన ప్రబంధలత, ఈకాలమున కొనలుసాగి చిగిర్చి మారాకువేసినది. ఇది పుష్పఫలసమన్వితమగుట రాయలకాలమున. మరియు ఈ శకప్రారంభదశలో కొండవీడును, మధ్యకాలమున రాజ మహేంద్రవరమును, తుదకు విజయనగరమును సాహిత్య పీఠ ములుగా ఏర్పడినవి. రాబోవుయుగమున అచ్చటనే రాజసింహా సనముప్రక్క కవిరాజుసింహాసనమును నెలకొల్పబడినది.

కృష్ణరాయల యుగము (1500–1600)

మూడుశతాబ్దులుగా ఆంధ్రులు చేసిన తపస్సు ఫలించిన దేమో అనునట్లు సమగ్రదక్షిణభారతవ్యాప్తమైన ఆంధ్రమహా సామ్రాజ్యమేర్పడి, ప్రజలు వైభవోత్సాహపూర్ణులైరి. ఆ సామ్రాజ్యస్థితికి హేతుభూతుడైన శ్రీకృష్ణరాయలు సరస్వతి సేవాసక్తతగల సహృదయుడగుటచేత, సామంతరాజులకంటె ముందు కవిరాజులకే మర్యాదలు జరిగినవి. ఆపూజలందుకొన

వలెననియు, ఆవహారాజు ప్రాపుపొందవలెననియు ఉత్కంఠతో, కవులొకరిని మించి యొకరు కావ్యరచనలకు దొరకొనిరి. భోజరాజాస్థానమును గురించి విన్న కథలు కట్టుకథలుగను, రాయల ఆస్థాన సాహితీగోష్ఠి యథార్థమును అయ్యెను. ఈమహాస్థానములో చేరిన యితరదేశభాషావిపండితసమక్షమున విద్యాప్రసంగములలో, కవితాపరీక్షలలో "దేశభాషలందు తెలుగులెస్స" అనెడి సిద్ధాంతము, అపవాదముగాని, పూర్వపక్షముగాని లేకుండ నిరూపితమయ్యెను.

నూత్నతేజముతో వెలుగొందు ఈ సామ్రాజ్య వైభవముతోపాటు నవనవోన్మేషమైన స్వతంత్రసారస్వతరూపముకూడ వెలసినది. అదియే మన నవ్యకవితోద్యమములలో మొదటిది (The First Romantic movemet). అదియే ప్రబంధావిర్భావము. ఈప్రబంధమే ఆంధ్రులు తమ ప్రత్యేకకావ్యసిద్ధిగా కొనియాడు కొనదగిన ప్రక్రియ. అన్ని కావ్యభేదములును రాశీభూతమై ఒకచోటనే కానవచ్చు క్షేత్రము ఇదియే. పురాణమహారణ్య సంచారమును వదలి ఆంధ్రసరస్వతి విహరించిన ఉద్యానవనమును ఇదియే. రాయల ఆదేశమున, ఈ ఉద్యానపాలకతా భారమును మొదట వహించిన మహాపురుషుడు ఆంధ్రకవితా పితామహుడు, అల్లసాని పెద్దన.

మనుచరిత్రము శాంతశృంగారప్రవాహములు సంగమించిన తీర్థము. సమాజశృంగారప్రియుడైన కవి శాంతోన్ముఖుడైనపుడు రచింపబడిన గ్రంథమని అందలి ప్రతిపరికరణమును

చెప్పక చెప్పును. ఈ ఉభయరసస సంఘర్షణమే ఆ కావ్యములోని శిల్పరచనకు మూల ప్రకృతి. ఆసంఘర్షణము తాల్చిన మొదటి రూపమే వరూథినీ ప్రవరాఖ్యుల నెడిజంట. కావ్యపూర్వార్ధమున తాండవించు ఈ రెండుపాత్రలు పెద్దనగారి పాత్రనిర్మాణసిద్ధికి, సంభాషణ చాతుర్యమునకు, బుద్ధివిన్యాసమునకు, అంగాంగి రసముల సముచిత పరిపోషణకు లక్ష్యభూతములుగా నున్నవి. అంత ఆత్మికశక్తితో సృష్టించిన పాత్రలు కావుననే వరూథినీ ప్రవరాఖ్యులు నేటికిని సజీవులై యున్నట్లే భావుకుల మనోనయనములకు గోచరించుచున్నారు. మనుచరిత్ర పుట్టినది మొదలు వలపు ప్రయోగమునకు రంభను, జితేంద్రియత్వమునకు శుకమహర్షిని పేర్కొనుట మరచి, ఆంధ్రులు వరూథినీ ప్రవరులను చెప్పుకొనుచున్నారు. ఆపాత్రల సజీవతకు ఆంధ్రుల మనఃప్రపంచమున అవి కలిగించిన పరివర్తనమునకు ఇదియే తార్కాణము. తిక్కనగారు సృష్టించిన భారత పురుషులకు పిమ్మట పాఠకలోకములో ఇంత సన్నిహితత్వముగల పాత్రలు, భారతమునకును మనుచరిత్రమునకును నడుమ వెలసిన వాఙ్మయములో ఇంకొకచోట లేవు. ఈరెండుపాత్రలను దిద్దుటలో కవి వహించిన నాటకీయతటస్థపద్ధతి (Dramatic Objectivity) శ్రవ్యకావ్యకర్తలకెల్లరకును సాధ్యమైనదికాదు. మనుచరిత్రమును చదివిన రసికు లెవ్వరును, వేశ్య యనిగాని, శ్రోత్రియునకు వ్రతభంగము చేయనెంచిన వలపుకత్తె యనికాని వరూథిని గర్హింపరు. మీదుమిక్కిలి ఆమె యనురాగము

అస్థానపతితమైనదని చింతిల్లు సహృదయులును ఉందురు. ఆమెవలలో పడక ధీరుడై తప్పించుకొన్న ప్రవరుని దలచి భక్తిపూర్వకముగా మరల వారే జోహారు లొనరింతురు.

శైలిలో శ్రీనాథుకు పెట్టిన ఒరవడిని పెద్దనగారు చక్కగా అనుకరించి, ఆయనకు పరోక్షశిష్యుడయ్యెను. అట్లయ్యు, ఇరువురకును కొంత వాసియుకలదు. ప్రాయికముగా శ్రీనాథుని వాగ్గాంభీర్యము దుందుభిధ్వానము వంటిది. పెద్దనగారి వాక్కు అపేలవముగా, మంద్రముగా వినవచ్చు మృదంగనాదమువంటిది.

అల్లసాని పెద్దన రాయలయాస్థానమున అగ్రపూజలందగా, అయ్యెడనేకాక, అంతఃపురమునను చనవులందినవాడు నంది తిమ్మన. ఆ చనవుబలిమినే ఈ కవితల్లజుడు తన కృతికన్యను (పారిజాతాపహరణము) అడుగకయే రాయలకిచ్చెను.

మనుచరిత్రకు పూర్వభాగమువలె, ఈ పారిజాతాపహరణమునకు ప్రథమాశ్వాసము ప్రాణతుల్యము. వర్ణనాబాహుళ్యమును, కథావిస్తృతియు లేని ఆ చిన్నప్రబంధము దక్షిణాంధ్రకవులలో పెక్కురకు మార్గదర్శకమయ్యెను. నాయకరాజుల కాలములో వెలసిన సత్యభామాసాంత్వనము, రాధామాధవ సంవాదము మొదలైన విప్రలంభశృంగార కావ్యములన్నియు, తిమ్మనగారి పారిజాత వాసనలు సంతరించుకొన్నవే.

అయ్యలరాజు రామభద్రుడును, మాదయగారి మల్లనయు ఏదో కొంత విశిష్టతయుండుటచేతనే అష్టదిగ్గజములలో

చేరగలిగిరి.

ఈ వర్గములో చేరని ఇంకొక మేటికవి ధూర్జటి. శ్రీకాళహస్తి మాహాత్మ్యము కేవల ప్రబంధము కాకపోయినను కొంతవఱకు ఆ లక్షణములు కలది. అందులోని ప్రకరణములు, ధూర్జటి లోకవృత్తి పరిజ్ఞానమునకు నిదర్శనములుగా నున్నవి. ఆయనకీర్తిని అజరామరము చేయుటకు ఒక్క-కాళహస్తీశ్వర శతకమే చాలు. మన వాఙ్మయములోని ఉత్తమోత్తమ శతకములలో ఇది యొకటి. జగద్వంచనయు, ఆత్మవంచనయు చేయక పొంగిపొరలెడి హృదయావేదన నంతయు ధూర్జటి ఈ శతకమున సర్భయముగా చాటుకొనెను. సంసారోపయోగ కామము, ఉపేక్షించీ ఉపేక్షించని శత్రుత్వము, తిరస్కరించీ తిరస్కరించని రాజద్వారములు, మొదలగు బంధముల చిక్కి వానిని త్రెంచుకొనలేక అంతరయుద్ధము చేయు ధూర్జటి, మరల చిక్కనగజేందుని తలపించుచుండును. ప్రవృత్తినుండి నివృత్తికి, భోగమునుండి త్యాగమునకు, మరలిమరలని తన చిత్తమునకు శక్తి చాలదని గుర్తించి, ఆశక్తినకుగ్రహింపుమని అశ్రుప్రవర్షముతో ఈశ్వరుని ప్రార్థించు ధూర్జటి యాక్రోశము, ఊబిలో దిగబడిన ఆబోతురంకెవలె వినవచ్చుచుండును. ఇంతటి అంతశ్శుద్ధిగల కవిత్వము సర్వత్ర లభించుట దుర్లభము.

ఈ కవివర్గము నెడి మణిహారమునకు మేరుపూస శ్రీకృష్ణదేవరాయలు. ఆముక్తమాల్యద ఈ రాజకవి కృతియే. పెద్దన కృతము కాదు. రాయల సాహిత్యకీర్తికి ధ్వజప్రాయమైన

ఈకావ్యము, సామ్రాజ్యము సర్వథా, సంపన్నమై నిరుపద్రవమైన దినములలో వ్రాయబడినది. విష్ణుచిత్తుని యొక్కయు, తత్పుత్రిక యొక్కయు, భక్తిపరిపాకతే గ్రంథ పూర్వాపరభాగముల నాశ్రయించియున్నవి. గోదాదేవి యువతిగనుక ఆమెభక్తి శృంగారరూపమును దాల్చినది. ప్రధాన ప్రతిపాద్యమగు విష్ణుభక్తికి పోషకములుగా అక్కరకు రానట్టి ఉపాఖ్యానములను రాయలు, కొన్ని ప్రాసంగికములకు స్థానముకల్పించి అతికెను, ఆ యతుకుగలయే కావ్యబంధమునకు వెక్కిరించినది. అయినను, అద్వితీయమైన మేధావంతుని తేజము సర్వత్ర తానయై వెలుగుచు అధికారి కాగతమ్యముననుసరించి భిన్న భిన్న రూపములు బొందుచు, ఎల్లయెడల ధ్వాంతనాశనము చేయుచున్న రహస్యము, అనేకవిధముల ఈకావ్యము వ్యక్తము చేయుచున్నది.

అతితీక్ష్ణమైన భావనలో రాయలు ఒక్కొక్కవేళ తిక్కనను తలపించుచుండును. కాని దురదృష్టవశమున బహుభాగముల ఆశక్తిమరుగుపడిపోయి భావనకు ఆభాసమైన ఊహవిజృంభించు చుండును. పద్యరచనలోకూడ ఇట్టి గుణదోషమిశ్రభావమే కలదు. ఒకొక్కయెడ ముక్కతిమ్మనవలె ఎంతో ముద్దుగా వ్రాయ నేర్చిన ఈ కవి, మరొక్కయెడ మునుపు నారికేళ పాకమునకు మురియుచుండును. అట్టిచోట్ల, భావవ్యక్తికుదురక పెనగులాడువానివలె కన్పట్టును. సహజముగా సంస్కృతకవియై యుండి, కాలక్రమమున తెలుగుకవిత్వము నభ్యసించినాడేమో అనుటకు అట్టి పద్యములే నిదర్శనములు.

నన్నెచోడుని తరువాత ఇంత వర్ణనాకుతూహలము గల కవి ఇంకొకడు లేడు. ఒక్కొక్కచోట మూడు ఋతువులను వర్ణించిన మేటితనము ఆయనకే చెల్లినది.

రాయలనాటి ఆచారవ్యవహారము తెలుగవలెనన్నచో, ఈ గ్రంథమువలె మరే గ్రంథమును అక్కరకురాదు. ఇతర గ్రంథములలో నామమాత్రమునకైనను పేర్కొనబడని పేద సాధులయు, సంపన్న గృహస్థులయు సాంసారిక స్థితిగతులను ఎన్నిటినో వర్ణించి, రాయలు తన ఏలుబడిలోని ప్రజల జీవితములు అద్దము నందువలె గోచరించునట్లు లోకమున కనుగ్రహించెను. ఆ ఘట్టమున వ్యక్తమగు రాయల ప్రకృతిపరిశీలకత, లోకవృత్త పరిజ్ఞానము అన్యకవిరాజదుర్లభములు. ఈప్రజ్ఞకుతోడు ఆయన చూపిన బహుశాస్త్ర పరిజ్ఞానముకూడ అన్య రాజదుర్లభమే.

సంకుసాల నృసింహకవికి ఆస్థాన ప్రవేశము దొరకలేదు గాని, అష్టదిగ్గజములలో చేరవలసినవాడే. యతిని విటునిగాజేయు శృంగారమును, విటుని యతిగాజేయు వైరాగ్యమును వర్ణించుట యాయనకే చెల్లినది. ఈ కవిత్వములో పూర్వకవుల అర్థసౌలభ్యమును, ప్రబంధకవుల శబ్దజటిలతయు ఎడములేక హత్తుకొనియుండును.

రాధామాధవ ప్రబంధము వ్రాసి, రాయలమెప్పించి "రాధామాధవకవి" యనెడి బిరుదనామమును పొందిన చింతలపూడి ఎల్లనార్యుడును, తన శృంగారమల్హణ చరిత్రమును

రాయలకే కృతి యీయఁదలచి ప్రతికూల కాలవశమున మనోరథ పూర్తికై యితరుల కిచ్చిన ఎడపాటి ఎట్టిదయు, రాయల దర్శనభాగ్యము ననుభవించిన సమకాలిక కవులే. పింగళి సూరనాదులకు ఆ భాగ్యము లేక పోయినది. వారు ఆ యాస్థాన వైభవమును స్మరించుకొనుమాత్రమే తనివిచెందిరి.

ఆంధ్ర కవులలో నిరుపమాన ప్రతిభా సాకల్యముగల తిక్కన సోమయాజికి ధర్మాచార్యకత్వమున పోతనామాత్యుడువలె, శిల్పాచార్యకత్వమున పింగళి సూరన సాటి. కళాపూర్ణోదయము స్వతంత్రసృష్టి యగుటయు భారతము అనువాదమగుటయు కారణములుగా, తిక్కనకంటె సూరనకు నూత్న నిర్మాణకౌశలాది శిల్పప్రదర్శనమునకు ఎక్కుడు సదవకాశము చిక్కినది.

మన సారస్వతములో అచ్చటచ్చట మొదటినుండియు సకృత్తుగా పొడసూపుచువచ్చిన శ్లేషకవిత్వ రచనకు సూరన రాఘవపాండవీయము పరిణామరూపము. తరువాత వెలసిన ద్వ్యర్థి త్ర్యర్థికావ్యము లన్నియు ఈ మాతృస్తన్యమును గ్రోలిన శిశువులే.

కళాపూర్ణోదయము, అప్పటి కవిపండితలోకమున ఒక మహాసంచలనము కల్గించియుండును. కృత్రిమ రత్నమనికొందరు, వేశ్యానాయికమని కొందరు, వంకర కథయనికొందరు, ఇంకేమో యని మరికొందరు, ఆ కావ్యరత్నమును ఆక్షేపించియుందురు. విశ్వలీలకు ఆదికారణముగు శృంగారభావము, ఆలంబన

తారతమ్యమును బట్టి ఎన్నివిధముల వర్తించుచుండునో, ఎట్టి రూపాంతరముల పొందుచుండునో ధ్యానించి, సాక్షాత్కరింప జేసికొని, ఆ దర్శనమునకు రూపకల్పన మొసంగుట బ్రహ్మ సంకల్పమునకు అర్థము చెప్పుట. ఈ కావ్యమున ప్రతిపాదింపబడిన ధర్మరహస్యమిది. కళాపూర్ణోదయము నాగా ప్రణయదేవతా విశ్వరూపప్రదర్శనము. ఈ రహస్యము వ్యక్తీకరించుటకు, పురాణేతిహాసములలో ఏ ఉపాఖ్యానములును సూరనకు అక్కరకు రావు. కావుననే తన ప్రపంచము తానే సృష్టించుకొనెను. అది బ్రహ్మసృష్టియని తెల్పుటకే కథాబీజము బ్రహ్మమానసక్షేత్రమున నాటెను.

మరియు, ఆంధ్ర ప్రబంధకవులలో ఇంత మనోధర్మ విజ్ఞానముగల కవి ఇంకొకడుండెనా అను ప్రశ్నకు నెంటనే సమాధానము చెప్పుటం కష్టమే. కావ్యపాత్రలకు ప్రాణ ప్రతిష్ఠ చేయునది కవిలోని ఈ మనోధర్మ విజ్ఞానమే.

చూడచూడ, ఈయన స్త్రీ పాత్రములు పురుష పాత్రములకంటె మేల్తరములుగా గోచరించును. అట్లనుటచే ఆ పురుషచిత్రముల ఆకార రేఖలుగాని మనోభావములుగాని చెడిపోవని తలంపరాదు. మరేమన, లోకములో ప్రణయ రహస్యమునందు పురుషులకంటె స్త్రీలు ఎట్లుగంభీరతరవర్తనలుగా నుందురో, అట్లేసూరన సృష్టించిన శృంగారప్రపంచమునందును స్త్రీపాత్రలే గంభీర తరములుగా నుండును. మనప్రబంధములు పెక్కు, నాయక ప్రధానములుగానే వెలువడినవి; నాయికా

ప్రధానములయినవి చాలా తక్కువ. ఆ యున్నవానిలో కళాపూర్ణోదయము ఉత్తమోత్తమము.

శృంగార భావమును విషాదరేఖా శబలితము చేయుట ఈయన శిల్పధర్మములలో ఒకటి. ఆ విషాదము కేవలము దుఃఖాత్మకమే కాదు, అద్భుతావహముకూడ. అట్లయిననే కాని అది పుష్టినొందదనియు, ప్రీతిగొల్పదనియు ఆయన మతమో, లేక అనురాగమునకును త్యాగమునకునుగల సన్నిహితత్వమును ఎరుక పరచుటకో, పెక్కు చోట్ల ఆ సంకలనము చేయును. శృంగారానుభూతి ఇన్ని క్లేశములు తరించిన పిమ్మట లభింప వలసినదేగాని, మాటమాత్రమున చూపు మాత్రమున అందదగినది కాదు కాబోలు.

ఈ స్త్రీ పాత్రలలో ప్రేమమూర్తులు కొన్ని, ప్రజ్ఞామూర్తులు కొన్ని (Characters of Love and Characters of Intellect). ఆ ప్రజ్ఞామూర్తులలో శుచిముఖివంటి బుద్ధిశాలిని మరి యే వాఙ్మయమునను లేదు.

చింతానిమగ్నులును, ఇతికర్తవ్యతామూఢులును అయి యున్న ఇంద్రోపేంద్రులకు కర్తవ్యముపదేశించిన గురువును కార్యమును నిర్వహించిన మంత్రియును, అగు ఆరాజహంసిని సృష్టించుకొరకే నూరన, ప్రభావతీ ప్రద్యుమ్నమును సంకల్పించియుండును.

అన్ని పురాణగాథలవలెనే హరివంశమునందలి ఈ కథయు అసంగతములు అసందర్భములునగు అంశములతో నిండి,

జల్లికూర్పువలె నున్నది. సూరనార్యుడు ఆ కథను సర్వవిధముల పరిష్కరించి, పురాణగాథలను ప్రబంధీకరించు ఆంధ్రకవుల వస్తునిర్మాణశక్తికి ధ్వజప్రాయమైన ప్రభావతీ ప్రద్యుమ్నమును నెలకొల్పెను. "ఏయర్థమును దగులొక్కనదివియక వెలివో నిచ్చునె బుధుడూహించి చేయుసుకవిత్వంబుల్" "అచ్చపుబుద్ధికి లేవగమ్యముల్" అని సందర్భవశమున సూరన చెప్పిన ప్రజ్ఞా విశేషములు రెండును ఆయనవే. ఈ రెండు కావ్యములును ఏతత్ప్రజ్ఞామహితములే.

సూరనవలె రామరాజభూషణుడును కథను నాటకీయముగా నడపవలెనను కుతూహలముకలవాడే, అయినను వసుచరిత్రమున వస్తుసన్నివేశములను నాటకీయముగా పొందింప గలిగెనేగాని సజీవపాత్రసృష్టి చేయలేకపోయెను. వరూథినీ ప్రవరులవలె, కలభాషిణీ మణికంధరులవలె గిరికా వసురాజులు సజీవమూర్తులు కారు. అయిన నేమాయె, వసుచరిత్రకు మన వాఙ్మయమున మహాప్రాభవముకలదు. ఆంధ్ర కావ్యములలో అంత ప్రౌఢసాహిత్యముగల కావ్యము ఇంకొకటి లేదని బహుపండితుల అభిప్రాయము. అదియునుగాక, లయయు గమకమునుగలిగి కీర్తనవలె పాడదగిన పద్యము, కమ్మచ్చు తీసినగతి జవరగా సాగివచ్చు పద్యపాదములు, అప్రయత్న సిద్ధములైన వ్యంగ్య శ్లేషాదులు, నానాశాస్త్ర నిష్ణాతమైన కవి వైదుష్యము కారణములుగా, ఈ గ్రంథమునకు రావలసిన మహాఖ్యాతి వచ్చినది. ప్రౌఢ కవులనిపించుకొనవలచిన

వారెల్లరును దీని ననుకరింప మొదలిడి, ఎన్నియో పిల్లవసుచరిత్రలను వ్రాసిరి. అవియన్నియు నామమాత్రానుకరణములే. వారిలో అద్దంకి గంగాధరకవి తప్ప, తక్కిన వారందరును క్షీణయుగమున లోనివారు. వారి అనుకరణాభిలాషయే ఆ యుగమునకు క్షీణత నాపాదించినది.

కథ భరించలేని వర్ణనల వర్ణనములయందును, అనావశ్యక శ్లేషసంపాదనమునందును రామరాజభూషణునకు అంత రక్తియుండుట శోచనీయము. సందర్భోచితముగా సహజముగానున్న శ్లేషలన్నియు పర్వతి విరోధఘట్టమున నున్నవి. శ్లేషపోషణమునందే కాక, కథన సంవాదములయందును ఈఘట్టమే ఎక్కువ చమత్కారాపాదిగానున్నది. అనగా కథకారక వస్తువుకంటె ప్రాసంగికమే విస్తరముగానున్నది.

వీరితో సమప్రాధాన్యము కలవాడే తెనాలి రామకృష్ణకవి. ఈయన రాయలకు సమకాలికుడును అర్వాచీనుడును అగును. సమకాలికుడయ్యు "దిగ్గజము" మాత్రము కాడు. ఉద్భటారాధ్యచరిత్ర, పాండురంగ మహాత్మ్యము, ఘటికాచల మహాత్మ్యము అనుమూడు కృతులలో. ఈయన యశమునకు నిధానమైనది పాండురంగ మాహాత్మ్యము మాత్రమే. వీనిలో మొదటి రెండిటికిని ఏకోదరత్వమును సమర్థించు పోలికలు చాల గలవు. ఈ రెంటిపుట్టుకకును నడుమ చాల కాలవ్యవధియు నున్నది. ప్రథమరచనలో భాష ఎంతస్ఫుటముగ నున్నదో భావముకూడ అంత ప్రసన్నముగా నున్నది. రెండవదానిలో

క్వాచిత్కముగా అప్రసన్నశకలము. అయినను స్వతంత్రములును గంభీరములును అయిన భావములకు, ఆ భావములను వ్యక్తము చేసిన ప్రౌఢపదగుంఫనకు ఆకరమైన ఈ గ్రంథము భావగతియందును భాషాగతియందును రామకృష్ణునకుగల విశిష్టతకు నిధానమై వెలయుచున్నది. ప్రౌఢసరస్వతి యనఁదగిన నిగమశర్మ యక్కగారు. ఆంధ్రులు మరచిపోఁగూడని ఆడుపడుచు.

వీరి తరువాత పేర్కొనఁ తగినవారు సారంగు తమ్మయ్య, చదలవాడ మల్లయ్య, కందుకూరి రుద్రయ్య, పొన్నగంటి తెలగన్న, అద్దంకి గంగాధరకవి. వీరిలో మొదటి ఇరువురును శృంగార హాస్య ప్రధానములుగా, పరమభక్తుఁడగు విప్రనారాయణు కథను వేశ్వైర కావ్యములు వ్రాసిన సాధురచయితలు.

కందుకూరి రుద్రయ్య, ఒకవిధమైన సాంఘికేతి వృత్తమును ప్రబంధీకరించిన స్వతంత్రుఁడు. శ్రీనాథుని గుణనిధియు, రామకృష్ణుని మదాలస నిగమశర్మలును, రుద్రకవి నిరంకుశుఁడును సతీర్థ్యులే; కాని ఈనిరంకుశుఁడు వారివలె ఏ క్షేత్రమాహాత్మ్యము వల్లనో, ఏశివరాత్రి జాగరమువల్లనో అకస్మాత్తుగా మోక్షమును పొందినవాఁడు కాఁడు. ఆ క్షేత్రమాహాత్మ్యములును, ఆ కథలలోని పరిణామ కృత్రిమత్వము రుచింపక కాఁబోలు, రుద్రయ్య తన గ్రంథమున ఒక నూత్న సిద్ధాంతమును ప్రతిపాదింప నెంచెను. కాని దానిని సహజముగా సాగనీయక తుది భాగమున తానును ఒక కృత్రిమకల్పనమే చేసెను. అందుచే, ఈయన కల్పించు

కొన్న సమస్య సమ్యక్పరిష్కృతము కాలేదు. రుద్రియ కీర్తిని చిరస్థాయిగ నిలుపుటకు నిరంకుశో పాఖ్యానమే అక్కరలేదు. జనార్దనాష్టకమే చాలును. మేఘసందేశమందు కాళిదాసు వర్ణించిన మందాక్రాంతమువలె. రుద్రియ భావానుగుణమగు వృత్తము నేరికొని, వృత్తగతమైన గీతికి అనురూపమైన భాష నేరికొని, క్షేత్రియ పదములవంటి సొగసుదనపు కుప్పలైన ఎనిమిది జనార్దనాంకిత పుష్పగుంజకులను—ఎన్నటికిని వాడని వానిని—ఆంధ్రలోకమునకు అర్పించి పోయెను. పూర్వ ప్రబంధకర్తలలో మొదటియక్షగానకర్తయు రుద్రయగానే కానవచ్చుచున్నాడు. అదే సుగ్రీవ పట్టాభిషేకము.

పొన్నగంటి తెలగన్నకు గల ప్రత్యేకత, అచ్చతెలుగు కావ్యరచన. పూర్వగ్రంథములలో క్వాచిత్కముగానున్న శ్లేష పద్యములనుచూచి, ప్రత్యేక శ్లేష ప్రబంధము చేసిన పింగళి సూరనవలె, తెలగన్నయు, పూర్వులలో అచ్చటచ్చట కానవగు అచ్చ తెలుగుపద్యములనుచూచి, ప్రత్యేకముగా అచ్చతెలుగు ప్రబంధము వ్రాయబూనెను. ఆయనవలె ఈయనయు తన చిత్రప్రక్రియలో ప్రథముడగుటయేగాక ప్రముఖుడును ఆయెను. యయాతిచరిత్ర తరువాత, అచ్చ తెలుగు రచనలను సాగించిన వారిలో, ఏమాత్రమో కూచిమంచి తిమ్మకవికి తప్ప, తక్కిన వారికి తెలగన్న సఫలత అబ్బలేదు. ఈ అచ్చ తెనుగురచనలు శుద్ధకృత్రిమములని నాతలంపు. వానిలో అచ్చ తెనుగు లేదు సరికదా, తత్సమ తద్భవ దేశ్యాత్మకమైన ఆంధ్ర భాషలో,

తత్సమము బరిహరింపబడుటచే భాషాసౌష్ఠవము కూడ లేకపోయినది.

ఈ శతాబ్దిని పేర్కొనబడవలసిన కవులు లెక్కకు మిక్కిలిగానుందురు. ఈ స్థూలచరిత్రలో వారి కందరకును తావులేదు.

దక్షిణాంధ్రయుగము (1600-1775)

ఈ యుగమునకు మూలపురుషుడు విజయవిలాసకృతిపతి అచ్యుతేంద్ర రఘునాథరాయలు. ఈయన తంజావూరు నాయక రాజులలో మూడవవాడు. విజయనగరరాజ్యము, ప్రాభవము నందువలె సారస్వతమునందును క్షీణదశనొంది, ఆ రాజవంశీయులలో పునరుద్ధరింపగల సమర్థులెవ్వరును లేని స్థితిలో, కవియు పండితుడు, కవిపండితపోషకుడు అగు రఘునాథుడు తంజావూరిలో తలయెత్తి ఆంధ్రవాణికి ఆశ్రయములేని లోటును సవరించెను.

ఈ శతాబ్దికి ప్రారంభముననే, రఘునాథరాయల అభ్యుదయమునకు కొంచెము ముందుగాను కువలయాశ్వచరిత్ర, బహులాశ్వచరిత్ర మొదలగు కొన్ని ప్రబంధములు పుట్టినవి. వానినన్నిటిని ఈ యుగమునకు పూర్వరంగముగా భావింపవచ్చును.

కృష్ణరాయల కీర్తిప్రతాపములకు తొలుదొల్త ఉదయగిరివిజయము ఎట్లు హేతుభూతమయ్యెనో, రఘునాథుని కీర్తి ప్రతాపములకును తొలుదొల్త తోపూరు విజయము అట్లే

హేతుభూతమయ్యెను. ఇందేకాదు, ఈ రాజులకిరువురకును పెక్కింట సామ్యములు కలవు. ఇరువురును మహావీరులు. ఇరువురును ప్రజారంజకులు. ఇరువురును సహృదయులు. ఇరువురును కవులు, గ్రంథకర్తలు. ఇరువురును లక్ష్మికంటె సరస్వతికే ప్రథమ పూజచేసిన సారస్వత భక్తులు. తుదకిరువురును నడివయస్సునందే మృత్యుగోచరులైనవారు. కృష్ణరాయలకు నలుబదియారేండ్లకును, రఘునాథునకు నలుబదియేండ్లకును నూరేండ్లు నిండినవి. ఈ మహాపురుషులిరువురే పూర్ణపురుషాయుషజీవులైనచో ఎన్ని మనుచరిత్రలు, ఎన్ని విజయవిలాసములు పుట్టెడివో!

ఈ రాజకవి మూలముననే దక్షిణాంధ్రమున తంజావూరు ముఖ్య సాహిత్యకేంద్ర మయ్యెను. ప్రాధాన్యమును బట్టి రెండవ కేంద్రము మధుర. మూడవది పుదుకోట.

ఈ యుగమునకు విశిష్టతను సంపాదించిన అంశములలో మొదటిది కావ్యస్వరూప వైవిధ్యము. వారుసృష్టించిన సాహిత్యములో సంప్రదాయసిద్ధములైన పూర్వ ప్రబంధములవంటి ప్రబంధములును కలవు. తెలుగున క్రొత్తగా కేవల వచన కావ్యసృష్టి కావించినవారును వారే. గేయ కవిత్వమునకు ప్రబంధకవిత్వముతో సమానగౌరవము లభించినది ఆనాడే. ఎల్లెలలో పాడుకులాడు యక్షగానములను ఆస్థానకవులు చేపట్టి రాజాస్థానమును చేర్చిన శుభ కాలమును అదియే. మనకు సాంఘిక కావ్యములు లేని నెడి లోటుతీర్చినదియు వీరే. కావ్యము లందు అనావశ్యక వేదాంతబోధను పరిహరించుటయేకాక

కళా సౌందర్యమునకును నీతిబోధకును సంబంధము లేదనెడి ఒక నూత్న సిద్ధాంతమునకు బీజము నాటినవారును వారే. రచనా సౌలభ్యమునకై ఔచిత్యమునుబట్టి కొన్ని వ్యాకరణ నియమములను ఉల్లంఘించిన స్వతంత్రులునువారే. కవులతోపాటు కవయిత్రులును వర్ధిల్లుట ఆనాడే.

ఈ దాక్షిణాత్యకవులందరకు విలాసలిప్సంత, శృంగార ప్రియత్వము, హాస్యచతురత ముఖ్యలక్షణములు. వీరు రాజదత్తములైన భోగములను భగవద్దత్తమైన శరీరారోగ్యముకలిమి, తనవితీర అనుభవించిరే కాని, జీవితము నెడ ఔదాసీన్యమును ప్రపంచము నెడ వైరాగ్యమును వహించినవారు కారు; పరము మాట అటుండగ, వారు "రేపు" అనెడి మాటనే యెరుగరు; వెల్లివిరియు ఉత్సాహముతో పాడినపాటలకు, వ్రాసిన పద్యములకు రసోద్దీప్తినే ఆశించిరిగాని వేరు ప్రయోజనము పేక్షించ లేదు. వీరికి నైతికనిష్ఠ లేకపోవుటచే ఆ కావ్యములలో పెక్కింటికి ధర్మసౌందర్యలోపము వాటిల్లినది. మరికొన్నింట కథానిర్మాణమున బిగువులేక కూర్పుసొంపు చెడినది.

తంజావూరి కవులలో అగ్రగణ్యుడు చేమకూరి వెంకటపతి. తెలుగులోని మార్దవమెట్టిదో, తంజావూరి తెలుగులోని లాలిత్యమెట్టిదో లోకమునకు చూపిన గ్రంథము విజయవిలాసము.

ఈ చరిత్రభాగమునకు నాయకుడును, విజయవిలాసకృతికి పతియును అగు అచ్యుతేంద్ర రఘునాథ

నాయకుడును ఇంచుమించు వేంకటపతి యంతటికవియే. వాల్మీకిచరిత్ర ఆయన కవితా ప్రజ్ఞకు పరమనిదర్శనము. ఆయన ఆస్థానమునకు అలంకార ప్రాయులైన కవయిత్రులు మధురవాణి, రామభద్రాంబ అను ఇరువురు.

రఘునాథుని కుమారుడు విజయరాఘవుడు బహు యక్షగానములకర్త. ఈయన ఆస్థానము కీర్తనలు పండిన సుక్షేత్రము. ఈ రాజు ప్రియురాలు రంగాజమ్మ ఈయన కొలువుకూటమునకు వన్నె పెట్టిన ఒక కవయిత్రి. ఆంధ్ర జయదేవుడని పిలువదగిన క్షేత్రయ ఈ విజయరాఘవుని పరమమిత్రుడు. విజయరాఘవుని కుమారుడు మన్నారుదాసుకూడ యక్షగానకవియే.

వీరి తరువాత ఆ సింహాసనమెక్కిన మహారాష్ట్ర రాజులలోకూడ చాలమంది కవులును కవిపోషకులును కలరు. వారి రోజులలో యక్షగాననాటకము మరింత తామరతంపరగా పెరిగినది. ప్రబంధములలో ముఖ్యముగా పేర్కొనదగినది ముద్దుపళని రాధికా సాంత్వనము. రాధామాధవ ప్రణయాత్మకములైన శృంగార ప్రబంధములలో దీనిని పోలదగినది ఇంకొకటి లేదు. సందితిమ్మన మొదలైన ఖండిత నాయికా పాత్రవర్ణనలలో పందెము చరచిన జాణవలె, ఈ కవయిత్రి రాధికాశృంగారమును అతి నృష్టిగా కురియించినది. పుట్టుకచే వేశ్యయు, సంస్కారముచే సరసురాలును అయిన ఈమె, తానే స్వయముగా కావ్యనాయికయై, తన శృంగార హృదయమునే

చిత్రించుకొనెనా యని శంకింపదగి యుండును. ఆ నాటి ప్రబంధములలో కొన్నింట, దుస్సహ మనిపించు కామలీలా వర్ణన కలదు. అది యీప్రబంధములో దుస్సహతరమైనది.

మధురలో తిరుమలనాయుని రాజ్యపాలనముతోనే కావ్య రచనారంభమును అయినదని ఊహింపవచ్చును. తిరుమలునకును తరువాత అతని కుమారునకును ఆస్థానకవియైన లింగమఖి శ్రీ కా మే శ్వ ర క వి సత్యభామా సాంత్వనమునకుకర్త. ఈతని రెండవగ్రంథము ధేనుమాహాత్మ్యమనెడి వచనకావ్యము. శృంగారరాధామాధవ కర్తయైన నెలిదండల వేంకటపతి ఈ కాలమువాడే. రాధను పరకీయగా చిత్రించిన మొదటి తెలుగు ప్రబంధమిదియే. స్వే చ్ఛా ప్ర ణ య విహారసిద్ధాంతమును వాచ్యముగా ప్రతిపాదించిన సాహసుడును ఈతడే.

తంజాపురరాజులతో సా టి కి ని పోటీకిని నిల్వగల పాండ్యరాజకవి, విజయరంగ చొక్కనాథుడు. వారివలెనే విజయరంగడును స్వయము గ్రంథకర్త. ఇతని ఆస్థానకవులే కాక కొందరు రాజోద్యోగులును కావ్యకర్తలే. వారిలో చొక్క నాథుని సేనాపతియైన సముఖము వేంకట కృష్ణప్పనాయకుడు రెండు పద్యకావ్యములకును, రెండు గద్యకావ్యములకును కర్త. పద్యకావ్యములు రెంటిలో రాధామాధవ స ం వా ద ము ఖండకావ్యమని చెప్పదగిన ఏకాశ్వాసప్రబంధము. తారా శశాంక కృతికర్త శేషము వేంకటపతి, కృష్ణప్పనాయని మిత్రుడు.

తంజావూరు యక్షగానములకువలె, మధుర వచన రచనలకు ప్రసిద్ధికెక్కెను. ఆ వచనములలో పెక్కు ఇంచుమించు పూర్వప్రబంధములకును పురాణగాథలకును యథామాతృకము లైన దండాన్వయములు. శైలిలో అవి యంతప్రౌఢములో ఇవియు అంతే ప్రౌఢములు. నూతన కథాకల్పనలు గాని, శైలి సౌలభ్యముగాని ఆవచనములలో లేవు. అయినను మనకు ప్రత్యేక వచనములు లేనిలోటును మాత్రము ఇవి తీర్చినవి. చారిత్రకముగా వీని ప్రాధాన్యమును మరచుటకు ఎంత మాత్రమును వీలులేదు. ఇవి గాక, కర్తృత్వము తెలియరాని పంచతంత్రము, విక్రమార్కుని కథలు, భేతాళ పంచవింశతి మొదలైన వచన చిత్రాఖ్యానములు మరికొన్ని పుట్టినవి.

పుదుకోట రాజధానిగా, తొండమండలమును ఏలిన తెలుగు రాజులలో, రఘునాథ తొండమాన్ అను ఇంకొక రాజ కవి, నుదురుపాటి కవివంశమునకు ఆశ్రయమిచ్చి, వారిచే అనేక రచనలను చేయించుటేకాక తానును పార్వతీపరిణయ ప్రబంధమును రచించెను.

అపర పోతన త్యాగరాజు, దక్షిణాంధ్రకవులలో కాలమునుబట్టి చివరివాడు. మాహాత్మ్యమునుబట్టి వారికి శిరోభూషణమనదగినవాడు. ఆ సారస్వతాలయమునకు ఈ మహాభక్తుడే సువర్ణశిఖరము. దాని వెలుగు వెల్లువలో మనతో పాటు అరవ సోదరులును మున్కలువేసి పవిత్రులగుచున్నారు.

## క్షీణయుగము (1775—1875)

చోళ పాండ్య రాజ్యముల పతనముతో, సామ్రాజ్య స్థాపకులైన ఆంధ్రులకు సామంత రాష్ట్రములైనను లేకుండ పోయినవి. స్వాతంత్ర్య రహితములు, ప్రాచీనైశ్వర్యశూన్యములు అయిన జమీలు మిగిలినవి. జాతిముఖకళ క్షీణించినది. ఆక్షీణలక్షణమే కవిత్వమునకును పట్టినది. జాతియొక్క దారిద్ర్య పరాధీనతలే కవితలోని భావదాస్యపరాధీనతలకు కారణమైనది. మహోన్నతస్థితిలో ఉన్నప్పుడు జాతికి పరమ లక్ష్యములుగా వెలుగొందిన, ఉన్నతాశయములు నశించి క్షుద్రభావములు పొడసూపినట్లే, కవులలోను ఉదారాశయములు అడుగంటిపోయి క్షుద్రత తలసూపెను. పూర్వసామ్రాజ్య యుగములలో ఐహికాముష్మికముల రెండింటిని కైవసము చేసికొను సంకల్ప బలముగల మహావీరులు జన్మించినట్లే, ఆ ధర్మములనే ప్రబోధించు ఆత్మబలముగల కవులును జన్మించిరి. వారు వైచిన పునాదులమీదనే విజయనగరసామ్రాజ్య నిర్మాణము జరిగినది. దాని మహాభ్యుదయమే సారస్వతాభ్యుదయమునకు హేతువైనది. ప్రజలు ఆ యైశ్వర్య ప్రమత్తతలో పూర్వులు ఉపదేశించిన ధర్మనిష్ఠను కొంతవరకు మరచిపోయిరి. మరి, సామంతరాజుల కాలమునాటికి రాజులకును కవులకును ఐహికమే ప్రధానమై, ఒడలు తెలియని భోగలాలసతయే పరమపురుషార్థముగా పరిణమించినది. ఈ ధర్మభ్రంశము కలిగిన రోజులలోనే దేశము పాశ్చాత్యులపాలయ్యెను. ఆంధ్రులు

జీవచ్ఛవములైరి. ఆనాటి వారి ప్రబంధములును జీవచ్ఛవములే యయ్యెను. జాతిని పునరుద్ధరించి పూర్వప్రతిష్ఠను నెలకొల్పగల వీరుడులేనట్లే, నిస్తేజమైన సారస్వతమును పునరుద్ధరించి క్రొత్త మార్గమున నడపగల మహాకవి—యుగపురుషుడు కాదగినవాడు—లేకపోయెను. అందరును అస్వతంత్రులే. అందరును అనుకరణశీలురే. ఏ కవిలోను నూత్నత్వములేదు, జీవములేదు. ఇదియే ఈ యుగమునకు శ్రీ॥ యుగమని పేరు తెచ్చిన ప్రబల హేతువు. గ్రుడ్డిలో మెల్లగా వారిలో ఏమాత్రమేని గుణము కలవారు కంకంటి పాపరాజు మొదలైనవారు.

వస్తుతత్వమునుబట్టి ఉత్తరరామాయణము పురాణవర్గములో చేరదగినది. దానిని పురాణముగాచేయుంచి ప్రబంధ శైలిలో వ్రాసినవాడు పాపరాజు. ప్రబంధయుగములో పుట్టిన పురాణములు ప్రబంధ శైలితోను, పురాణయుగములో పుట్టిన ప్రబంధములు పురాణ శైలితోను ఉండుట కాలప్రభావమును బట్టియే. పురాణశైలి ప్రసన్న గంభీరమైన కరస్నది; ప్రబంధ శైలి తరంగఘోషతో దరులొరసికొనుచు పరుగెత్తు వర్షాకాల నది. ఈతని మిత్రుడు పుష్పగిరితిమ్మన్న గ్రంథరచనలో కొంత సాయము చేసినట్లు పీఠికలో ఉండుటచే ఇది తిమ్మనకృతమే యనువారును కొందరు కలరు. కాని తిమ్మనకృతమైన సమీర కుమారవిజయముతో దీనినిపోల్చిచూచినచో రెండింటికర్తలును వేరువేరని తెలియకపోదు.

మన రెండవ కవిసార్వభౌముడు కూచిమంచి తిమ్మకవి.

ఈయన బహుగ్రంథకర్త. అచ్చ తెలుగు రచనలను పునరుద్ధరించిన వాడీయనయే. తిమ్మకవి తమ్ముడు జగ్గకవి రచించినదే పేరెన్నికగన్న చంద్రరేఖావిలాపము. ఇది హేళన కావ్యమను పేరునకు తగని మోటు రచన. వీరికిర్వురకు బంధువును స్నేహితుడును అగు వక్కలంక వీరభద్రకవి వాసవదత్తా పరిణయకర్త. అడిదము సూరకవి కవిజనరంజనము—ఇంకొక పిల్లవసుచరిత్ర—ఈ కాలమునాటిదే. ఈయన చాటు పద్యములు ఆంధ్రమున్నంతవరకు ఉండునవి.

చిత్రకవి సింగనార్యుని బిల్హణీయము, కృష్ణదాసు రాధాకృష్ణవిలాసము, సంగమేశ్వరుని అహల్యాసంక్రందనము, చెళ్లపిళ్ల నరసకవి యామినీపూర్ణతిలకా విలాసము మొదలగు ఈ యుగములోనికొన్ని ప్రబంధములు దక్షిణాంధ్ర కావ్యముల ఛాయలుకలవి.

ఈకాలపు కవుల అనుకరణపరాయణతే శ్లేష కావ్య రచనలో ఎక్కువ కాన్పించును. తత్పూర్వము ఎనిమిది శతాబ్దుల కాలములో రెండుమూడుకంటె ఎక్కువగాలేని శ్లేష కావ్యములు ఈశతాబ్దిలో ఒక్కపెట్టున ఇరువదివరకు పెరిగినవి. వానిలో రెండర్థములేకాక మూడర్థములు కలవికూడ కొన్నియున్నవి. తాళపత్ర గ్రంథపరిశోధనలవల్ల నాలుగర్థములు గలవికూడ ఎప్పుడైన దొరకునేమో? ఈజాతిదేయయ్యు కొంతపేరుగడించిన కావ్యము పిండిప్రోలు లక్ష్మణకవి రావణదమ్మీయము. ఇందలి యితివృత్తము ఆత్మవిషయమగుటచే దీనికొక క్రొత్తదనము

వచ్చినది. శతుక్రుతాపకారమువలన కలిగిన క్రోధముఃఖమును స్ఫురింపజేయుచు రెండర్థములు సాధించిన లక్ష్మణకవి చమత్కారము మెచ్చదగియుండును. ఈయుగాంతముననున్న కవివర్గములో ఖ్యాతికెక్కిన కవి మండపాక పార్వతీశ్వరశాస్త్రి ఈతున వ్రాసినన్ని శతకములు తెలుగులో మరియేకవియు వ్రాయలేదు.

మన తెలుగు శతకములను గురించి చెప్పవలెనన్నచో అనేక ప్రత్యేక వ్యాసమగును. అట్టిది వీలులేదుగనుక యథాస్థానముగా ఆచరిత్రకొంత సంగ్రహపరచి చెప్పెదను. మొదటి నుండియు ప్రబంధ కవిత్వముతోపాటు శతకకవిత్వముకూడ కుడియెడమలుగా వర్థిల్లుచునే వచ్చినది. ఏ ప్రబంధకవియు ప్రారంభదశలో కొంతచాటు కవిత్వము చెప్పకయే అకస్మాత్తుగా ప్రబంధ రచనకు దూకుననుట తత్త్వవిరుద్ధమైనమాట. ఆ చాటు కవిత్వమువంటిదే శతకకవిత్వము కూడ. ఇందు పరిపాలింపబడ వలసిన మకుటాది నియమములు కవికి రచనా విషయమున మంచి యభ్యాసము నొసగును. ఈ యభ్యాసజన్యమైన ధారాశుద్ధి కలిగిన పిమ్మటనే పెద్దగ్రంథములరచించుటకు మార్గమేర్పడును. ఈ ధర్మమునుబట్టి చూచినచో ఇప్పుడు మనకు లభించిన వాఙ్మయముకంటె ఎక్కువ పరిమాణముగల చాటు శతక కవితా వాఙ్మయము నశించిపోయెనని చెప్పవచ్చును. దీనితోపాటు, ఇంతకంటె ఎక్కువ పరిమాణగల పదకవిత్వముగూడ నశించిపోయినది. అగోడవను

ఇది అదనుకాదు. పోయినవిపోగా మిగిలిన శతకములలో ఉత్తమోత్తమములైనవి, ఉత్తమ ప్రబంధములతోను ఉత్తమ భావ కవిత్వముతోను సర్వథా సాటి రాగలవి, భక్తి శతకములుకొన్ని, శృంగారశతకములు కొన్ని, కథాశతకములు కొన్ని, హేళన శతకములుకొన్ని, నీతి శతకములుకొన్నియు ఉన్నట్లు స్థూలముగా వర్గీకరింపవచ్చును. సూక్ష్మవిచారణమీద మరికొన్ని వర్గములునుతేలవచ్చును. శతకమునకు యథార్థముగా సంఖ్యానియమము ఉండదగియున్నను, ఆ నియమమును ఉల్లంఘించియు శతకములనిపించుకొన్న పద్య సంపుటములును కొన్నికలవు. వేమన పద్యములట్టివి. ఈ మహాపురుషుడు శాస్త్రాభ్యాసము, ఉపనిషత్ శ్రవణము మొదలగు సాంప్రదాయిక సాధనలు లేకుండగనే స్వయం కృషివలనను, గురూపదేశము చేతను జ్ఞానియై యోగసిద్ధి పొందిన ప్రతిభాశాలి; శాస్త్ర జ్ఞానరహితమైన ఆత్మజ్ఞానమెట్లు సంపాదించెనో, పాండిత్య రహితమైన పద్యరచనాశక్తిని అట్లే సంపాదించెను. ఆ రెండు శక్తులును ఆయన ప్రకృతికి సిసర్గములు. ఈపద్యములలో ప్రతి పంక్తియందును అమోఘమైన అంతఃకరణశుద్ధి జీవనాడివలె స్పందించుచుండును. తనఆశయములను నిర్భయముగా,నిష్కర్షగా వెలిబుచ్చుటలో ఈ యోగి లోకమునకును ఈశ్వరునకును వెరవలేదు. కాని వ్రాసిన పద్యసమూహమంతయు లోకము కొంకే, లోకభాషలోనే. ఆశబ్దములున్నియు ప్రతికుటీరములోను వాడుకలోనున్న వేకాని గ్రంథములనుండి కొనితెచ్చినవికావు.

ఏశతకకర్తయు ఇంతచక్కని వాడుకభాషలో ఇంతలక్ష్యశుద్ధి కలుగునట్లు నీతియుపదేశము చేసినవాడు లేడు. మరి తిక్కనకు కందపద్యమువలె, శ్రీనాథునకు సీసమువలె, వేమనకు ఆటవెలది కైంకర్యము చేసినది. నాఉద్దేశ్యములో ఆ పద్యసంపుటిని వేమంకవిత్వమనుటకంటె వేమన సుభాషితములనుట మేలు.

నేను ఉత్తమోత్తమములుగా భావించిన ఇతర శతకములలో ముఖ్యమైనవి ఇవి :— వృషాధిప శతకము, సర్వేశ్వర శతకము, శ్రీకాళహస్తీశ్వర శతకము, నారాయణ శతకము, ఇందుశతకము, సింహాద్రి నారసింహ శతకము, ఆంధ్రనాయక శతకము, దాశరథిశతకము.

అధునిక యుగము 1875—

పూర్వయుగములయందు వలెనే, ఈ యుగమునందును ప్రాచీనలక్షణములుగల సాహిత్యముకొంతయు, కేవల నవీన లక్షణములుగల సాహిత్యముకొంతయు కలదు. కాని మొత్తమువిూద చూచినచో, పూర్వరూపమున నున్న దానికంటె నవ్య రూపమున నున్న వాఙ్మయమే ఎక్కువని చెప్పవలయును. ఇందుచే దీనిని కాలమునుబట్టి అధునికయుగమన్నను గుణమును బట్టి నవ్యయుగ మనదగును.

ఈయుగమున పూర్వమార్గము ననుసరించినవారిలో ఆద్యుడు గోపినాథుని వేంకటకవి. తొల్లింటి రామాయణము లన్నియు యథామూలములు కావని ఈకవి మరల వాల్మీకి రామాయణము తెనిగించెను.

ఈయనవలెనే మరికొన్ని పురాణేతిహాసములు తెనిగించిన మహాకవులు మరికొందరు కలరు. వారిలో దాసు శ్రీరాములు పంతులుగారు, తిరుపతి వెంకటేశ్వర కవులు, త్రిపురాన తమ్మయ దొర, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు, వావిలకొలను సుబ్బారావుగారు జయంతి శేషాద్రిశర్మగారు ముఖ్యులు.

ఈపురాణములతో పాటు ప్రాచీన ధోరణిని మరికొన్ని ప్రబంధములు వ్రాసినవారును గలరు. వారిలో చాలమంది, శ్రీనాథుని ప్రబంధములకు ప్రతికలనో, ప్రతికాప్రతికలనో అవతరింపచేసినవారే. స్వతంత్రసృష్టి చేసినవారు తక్కువ. పూర్వపక్కి ప్రబంధములు వ్రాసియు వానికి నూతనత్వము ఆపాదించి, నవ్యకవిత్వమునకు నాందిపఠించిన కవులు తిరుపతి వెంకటేశ్వరులు. అందుచేతనే ఈ మహాకవుల వాక్కు ప్రాచీన సరణికి భరతవాక్యము, నవీన సరణికి నాందీవాక్యము అను పూర్వ మొకప్పుడు నేనంటిని.

క్రొత్తపోకడలలో పేర్కొనదగిన ప్రక్రియలు ముఖ్యముగా మూడున్నవి. ఒకటి వచనము, రెండు నాటకము, మూడు భావకవిత్వము. నవీన వచన గంగావతరణమునకు చిన్నయసూరి భగీరథుని వంటివాడు; దాని నానాముఖాభివృద్ధి పాత ప్రవాహగతికి హేతుభూతుడు వీరేశలింగము పంతులు గారు. ఒక్క కథానికతప్ప తక్కిన అన్ని వచనమార్గములను వీరేశలింగముగారే ప్రదర్శించిరి. నవల, విమర్శము, జీవిత

చరిత్రము, వ్యాసము, ప్రహసనము — ఇది యది యననేల వచన వాఙ్మయమున ఎన్ని భేదములుండునో అన్నిటిని సృష్టించి, దానిని సర్వభోగ్యమైన సంపదగా పంతులుగారు వెదజల్లిరి. తెలుగులో వీరి మొదటి నవలయగు రాజశేఖర చరిత్రము ఆంగ్లమున అనువదింపబడి ఇంగ్లీషువారిచే మిక్కిలి కొనియాడబడినది. ఆంధ్రులకిది గర్వకారణము. గురువుతీసిన దారినే మరికొన్ని సాంఘిక నవలలు వ్రాసినవారు చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు. వీరి శైలి వీరేశలింగముగారి శైలిలోగల సారళ్యముతోపాటు దానికి లేని సౌకుమార్యముకూడ గలది. మృదుల హాస్యము ఆ రెంటింటికి వన్నెపెట్టినది. ఆ తరువాత ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారిచేతిలో సాంఘికనవల సిద్ధిపొందినది. మాలపల్లిలోని అర్థగాంభీర్యము, భాషా స్వాభావికత, నూత్నధర్మప్రతిపాదనము, మరియే తెలుగు నవల యందును లేవు.

చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు చారిత్రక నవలకు గురువు. హేమలత, వారి ప్రథమచారిత్రక నవల. దాని ఇతివృత్తము రాజపుత్రస్థాన సంబంధి. ఆంధ్ర చరిత్రపరముగ వారు ఒకనవలయైనను వ్రాయకపోవుట శోచనీయము. కేతవరపు వేంకటశాస్త్రిగారి రాయచూరి ముట్టడి, దుగ్గిరాల రాఘవచంద్రయ్యగారి విజయనగర సామ్రాజ్యము, వేంకటపార్వతీశ్వర కవుల ప్రమాదావనము మొదలైనవి కొన్ని, ఆంధ్ర చరిత్రపరమైనవి కలవు. వేంకట పార్వతీశ్వర కవుల

శైలి, కావ్యశైలివలె అలంకారికమై, నసలకు, "తేలికరచన" అనెడినింద తొలగించినది.

విమర్శమనెడి పేరుమీద ఈకాలమున మొట్టమొదట కొంతశాబ్దికచర్చ జరిగినది. అప్పుడప్పుడే ముద్రితములగుచున్న పూర్వగ్రంథములును నూతనగ్రంథములును పఠనము విరివిగా సాగుటవలన, పండితులు ఆగ్రంథములలోని శబ్దములయొక్క సాధుత్వాసాధుత్వములను చర్చించుచు, పత్రికలలో వ్యాసములువ్రాసిరి. అప్పుడప్పుడే వెలువడుటకు మొదలిడిన పత్రికలు ఆచర్చలకు కొంతదోహదమొసగినవి. ఆ పండితులలో కొందరు సత్యాన్వేషణాతత్పరులును, కొందరు దోషైకదృష్టులును గలరు. ఉభయుల చర్చలును శాబ్దికములే. ఆ వాగ్వాదములను చేయువారిలో వీరేశలింగముగారును కలరు. కాని వారిదృష్టి, ఆ చర్చలకంటె వేఱొకట నిల్చియుండుటచే ఆ వాదములకు ఎక్కువప్రాధాన్యమీయక చారిత్రకవిషయములను గూర్చి పరిశోధనలు చేసిరి. కవులచరిత్ర ఆ పరిశోధనల ఫలము. ఆగ్రంథమే మనచారిత్రికవిమర్శనకు మూలభూతమైనది. కాని దాని ప్రాధాన్యమంతయు కాలనిర్ణయాత్మకము మాత్రమే యగుటచే యథార్థవిమర్శగ్రంథము కాలేదు. గ్రంథగుణముల గూర్చిన విమర్శవాక్యములు ఎడనెడ ఒకటిరెండున్నను అవి ప్రసంగవశమున చెప్పినవి మాత్రమే. ఇటీవల బయలుదేరిన వాఙ్మయచరిత్రలకును, శృంగార శ్రీనాథాది ప్రత్యేక కవిచరిత్రలకును వీరేశలింగముగారి కవులచరిత్రయే ఒరవడి.

పూర్వగ్రంథము లచ్చుపడుటకు ఆరంభించినది మొదలు ఆయా గ్రంథముల పీఠికలరూపమున, ఏదో కొంత విమర్శ వాఙ్మయము వృద్ధిపొందుచునే వచ్చినది. కాని బహిరాధారములను బట్టి కాక, వస్తుతత్వమును బట్టి పాశ్చాత్యుల పద్ధతిని సహృదయ విమర్శనము ప్రారంభించిన వారు కట్టమంచి రామలింగారెడ్డిగారు. కళాపూర్ణోదయమును నిమిత్తమాత్రముగ చేసికొని, కవిత్వతత్త్వవిచారములో వారు సాహిత్యమూల ధర్మములను పెక్కింటిని ప్రతిపాదించిరి

శ్రీ కేశలింగముగారు దారిచూపినది, అచ్చపు నవ్యకవులు ప్రారంభించినది "కథానిక". నవ్యకవులలో పెక్కురు దీనిని వ్రాయగలసమర్థులే. నానాముఖముల వెలువడుచున్న దిన, వార, పక్ష, మాస, పత్రికలు ఈ కథానికను, ఈ కథలు ఆ పత్రికలకును, పరస్పర పోషకములుగానున్నవి. ఈ పత్రికలే నానావిధవ్యాసములను ప్రకటించి, ప్రజలలో కలిగిన విజ్ఞానతృష్ణనుదీర్చి, వారిని విజ్ఞానవంతులుగ చేయుచున్నవి. నేటి ఆంధ్రవాఙ్మయమునకు ఈ పత్రికలొసగెడి తోడ్పాటు ఇంతింతకాదు. పత్రికా సంపాదకులలో కృష్ణా పత్రికాధిపతి ముట్నూరి కృష్ణారావుగారి వ్యాసరచనా పటిమ అనన్యసామాన్యము.

ధార్వాడకంపెనీ ఈ దేశమునకు రాకపూర్వము, మనకు యక్షగానములే గాని మార్గనాటకములున్నట్లు కానరాదు.

నాటినుండియే అట్టివి వ్రాయవలయునను తలంపు కవులకును, ఆదవలయునను తలంపు నటులకును కలిగినదట. ఆ యుత్సాహములో మొదట కొన్ని గద్యనాటకములే వెలసినవి. పిమ్మట క్రమముగా గద్యపద్యాత్మకములైన స్వతంత్రములు, అనువాదములు, అనుకరణములు అవతరించి, నాటకవాఙ్మయశాఖకు చాలపెంపు కలిగించినవి. ఈ పెంపునకు కారకులైనవారిలో ముఖ్యులు-వీరేశలింగము పంతులుగారు, వడ్డాది సుబ్బారాయుడుగారు, పానుగంటి లక్ష్మీనరసింహము గారు, ధర్మవరం కృష్ణమాచార్యులుగారు, కోలాచలం శ్రీనివాసరావుగారు, తిరుపతి వేంకటేశ్వరకవులు, చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు, వేదము వేంకటరాయశాస్త్రిగారు, గురజాడ అప్పారావుగారు ఈ కవులు వ్రాసిన నాటకములు అన్నిగాని, కొన్నిగాని రంగమున రాణించి, సారస్వతమునను స్థానము దక్కించుకొన్నవి.

ఈ రీతిని నవ్యసాహిత్యము శాఖోపశాఖలై పలువిధముల నలుదెసల విస్తరిల్లుచుండగా, ఆపేరు ఉచ్చరించి నంతనే కొందరకు భావకవిత్వమనియే మనస్సున స్ఫురించుటకు ఏమిహేతువో నాకర్థము కాలేదు. ఈవిషయమై లేనిపోని వివాదములిదివరకే చాలపెరిగినవి. వివాదములదారిని వివాదములు పోవుచుండగా, భావకవిత్వముదారిని భావకవిత్వము పుట్టుచునే యున్నది. సాధువో, అసాధువో ఈ శబ్దము రూఢమునుఅయినది దీనిలో ఏ గుణవిశేషమను

లేకున్న ఇంతమంది వ్రాయుటయు, ఆమోదించుటయు జరుగనే జరుగదుకదా! ఆంధ్రసాహిత్య పరిషత్తువంటి మహాసంస్థలు ప్రాచీనసాహిత్యరక్షణార్థమే పాటుపడుచున్నట్లే, నవ్యసాహిత్య పరిషత్తు మొదలైన సంస్థలు ఈ నవీనకవిత్వరక్షణార్థము పాటుపడుచున్నవి. ఏ పేరున పిల్చిననేమి? ఇంతనిరూఢమైన వస్తువునకు ఈయుగములో అగ్రస్థానమీయకతప్పదు. ఈజాతి కవిత్వమంతయు గుణవంతమనియు నేను అనను. తిరస్కారార్హమైనది చాలకలదు; పురస్కారార్హమైనదియు కొంతకలదు. ఈ విభేదము అన్ని యుగముల సాహిత్యమునందును ఉండును. ఆయాకాలములలో తేజోహీనములైన రచనలు అల్పాయుష్యములై అస్తమించిపోగా, ప్రాణవంతములై నిలిచిన వే ప్రాచీనకవిత్వమును పేర్మనము పఠనీయములై నెగడుచున్నవి. ఈకవిత్వములలోను జీవముకలవి పసగాత్రినే నిలిచి, భావికాలము వారికి ప్రాచీనకవిత్వములుగా పూజార్హములగుటకు సందియము లేదు. ఇక దీనిని గూర్చి ఎంత తక్కువచెప్పిన అంత మేలు.

కాలప్రభావము చేతనైననేమి, పాశ్చాత్యసభ్యతా సంపర్కము చేతనైననేమి మనజాతికి కలిగిన జాతీయతా ప్రబోధమునకు అనుగుణముగా ఆంధ్రభాషా విహారభూమి నానాటికి విశాలమగుచున్నది. చరిత్ర సంబంధములు, ప్రకృతి శాస్త్రవిజ్ఞానాత్మకములు, ఆర్థిక రాజకీయ సాంఘికాది సూత్రప్రతిపాదకములు, మరి యితరములు అయిన రచనలు వ్యాసములుగా గ్రంథములుగా అనుదినము పుట్టుచు, ప్రజా

బాహుళ్యమునకు చక్కని చిత్త సంస్కారమును కల్గించుచున్నవి. ఈ రచనలన్నియు సాహిత్యము కాకపోయినను లోకమునకు కవిత్వముకంటె ఎక్కువ ఉపకృతినే చేయుచున్నవి. ఆ రచియితలు కవులుగాకున్నను, ప్రజలకు కవులకంటె ఎక్కువ గురుత్వమునే చేయుచున్నారు. వారి కృషి వలన, తెలుగుభాష కవిత్వమునకు దక్క ఇంకెందుకును అక్కరకు రాదన్న నింద తొలగిపోవుచున్నది. వారి తపము ఫలించి, ఈభాష సమస్త విజ్ఞానాభివ్యక్తికిని పరమసాధనముగా పరిణమింపగల శుభముహూర్తము వచ్చుచున్నది. వేచియుడుడు!

---

# ఆంధ్ర నాటక కళా పరిషత్తు

——:o:——

## ఆరవ వార్షికోత్సవము.

## బెజవాడ.

## 1937

(అధ్యక్షోపన్యాసము)

నాట్యమునుగురించిన పరిజ్ఞానముగాని అనుభవముగాని లేని నాయట్టివానిని ఈ పీఠ మెక్కించుటలో ఈ పరిషత్కార్య నిర్వాహకుల యాశయ మేమైయుండునో యూహింపలేక పోయినను వారి కోర్కెను నిరాకరింపలేక మోమోటమిచే నేను తలకు మించిన యీ పనికి పూనుకొంటిని. స్వశక్తియందు విశ్వాసము లేకయే యిట్టి మహారంభములను సాహసించుట మానవుని లోభగుణమునకు లక్షణము. లోభమును నిగ్రహించు శక్తిగాని, కార్యమును నిర్వహించు సామర్థ్యముగాని లేని నేను మీ క్షమౌదార్యములను నమ్ముకొని ప్రవర్తింపనున్నాను.

నాచే మీరు వేయించిన యీ సూత్రధారవేషము ఇప్పటి యాచారమునుబట్టి యంతగా గణనీయముగాదు ఉత్తర రంగమున ప్రధాన వేషములు ధరించువారు ఈ ప్రదర్శనమును శోభావహముగ నడపి సూత్రధారుని లోపములను కప్పిపుచ్చెదరు గాక.

నేడు సమావేశమైన యీ మహాజనములో నాట్య కళాభ్యుదయమునకై పెక్కుగతుల పాటుపడిన మహానుభావు

లెందరో యున్నారు. ప్రతిఫలాపేక్ష లేకయే దీని ప్రతిష్ఠకై అమిత ధనవ్యయము చేసినవారు కొందరు; వేరువిధముల రాణింపదగిన యవకాశము లున్నను దీనికే జీవిత మర్పించి యిడుమలు పడువారు కొందరు; తమ దారపుత్రులకును బంధువర్గమునకును ఈ దీక్షయే యిచ్చి కులవ్రతముగా త్రికాలారాధనము చేయువారు కొందరు; కీర్త్యపకీర్తులను గాని, లాభనష్టములను గాని గణింపక సమాహితచిత్తులై దీనిద్వారా ఆత్మోపలబ్ధికై యత్నించువారు కొందరు. నేటికి ఈ కళ తక్కిన కళలతో ఇంచు మించు సమానమైన గౌరవము గడించుకొని లోకముచే మన్నింపబడుటకు కారణము మీ రెల్లర సేవాఫలమే కాని వేరుగాదు. ఇప్పటికి ముప్పదియేండ్ల నాడు నాటకసంఘమున చేరుటయు క్రైస్తవమతమున కలియుటయు ఒకటిగానే యెంచబడెను. నాటకమును చూడబోయిన కొడుకును ఇంట అడుగుపెట్టనిచ్చిన తండ్రిగాని, విద్యార్థిని బడికి రానిచ్చిన యుపాధ్యాయుడు గాని యుండెడివాడు కాడు. సదాచారసంపత్తికి అతి ప్రత్యర్థిభూతముగా నెంచబడిన యీ కళ నేటికి ఈమాత్రమైన పరువుగడించినదన్నచో అది మీయెల్లర కృషికిని కలిగినఫలమనక తప్పదు. కాలప్రభావము గూడ కొంత కారణమై యుండవచ్చును. కాని యిప్పటికిని సమగ్రమైనఫలము లభింపలేదని మీ రెరుగుదురు. తత్ప్రాప్తికై యినుమడించిన యుత్సాహముతో, అభినివేశముతో పురుషకారము నెరపవలసిన భారము మీయందున్నది.

ఈ పరిషన్నిర్మాణము, దీని వార్షిక సమావేశములు, సమాలోచనలు లోనగునవి యన్నియు కర్తవ్యము నెడ మీకు ఏమరుపాటు లేదనుటకు సూచకములుగా ఎంతో సంతోషము గొల్పుచున్నవి. ఈపరిషత్తును పెంచి పెద్దజేసి, తద్దేశములను శ్రద్ధతో పాలింతురేని, చరితార్థత కలుగుటకు సందియము లేదు.

ఇటువంటి సమావేశములందు ఉత్తర కార్యసూచనలతో పాటు, పూర్వచరిత్రజ్ఞప్తియు కొంత యావశ్యకమే యగును గాన, మన నాటకముల పూర్వగాథను, మీ రెరిగిన దేయయ్యు కొంత సంగ్రహముగా వివరించెదను.

ధార్వాడ కంపెనీవారు మన రాష్ట్రమునకు రాక పూర్వము మనకు దేశినాటకములైన యక్షగానములే కాని, మార్గనాటకములు లేవు. ఆ యక్షగానముల పరిణామమే యీ నాటకములని కాని, వానిశకము అంతరించిన పిమ్మటనే వీని యావిర్భావ మయ్యెననికాని తలపరాదు. ఆంధ్రవాఙ్మయమున "దేశి-మార్గ" యనెడి రెండు భిన్నశాఖలు కలవు. ఆరెంటికిని ఒకొక్కయెడ కొంచెముగా అన్యోన్యగుణసాంకర్యము ముండిన నుండునుగాని జన్యజనక సంబంధము మాత్రము బొత్తుగా లేదు. ఆరెండింటిలో దేశిశాఖకు చెందినది యక్షగానము; మార్గసరణికి చెందినది మన నాటకము. నాట్యమనెడి సాధర్మ్యముతప్ప, రెంటికిని చాల భేదమున్నది. రచనయందును, ప్రదర్శనము నందును దాని ప్రక్రియ వేరు, దీని ప్రక్రియ వేరు. కావున అవి

నీనికిమాతృకలు కావు. అదియునుగాక ఆ యక్షగానము లిప్పటికిని తెమదారిని తాము సంచరించుచునేయున్నవి కాని యంతరించి పోలేదు. మార్గకవిత్వమైన ప్రబంధములోడి పోటీక తాళజాలని మాత్రమున, దేశికవిత్వమైన పలనాటివీరచరిత్ర యస్తమించి పోవునా? కేవలప్రబంధ పఠనమే చేసెడివారు పలనాటిపదమును విననొల్లకున్నను పిచ్చుకుంటలచే దానిని పాడించి విని మైమరచి పోవు ప్రజలు పల్లెలలో ననేకులున్నారు. అట్లే దేశినాటకములుచూచి యానందించు జనులును బహుసంఖ్యాకు లున్నారు. ఆజనులు పలదచువరకు యక్షగానములు జీవించియే యుండును. రెండేండ్లనాడు చెన్నపట్టణములో జరిగిన యీా పరిషత్సమావేశ సందర్భమున కూచిపూడివారి యక్షగానమును ప్రదర్శింపజేసి మీారు వారిని సంభావించితిరని వింటిని. అది మీా కళాభిరుచికి అనురూపముగా నుండుటయేగాక, యక్ష గానముల భావిభాగ్యోదయమునకుగూడ సంసూచకముగా నున్నదనుకొంటిని. అతిప్రాచీనమును, సంప్రదాయబద్ధమును అయిన యీావిద్యకు తగిన దోహద మొసంగి యుద్ధరింతురుగాక. మళయాళ దేశమునందు కథాకళియనెడి నాట్యవిశేషము చిరకాలమునుండి ప్రశస్తికెక్కియుండి ఆధునిక నాగరికత ప్రబలినతరువాత సన్నగిలగా, తత్కళా ఘనతనెరిగిన మహనీయులు దానిని ఆదుకొని పునరుద్ధరించి మెనలేని కీర్తిని గడించుచున్నారు. ఆ దృష్టాంతమునైనను చూచి మనము కూచిపూడివారి యక్షగానప్రదర్శనము నెడ తగినంత

అభిమానము చూపుదుమేని ఆ భాగవతులు అన్యరాష్ట్రములకు సయితమేగి అందరి రాష్ట్రమునకు ఎంతో ఖ్యాతినిగొని రాగలరు.

సాహిత్యాంగముగా యక్షగానమును పరామర్శింతుమేని దాని చరిత్రలో ఎన్నో దశలు గడచినవి, ఎన్నో మార్పులు జరిగినవి, ఎన్నో ప్రక్రియలు పుట్టినవి. ఆ విషయము మియ్యెడ అప్రస్తుతము కావున ప్రసంగింపను. నాట్యవస్తువుగా పరికించి నప్పుడు మాత్రము దాని గుణము కొంతయైనను వివరించుట ప్రస్తుతమే యగునుగాన మనవిచేసెదను.

నృత్తము, నృత్యము, నాట్యము - అనెడి మూడు పదములను సాధారణముగా లోకము సమానార్థకములుగానే వాడుచుండును; అది పొరపాటు. ఈ మూడును పర్యాయ పదములుగావు. అవి నిరూపించెడి యర్థములయందు సామ్యము కంటె భేదభావమే యెక్కువ కలదు. అయినను ఈభిన్నార్థములు నాటక ప్రదర్శనమున మిశ్రీభూతమై ప్రయోగింపబడుట ప్రాచీనమైన యాచారము. వీనిలో నృత్తము తక్కిన రెండింటి కంటె ముందుపుట్టినది; తరువాత నృత్యనాట్యములు వెలసినవి.

శరీరావయవవిక్షేపమును లయాన్వితము చేయనెంచిన ప్రాక్తన మానవుడు మొట్టమొదట సృష్టించుకొన్న కళ నృత్తము. ఏ పటహ వాద్యమో నెరపుచు ఆ తాళమునకు అనుగుణముగా లయశుద్ధి యొప్పునట్లు అతడు చూపిన పాదన్యాసమే నృత్తమునకు ప్రారంభదశ. క్రమముగా దాని అన్ని తాళములకును అన్ని కాలములకును అనుగుణముగా

ప్రపంచించి పెంపుచేయవలెనని యాతడు యత్నించెను. ఎంత యత్నించినను పాదన్యాసము తాళమును తుదముట్ట అనుగమింపజాలదు. హస్తనాడులకుగల లాఘవము పాదనాడులకు నుండదు గనుక, హస్తముతో వేయు తాళగతుల నన్నిటిని పాదముతో వేయు నృత్తగతులన్నియు అనుసరింపలేవు. కనుక నృత్తవిద్య తాళముతో కొంతదూరమే నడచినది. నృత్తము చేయునపుడు పూర్వాపరకాయములకు సమత కుదురుటకై వేరొకదశలో పాదవిక్షేపమునకు హస్తవిక్షేపము తోడైనది. ప్రారంభదశలోగాని యీదశలోగాని నృత్తమునకు శబ్దముతోడి సంబంధ మించుకయు లేదు. అనగా నృత్తము చేయునప్పుడు తాళము మాత్రమపేక్షింపబడునుగాని గీత మపేక్షింప బడదు.

ఈగాత్రవిక్షేపవిద్య తాళసమన్వితముగా నుండుటయే గాక శబ్దార్థసూచకముగను ఉండవలెననెడి యాశతో మానవుడు కల్పించిన ప్రక్రియాంతరము నృత్యము. నోటితో గీతము పాడుచు అందలి శబ్దముల యర్థమును చేతితో ప్రదర్శించుట దాని ప్రధానాశయము. ఆ పాడెడి గీతము తాళబద్ధముగా నుండునుగనుక, తాళమునకు తగినట్లు కాలితో నృత్తము చేయుట దానికి నొక యంగము. కావుననే నృత్యము నందు అర్థసూచకమైన హస్తన్యాసమే కాక యొక్కొక్కయెడ తాళాశ్రితమైన నృత్తమునకూడ ప్రకటిత మగుచుండును. కృష్ణలీలాతరంగ నృత్యమును చూచినపుడు మన కిది తెలియగలదు. నృత్యము, నృత్తము కంటె

గుణాధికమై, శాస్త్రనిబద్ధమైనది. అందుచేతనే దానిని "మార్గ" మనియు, నృత్తము "దేశి" యనియు అలంకారికులు పేర్కొనిరి. గీతిపాడకయే యర్థవంతముగా నృత్యము సల్పుట తరువాత గలిగిన పెంపులలో నొకవిశేషము. భారతీయ నృత్యమునకు విజయపతాకగా నేడు ఖండాంతరముల సంచరించుచున్న ఉదయశంకరుని నృత్యమే ఈ వాక్యమునకు దృష్టాంతము.

మిశ్రకళలలోని యంశికలకు ఎంత సామరస్యమున్నదో, యంత స్పర్థయున్నది. సంగీతమునకు శబ్దసాహచర్యము లేకున్నను లోటులేదని చూపుటకే జంత్రగానము పుట్టినది. అట్లే కవివాక్యరచన లేకున్నను నాట్యము సల్పగలదని చూపుటకే కథాకళవంటి మూకాభినయము యత్నించినది.

మఱికొంత కాలమునకు నృత్యమున శబ్దార్థములనేకాక భావాశ్రయమైన వాక్యార్థమును సయితము ప్రదర్శింపవలెనని మానవుడింకొక సంస్కారము చేసెను. తత్ఫలముగా గాత్రవిక్షేపవిద్య కొంత అవస్థాన్తరప్రాప్తమై, అభినయమను పేరు తాల్చినది. క్షేత్రయపదములు, జావళీలులోనగునవి ప్రదర్శితములగునప్పుడు దాని స్వరూపమును ప్రత్యక్షముగా చూడగలము.

ఈ యభినయమునకు మీదిమెట్టే నాట్యము. రెండింటికిని గల సన్నిహితత్వమును బట్టియే అభినయశబ్దము నాట్యపరముగా సయితము ప్రయోగింపబడినది. వ్యస్తములైన పదములను, జావళీలను మాత్రమేకాక నిబద్ధకావ్యములను(యక్ష-నాటకములను

గూడ ప్రదర్శించుటవలన యభినయము నాట్యమైనది కాగా, భావగీతము వంటిది పదముల యభినయము; ప్రబంధము వంటిది నాట్యము.

కూచిపూడివారి నాటక ప్రదర్శనమున నవనాగరికులు సహింపని "చిందులు తొక్కుటలు" "చేతులు త్రిప్పుటలు" నాట్యవిద్యా పరిణతిలోని యీ భిన్నభిన్న దశలను చూపుటకును, నృత్త నృత్య నాట్య మిశ్రీకరణమువలన ప్రదర్శనమునకు లభించు సమగ్రశోభాసిద్ధిని చూపుటకును ఉద్దేశింపబడినవి కావున యక్షగాననాట్యము నృత్తనృత్యానుప్రాణితము గ్రహింపవలెను

పూర్వకాలమున సంస్కృతనాటక ప్రదర్శనములందును నృత్తనృత్యములకు యథాభావరసావస్థముగా స్థానము నొసగబడినది. ఇప్పటి మార్గనాటక ప్రదర్శనమునందు కొంచెము నృత్యము (పదార్థాభినయము) మాత్రము నిల్చియున్నది తక్కినదంతయు నాట్యమే.

ఇట్టి దశాపరిణామము నాట్యకళకేకాక, తక్కిన చిత్రకళలకును సహజమై యుండినట్లే కన్పట్టుచున్నది. మొదట త్రిస్వరాత్మకముగానే యున్న గానము, తుదకు సప్తస్వరాత్మకమగుట యిట్టిదే! సుఖమయమో యసుఖమయమో యైన యాత్మ భావమును ఒకటిరెండు శ్లోకములలో వ్రాసికొని మురిసినకవి దశాంతరమున భారతరామాయణ శాకుంతలాది మహాకావ్య ప్రపంచమును సృష్టించుట

దీనివంటి దే! ఈ మీమాంస యింతతో ముగించి, యిక ప్రస్తుతాంశమునకు వత్తును.

ధార్వాడ కంపెనీ రాకయు, మార్గనాటకావతారమును సమకాలికములుగాన, అదిజరిగి సుమారు ఏబది సంవత్సరములై యుండును. ఈ యర్ధశతాబ్దిలో దీనికి మూడుదశలు గడచినవి; నాల్గవది నడచుచున్నది.

మొదటిదశలో వెలువడినవి శుద్ధగద్యనాటకములట. వానిని చూచినవారు మనలో ఎందరోయుండరు. అప్పటి పెద్దలు చెప్పగావినిన మాటలను బట్టి యారచనలు రసవంతముగా నుండెడివని నమ్మవలెను. అప్పటి నాటక సంఘములు మంచి కట్టుబాట్లును భక్తిశ్రద్ధలును గలిగి అంతరైక్యముతో చక్కగా నిర్వహింపబడినవట. వేషధారణకును నేపథ్యరచనకును తగినంత సాధన సామగ్రి లేకున్నను, ఉన్నంతలోనే చక్కగా మెరపించిరట. అప్పటివన్నియు వినోదసంఘములే గాని వృత్తి సంఘములుకావు. అయ్యు, నటులు నాటకమే తమ జీవిత సర్వస్వమనునంత శ్రద్ధ చూపుచుండెడివారట. ప్రతి పాత్రధారియు, వేదాధ్యయనముచేయు విద్యార్థివలె సుశిక్షితుడయ్యెడివాడట. ఆభక్తిశ్రద్ధలే వారినాట్యమునకు జీవనమైనవి. అవి లేకపోబట్టియే, యిప్పటిస్థితి యింతశోచనీయముగా నున్నది.

రెండవదశలో వేణీసంహార శాకుంతలాది సంస్కృత నాటక పరివర్తనములును, చిత్రనళీయాది స్వతంత్ర నాటకములును వెలసినవి. ఆ నాటకకర్తలలో ధర్మవరము

కృష్ణమాచార్యులుగారు నాటకములు వ్రాయుటే కాక, స్వయముగా వానిని ఆడి యాడించిరి. నాటకము వ్రాయుట, నాటకమాడుట, నాటకసంఘమును నడపుట లోనగు సమస్త కార్య భారము వహించి, యచిరకాలములో ఈవిద్యను ఆయన ఎంతో యున్నతస్థితికి కొంపోయెను. ఆచార్యులుగారు నాటకమాడుటే యాత్మధర్మముగా భావించి, వస్తుసృష్టికై నాటకములే వ్రాసిరో, వ్రాయుటే స్వాత్మధర్మముగా భావించి ప్రయోగమునకై నాటకములే యాడిరో నేను చెప్పలేను. ఆంధ్ర "నాటకపితామహ" బిరుదమును బట్టి నాటకకవిగానే, ఆయనను లోకము బహూకరించినదని యనుకొంటిని.

ఆంధ్ర "నటపితామహుడు"గా లోకముచే నెన్నబడిన రంగజ్యోతి హరిప్రసాదరావుగారు. కృష్ణమాచార్యులుగారు నాటకమున పద్యమును ప్రతిష్ఠింపగా, ప్రసాదరావుగారు నాట్యమున పద్యపఠనమును ప్రతిష్ఠించెనని చెప్పుదురు. ఏ పద్యమునకు ఏరసమునకు ఏ రాగ మెంతవరకు ఉచితమో ఆరాగ మంతవరకే పాడి, పద్యసారస్యమును, రాగరక్తిని మిళితమొనర్చి దానిసాయమున నాట్యము ప్రతిపదరస నిష్యందియగునట్లు అభినయించు నేర్పు నేనెఱిగినంతవరకు ప్రసాదరావుగారికివలె ఇంకొకరికి అలవడలేదు. ఆంధ్రనట ప్రపంచమునకు ఆయన నిజముగా పితామహుడు – అనగా నటబ్రహ్మ. హరివారి యభిజనస్థానము కూచిపూడి యగ్రహారము. ఆగర్భనాట్యప్రసిద్ధులైన ఆ భాగవతుల

తేజోలేశము లేని ప్రసాదరావుగారి వెల్లువనకు మూలప్రకృతి.

ఈ రెండవదశలోగూడ కంపెనీలు వినోదసంఘములుగానే యుండెను గాని వృత్తి సంఘములుగా మారలేదు. మరియు, సభ్యులు సమాజముల కట్టుబాట్లకు బద్ధులై వినీతితో ఏకీభావముతో సమష్టి శ్రేయస్సుకై పాటుపడిరి. సంఘములు బీటువడి భిన్నములగుట, ఐక్యముచెడి యసూయలు రగులుట లోనగు పతన హేతువులున్నయు మూడవదశలోని ముచ్చటలు.

నాట్యకళాభిమానులైన ధనికులను, జమీందార్లను ఈ మితిమీరిన వ్యయముతో పెద్ద పెద్ద కంపెనీలను నెలకొల్పి పెక్కు కంపెనీలలోని ప్రధాననటుల నందరను ఆకర్షించి యొక్కచోట చేర్చుటయే ఆయా పట్టణములలోని కంపెనీలు విచ్ఛిన్నములగుటకు హేతువైనది. ఈ విద్య వృత్తిగా పరిణమించినదియును ఈ పెద్దకంపెనీలవలననే. ఈ పరిణామమువలన పెక్కుమంది నటులకు జీవిక కల్గినది. పెక్కుమందికి జీవనాధారము కల్పించుటయే యీ పెద్దకంపెనీలుచేసిన మొదటిమేలు. ఈ మేలును బట్టి చాల కీడును వచ్చినదందురా? అది నటులలోపముగాని ఆ యజమానులదోసగు కాదు. నాట్యమును వృత్తిగా చేసికొనుట హేయమని తలచువారు మనదేశములో చాలమంది కలరు. ఆ యభిప్రాయమంతగా మెచ్చదగినది కాదు. పెద్ద చదువులు చదివినవారే వృత్తులు దొరకక అల్లాడు మన దేశములో కొంతమందికేని యొక వృత్తి దొరకుట సంతోషింపదగినదికాదా? ఇది సద్వృత్తి కాదని నిరసింతురేమో!

నిరసన భావముతోనే చూచుటకు మొదలిడుదుమేని అన్నివృత్తులలోను ఏవోదోషములు కన్పించుచునే యుండును అది కారణముగా ఎన్నివృత్తులను పరిహరింపగలము? దేని నాశ్రయింపగలము? అదిగాక బొమ్మలను అమ్మికొని చిత్రకారుడు జీవించుచుండగా, గానసభలు చేసి గాయకుడు గడించుచుండగా, నాట్యమువలన నటుడేల పొట్టపోసి-కొనరాదు?

ఈ పెద్దకంపెనీల యజమానులు కొంత కళాభివృద్ధికి అనువగు మార్గములను త్రొక్కవలెనని యే త్సాహపడిరి. వారి యుత్సాహమునకు తగినట్లుగా అవి నడవలేదు వాని యర్థాయుస్సునకు రెండు మూడు హేతువులు పొడకట్టుచున్నవి. మొదటిది, యెవరికి వారే సర్వతంత్ర స్వతంత్రుల మనుకొను పదిమంది యొక్కచో జేరుట; రెండవది యావదాయమునకు తగిన యదుపులోనుంచి, యజమానులు సమబుద్ధితో కూడగట్టుకొన రాలేకపోవుట. ఆ యజమానులు తామై పైపరాయనికి జరిపినవారు కారు. వారిచేతిక్రింద ఎంతయుందో తాబేదార్లు ఆ తాబేదార్లలో చాలమంది శిష్యులుకొందరు; గూఢ చారులు కొందరు. వారి కుతంత్రములు, నటులలో ఒకరొకరుల యెడ ద్వేషాసూయలను రగుల్కొల్పినవి. యజమానులకు నటులయెడ శంకలు కలిగించినవి వారికిని వీరికిని సంఘమునెడ విరక్తి పుట్టించినవి. విరక్తి సన్యాసమునకు దారితీసినది. మూడవ కారణము నటులు డబ్బుకక్కురితికై ఋజమార్గమును

వీడి యజమానుల విశ్వాసము కోలుపోవుట. ఇవి గాక నాబుద్ధికి అగమ్యములైన కారణము లింకెన్ని యున్నవో! ఆ యనుభవము కలవారు మీలో చాలమంది యున్నారు.

మహారాజ్యము పడిపోయిన పిమ్మట సర్దారులు చిన్నజమీనులు కల్పించుకొని రిత్తరాచరికము చేయ మొదలిడి-నట్లు, ఆ మహాసంఘముల నుండి నటులు తలకొక దారియై నాలుగైదు చిన్న కంపెనీలను లేవదీసిరి. ఇదియే నాల్గవదశకు అంకురార్పణము.

ఈ దశలో నాటకమునకు రాదగిన నైచ్యమంతయు వచ్చినది. అనుపమమారి ప్రదర్శనము. అంగులేపియుడావుడి, అనినమాట చెల్లని కంట్రాక్టు - అది. యిది యననేల! "భ్రష్టస్య కావా గతిః" అనిపించినది, కాని సురభి నాట్యమండలివంటి నియుతవ్యవస్థగల యొకటి రెండు సమాజ-ములు మాత్రము, ఇటువంటి దశావిపరిణామమును పొందక కాలానుగుణముగా సక్రమాభివృద్ధి నొందుచునే యున్నవి.

ఈ నాల్గవదశలో జరిగిన యొక సంస్కారము స్త్రీలే స్త్రీపాత్రధారణముచేయుట. ఆ సంస్కారమువలన చెప్పుకొన దగినంతఫలము కల్గలేదు సురభికంపెనీవారికి ఇది చిరకాలా-గతమైన యాచారము. ఆ సమాజములోని స్త్రీ పురుషులు ఏక కుటుంబమునకు చెందినవారగుటచేత, ఆ పద్ధతి అవలం-బించుట వారికి సుకరమయ్యెను; తక్కినచోట్ల అది దుష్కరము. ఈ ప్రయత్నము కడముట్టునా యని సందేహము కొల్పు-

చున్నది. కాన నాగునా! సంతోషమే. నాగనప్పుడు పురుషుడు స్త్రీ వేషము వేయుటలో దోసగేమియు లేదు. పురుషుడు స్త్రీపాత్రము నభినయింపరాదనికాని అభినయింప లేడనికాని, యనుకొనరాదు. ముప్పిడి జగ్గరాజగారిని, స్థానం నరసింహారావు గారిని కనులారజూచియును ఆ వాదము చేయుట యవివేకము. అట్లే స్త్రీలు పురుషవేషము కట్టరాదనియు భావింపరాదు. అర్హతా నర్హతలు వారివారి యాకార రేఖలను బట్టియు తద్భావభావనను బట్టియు కల్గుచుండును. రేఖ, భావన—ఈ రెండే యొకవ్యక్తికి రంగప్రవేశార్హత నిచ్చునవి. అవి లేనినాడు స్త్రీ, నటియు కాజాలదు. పురుషుడు, నటుడును కాజాలడు.

"స్వభావమాత్మన స్త్యక్త్వా
తద్భావగమనాదిహ
స్త్రీ, పుంసః ప్రకృతిం కుర్యాత్
స్త్రీభావం పురుషోపివా."

పైని పేర్కొన్న నాల్గవదశయు ఇంచుమించు ముగియ-వచ్చినట్లే యెంచవచ్చును. ఆ యతుకులమారి ప్రదర్శనములు జరుపుటకైనను నటులు కరవైరి. దేశమునగల నటసంఖ్యలో అర్ధాధికము సినీమాల కెక్కినది. సినీమాలవలన గడించినంత సొమ్ము నాటకములవలన లభింపదుగనుక సినీమానటులు నాటకమును సేవింపజాలరు. మరియు వారి సినీమా యులవాట్లు నాటకరంగమున రాణింపనిచ్చే ప్రేక్షకులకును వారియెడ విముఖత్వమే కల్గును. కాన సినీమా నటులు వేరుగను,

నాటక నటులు వేరుగను ఉండుటయే శ్రేయమని తోచుచున్నది.

మరియు నాటకమును మనము చేయునెడల సంస్కారము లన్నియు ఒక్కసారిగా ప్రవేశపెట్టినచో ప్రాతపద్ధతికి అలవాటుపడిన ప్రేక్షకజనము వెంటనే ఆమోదింపరు. జనామోదము లేని వృత్తిసంఘములు బ్రతుకజాలవు. కావున సంస్కారపూర్వక ప్రదర్శనములు వినోదసంఘములు మొదలిడవలెను. వారి ప్రదర్శనములు క్రమముగా జనామోదము పొందిన పిమ్మట, వృత్తిసంఘములును ఆదారినే నడచివచ్చును. కాని వినోదార్థ మేర్పడిన కంపెనీలకు నాటకమునందు ఆశయేకాని యభిమానము సున్న. ఆ నటులు ఏదో ప్రొద్దుపోకకు చేయు వినోదవ్యాపారములలో ఒకటిగా భావింతురేకాని విద్యాపక్షపాతముచే రంగమును సేవింపరు. వారిచిత్తవృత్తిలో పరివర్తనము గలిగి శ్రద్ధమై నాటకమును చేపట్టుదురేని యిప్పుడున్నలోపములన్నియు క్రమముగా సవరింపగలరు. లేదా యీపరిషత్తునకు ఒక యంగముగా నాట్యశాఖను నెలకొల్పి దానిద్వారా క్రొత్తదారులు త్రొక్కవలెను. ఒకప్పుడు తెనాలి రామవిలాస సభకు అట్టి యోగ్యతకలదని ఆశించితిమి. దానికిని బాలారిష్టమే కొట్టినది.

నటులు సినీమాలకు ప్రాకినట్లే నాట్యశాలలు సినీమా-శాలలై పోయినవి. సినీమాల కేర్పడిన రంగము నాటకమునకు

ఎంతవరకు ఉపకరించుచున్నదో నింతరాయుభవముగల మీకు నేను చెప్పనక్కరలేదు.

ఈపరిస్థితులనుబట్టియే యీనాల్గవ దశకూడ తోలగు చున్నదని భావించితిని. ఈపరిషత్తు చూపెడి యుత్సాహమున అంతఃశుద్ధియే యున్నచో రాబోవుదశ మంచిదే కాదగును. లేకున్న ఈ సభా ముఖమున జరుగు మహాకార్యపరంపర యంతయు ఊరక పోవలసివచ్చును. ఈ కార్యకలాపమువలన ఇంతవరకు సాధించిన దేమియు లేకున్నను, ఈమథనమంతయు రిత్తపోవునాయని యాశపొడముచున్నది. ప్రాణి, జడమై పడియుండుటకన్న బాధవలన ఆవేదనపడుటయైనను మంచిదే కదా!

ఈపరిషన్ముఖమున పరిష్కారము చేయనెంచి మీరు ప్రతిపాదించిన సమస్యలెన్నో యున్నవి. ఈ యుపన్యాస భాగమున వానిలో కొన్నిటిని గూర్చి కొంత యుచ్చటించి నాకు ఉచితములని తోచిన సలహాలను సూచించెదను. వాని యోగ్యతాయోగ్యతలను చక్కగా వివేచించి తగినవానికి కార్యరూపము కల్పింతురుగాక.

మనభాషలో ఉత్తమనాటకములు లేవనియు, ఏ యొకటి రెండో యున్నను, అవి పౌరాణికములే కాని సాంఘికములు కావనియు ఎంచి, యుత్తమసాంఘిక నాటకమును వ్రాయించి కవిని బహూకరింపవలెనని యెంతో యాతురతతో మీరొక పోటీపరీక్ష పెట్టితిరి. అంతేకాక ఉత్తమత్వసిద్ధికి

పద్యములను స్వగతములును అంతరాయము కల్గించునన్న యూహతో నాటకమున వీని నుంచరాదని కవికి ఆదేశించితిరి.

తెల్గున ఉత్తమ నాటకములు చాలతక్కువగా ఉన్నమాట నిజమే. నాటక రచనోచితమైన సమగ్రశక్తి ఆంధ్రకవులలో ఎవరియందును అఖండముగా ఆవిర్భవింపలేదు. ఉత్తమములని మనము భావించుచున్న వానిలోనైనను గుణసాకల్యము లేదు. కొన్నిట కవిత్వము రమణీయముగా నున్నది: కొన్నిట సంవాదము చతురముగానున్నది; కొన్నిట పాత్రనిర్మలన మనుస్ఫుటముగా నున్నది; కొన్నిట కథాసన్నివేశము నిబిడముగా నున్నది. నాటకమూర్తికి అంగప్రత్యంగ భూతములైన యీయంశములలో ఒక్కొక్క కవికి ఒక్కొక్క ప్రజ్ఞ మాత్రమే యుండుటచేత ఇట్టి యేక-దేశసిద్ధి మాత్రమే లభించినది. సర్వగుణ సంపన్నములైన నాటకముల యభావముచే వీనినే యుత్తమములుగా కొనియాడుచున్నాము. అసలు కాళిదాసు చెప్పినట్లు పరిపూర్ణత బ్రహ్మసృష్టిలోనే లేదు కాబోలు. "ప్రాయేణ సామగ్ర్యవిధౌ గుణానాం పరాఙ్ముఖీ విశ్వసృజః ప్రవృత్తిః" ఇది యిట్లుండుగాక.

పోటీపరీక్షలవలన అనుకొన్న ఫలము లభించునన్న నమ్మకము నాకులేదు. ఏమన, పోటీకినిలబడుట, పేరుపణముపెట్టి పాచికలాడుట. పెద్దపేరు గలవారెవ్వరును సాధారణముగా ఈజూదమునకు దిగరు. అపజయము లభించినచో

పేరుపోవుటేగాక పరాభవము కూడ వచ్చునని వారిభయము. వారిశంక సహేతుకమే కాని నిష్కారణముకాదు. మొదలు పోదగినపేరు లేదుగదాయనెడి నిబ్బరముతో కొందరు, పరీక్షాధికారులు నన్నుత్రోసివుచ్చగలరా యనెడి యహంభావముతో కొందరు, బహుశక్తిమాట భగవంతుడెరుగును, మన పేరుకూడ జాబితాలో అచ్చుపడునెడి కీర్త్యాశచే కొందరు, లాటరిగోవలెనుం కే బహుమానము రాకూడదా యనెడి ధనలోభముచే కొందరు, నడుములుకట్టి మల్లచరచి పోటీలలో దిగుదురు. వీరిసాములన్నియు చూచి పరీక్షాధికారులు నిరుత్సాహముతో ఒండొరుల మొగములు చూచుకొనుచు గుసగుసలు పోదురు. తుదకు కన్నులు మూసికొని లాటరీలాగి యెవనిపేరు పండునో వానిచేతిలో గుట్టు చప్పుడుగాకుండ సంభావనపెట్టి పంపెదరు. గుట్టుచప్పుడు కాకుండ తన చేతబెట్టిన యీనాములైను గుట్టుచప్పుడు కాకుండగనే గ్రహించి యూరకుండక ఆ యదృష్టశాలి తన ప్రయోజకత్వమును తన ప్రజ్ఞను తానే కొండాడుకొనుచు ఇతరులను అధిక్షేపించును. స్వయంవరమున వధువుచే నిరాకృతులైన రాజకుమారులవలె, ఆశాభంగముచే మొదలే డిందుపడియున్న తక్కిన పోటీవారలు వాని యధిక్షేపములకు మరింత కనలి, వాని జయగర్వమును అణచవలెనని పత్రికలను రచ్చలను ఎక్కి, యుపన్యాసాస్త్రములు, వ్యాసశస్త్రములు ప్రయోగింతురు. అవి సత్కరించిన వానికిని, సత్కారము

పొందినవానికిని మాత్రమే కాక, పౌరోహిత్యము జరిపినవానికి గూడ తగులుదు. పోటీపరీక్ష లింత ముచ్చటగా ముగియును. ఇట్లు జరిగిన కొన్ని పోటీలు నా యనుభవములో నున్నవి. కనుక వానియందు నాకు విశ్వాసములేదు. నేను చెప్పినది లోకసామాన్యమైన విషయమే కాని, మీరు పెట్టిన నాటక పరీక్షకు సంబంధించినది కాదు. అది యెట్లు జరిగినదో, ఎంతవట్టు సఫలమైనదో నే నెరుగను. కాని న్యాయముగ చేయుదగిన దేమనగా, మీకునచ్చిన యొకకవిని చేరదీసి, మీయాశయము లతనితో చర్చించి, అతనికిని మీకును చర్చాసామరస్యము కలిగిన పిమ్మట తదనుగుణముగా నాటకము వ్రాయించి సత్కరించుట.

ఉత్తమ నాటకమనగా నెట్టిది? నాటకము కావ్యభేదములలో నొకటిగనుక, అది మొదట కావ్యముగానే పరిగణింపబడవలెను. కావ్యమే కాక రూపకము కూడ అయియున్నది గనుక, నాట్యవస్తువుగా తరువాత స్వీకరింపబడవలెను. అందుచేతనే దానిని దృశ్యకావ్యమనిరి. అది కావ్యమును కావలెను; దృశ్యమును కావలెను. కాన కావ్యగౌరవమును, ప్రయోగానుకూల్యమును గల నాటకమే ఉత్తమనాటకము. ఈ రెండు ప్రయోజనములలో నేది లోపించినను దాని పరిపూర్ణత చెడినట్లే యెంచవలెను. ఉత్తమ కావ్యమై యుండి ప్రయోగానుకూలము కానిచో దాని కావ్యతాగౌరవము లోపింపదు. కావ్యతాగౌరవములోపించి

ప్రయోగానుకూల్య మున్నచో వాఙ్మయమున వాసియునికి స్థిరము కాజాలదు. కవి తనకావ్యమునకు స్థిరస్థాయిత్వమునే కోరికొనును గాన అతడు కావ్యత్వము నెడనే దృష్టినిల్పి దానిని రచించును. ఆకావ్యత్వసిద్ధియైనను తేలికగా లభించునది కాదు. రసపరిపాలనము, పాత్రోన్మీలనము, కథాసంధానము, శబ్దవిన్యాసము, లోనగు కావ్యాంగములన్నియు చక్కగా కుదిరినప్పుడే అనవద్యమైన సిద్ధి కల్గును. అంగభూతములైన యీయంశములలో ఏది కొఱవడినను అది యుత్తమ కావ్యము కాజాలదు; అందును వస్తుసన్నివేశమున వెలితియున్నప్పు డది శిల్పమే యనిపించుకొనదు. అట్టి వెలితి రాకుండ కాపాడు కొనుటకైయే మన యాలంకారికులు నాటకలక్షణమున పంచ సంధులను నిర్దేశించిరి. సంధులుచెడిన నాటకము కీళ్లుసడలిన బొమ్మ. వర్ణము బాగుగా నుండుగాక, ముఖము సొగసుగా నుండుగాక, మరి యేవన్నె చిన్నెలైన నుండుగాక, యా వికృతపుబొమ్మను చూడ నిచ్చగింపము. అట్లే, సంధులుపొందు పడక కథాసంధానముచెడిన నాటకమున పాత్రపోషణాది గుణములున్నను మెచ్చుకొల్పవు. కావుననే ఆరిస్టాటలు పండితుడు "Beginners succeed in character and diction but not in structure" అన్నాడు. సర్వ కావ్యగుణముల కల్మి నాటకము వాఙ్మయాలంకారమై, రంగోపయోగి కాకున్నను కవి కృతార్థుడైనట్లే యెంచుకొనవలెను. అంతతో సంతసింపక, తననాటకము ఉత్తమదృశ్య మగు ననియు అతడు ఆశపడుచో

పరిహాసపాత్రుడుకాక తప్పదు. దానినాడే దు న టు లు ను నగుబాటుపాలే యగుదురు.

ఈరెండు ప్రయోజనములను సాధించిన నాటకసంఖ్య బహుస్వల్పము. సంస్కృతాంగ్లభాషలలో గొప్పనాటకములుగా మనము కొనియాడువానిలో అనేకములు కావ్యములేకాని, రూపకములుకావు. వానిని శ్రవ్య నా ట క ము లనవలెను. దృశ్యకావ్యము లనరాదు. సంస్కృతమున ఉత్తరరామచరిత్ర బాలరామాయణము మొదలగునవి యట్టివి. ఆంగ్లమున షేక్స్పియరు వ్రాసిన "టెంపెస్టు" "కింగులీయరు" మొద లగునవి యటువంటివి. షేక్స్పియరుట్రాజెడీలు ప్రదర్శనమునకు ఉపయోగపడవని కాలెరిడ్జి పూర్వపక్షములేని సిద్ధాంతము చేసినాడు. అంతమాత్రమున "కింగులీయరు" యొక్కగాని ఉత్తరరామ చరిత్రయొక్కగాని కావ్యప్రతిష్ఠపోదు. అవిసరస్వతీ కంఠాభరణాయమానములై వె లు గొం దు చు నే యుండును. అయినను సాహిత్యపరులకే కాని నాట్యపరులకు అక్కరకు రాకపోవుటచే అవి రంగమునకు దూరస్థములైనవి. అటులయ్యు, వానిలోని కళాసౌష్ఠవమును, రసవత్తను చూచి విడనాడ లేక, యెట్లో సరిపెట్టుకొని కొందరు ప్రదర్శించుచుందురు. అది వస్తుగౌరవముచే ఒనర్చెడిపని. నాట్యపరులను, సాహిత్యపరులను సంతోషపెట్టగల నాటకములు సార్వజనీనములు; అవి యుత్తమ నాటకములు. అట్టి వానిని చూచుకొని నటులు ప్రదర్శనమునకు సైకొనవలెను. అ టు గా క సాహిత్యగుణమును లోపింపజేసి

ప్రయోగార్హతమాత్రమే యుండునట్లు వ్రాయుమని మనము నిర్దేశింప కవిశబ్దవాచ్యు డెవ్వడును వ్రాయడు.

అదిగాక సాంఘిక కేతివృత్తము నెడ అంత పక్షపాతమును పౌరాణికగాథలయెడ అంత యనాదరమును మీ కేల కలుగవలెనో నాకు బోధపడుటలేదు. పౌరాణికకథలోనివన్నియు ఒకనాటి సాంఘిక ప్రవృత్తిస్వరూపములు కావా? శకుంతలా వృత్తాంతము పురాణేతిహాసములందు ఉదాహరింపబడి యుండుటచేతనే పౌరాణికమైనదిగాని, నిజమునకు అది సాంఘిక వృత్తము కాదా! సంఘమున రాజవంశము ఉన్నత పదస్థమై యుండును గనుక రాజసంబంధియగు ఆ కథ యితిహాసోదాహృతమై ప్రసిద్ధవస్తువైనది. అట్లే నేటి సాంఘిక వృత్తములలో ఏదేని రాజవంశ సంబంధమై ఉదాత్తమైయుండినచో రేపటికది చరిత్రగతమై యితిహాస ప్రసిద్ధమైన వస్తువుగా మారును. కాలము గడచినకొలది మూలకథకు వన్నెలు చిన్నెలు కల్పింపబడును. ఆ కల్పనలవలన దాని రూపము అసంభావ్యముగా తోచి, మీరు తృణీకరించుచున్నారనుకొనెదను. అటుగాక నేటి సంఘమునందలి సామాన్యుల నడవడినే నాటకేతివృత్తముగా నిబంధించవలెనని మీ యాశయమేమో? దాన దోషమేమియు లేదు. రసపోషణాభంగము జరుగకుండవలెను గాని, యితివృత్తము ఏదైనను విప్రతిపత్తి లేదు. మాలతీమాధవ మృచ్ఛకటికాదులు అటువంటి నాటకములే. ఈయాచారము మనకు క్రొత్తకాదు. ఆచారమేకాదు శాస్త్రసిద్ధియు నున్నది.

"దేవతానాం ఋషీణాం చ
రాజ్ఞా మథ కుటుంబినాం
కృతానుకరణం లోకే
నాట్య మిత్యభిధీయతే."

ఆచారమునను, శాస్త్రమునను ఆధారము లున్నవి గనుక చూపితినిగాని, యవి లేకపోయినను క్రొత్త ప్రక్రియలు కల్పించుకొనరాదని నాయభిప్రాయము కాదు. క్రొత్తకల్పనల వలన వాఙ్మయమునకు పుష్టికల్గునే కాని నష్టిరాదు. మన పూర్వులు పౌరాణిక గాథలకును, సాంఘిక గాథలకును సమాన ప్రతిపత్తినే యిచ్చిరి. వారు ఒకదానిని మన్నించి రెండవదానిని క్రిందు పర్చలేదు. అసలు వస్తువునెడ వారికి తిరస్కార పురస్కార భావము లేలేవు. ఆవస్తువు ఏదైనను కవిచే భావ్యమానము కావలెననియే వారికోరిక.

"రమ్యం జుగుప్సిత ముదారమథాపి నీచం
ఉగ్రం ప్రసాది వికృతం గహనం చ వస్తు
యద్వాప్యవస్తు కవిభావుక భావ్యమానం
తన్నాస్తి యన్న రసభావ ముపైతి లోకే."

కాని తత్కాలలోక వృత్తాంశమునుగైకొనుచో ఒక యెడ మాత్రము మిగుల అప్రమత్తతె యుండవలెను. అట్టి రచనలు తాత్కాలికములైన యేసాంఘికసంస్కారధర్మములనో ప్రచారము చేయునవిగా నుండరాదు. ప్రచారార్థము వ్రాసిన రచనలన్నియును ఆకార్యము కడముట్టిన వెంటనే

విస్మృతములై పోవునుగాని నిల్చియుండవు. కావ్యమన్ననో, త్రికాలాబాధితమై యుండవలసిన రచన. దానికి అజరామరత్వమునిచ్చునది రమణీయతాస్ఫూర్తి. దానినేరసవత్తయనియు చెప్పవచ్చును. కాన ప్రచారార్థమై కాక కావ్యకళాసిద్ధికై సాంఘికేతివృత్తములనుగైకొని యుదాత్తతయు రమణీయతయు నెలకొనునట్లు నాటకములు వ్రాయింతురేని లోకమునకు మీరు మహోపకారముచేసిన వారగుదురు. ముప్పదిసంవత్సరములనుండి యొకేతీరు నాటకములు చూచి విసివియున్న ఆంధ్రలోకము క్రొంగ్రొత్త నాటకములకు స్వాగతాంజలులు పట్టుననుటకు సందియము లేదు. అట్లుగాక ప్రజలకు విజ్ఞానము కల్గించుటకై తేలికనాటకములు వ్రాయించి యాడెదమందురా రంగపీఠమును ఉపన్యాసవేదికగా మార్చెదరన్నమాట. అంతకంటె ఇంకొక పతనహేతు వుండదు. ఆ తలంపునకును, "కళారాధనము" "కళోపాసనము" "కళాభివృద్ధి" యనెడి యీ మంత్రజపములకును చాలదవ్వు. ఈరెండును ఏకహృదయమునసే పుట్టుట యసంభవము. విజ్ఞానదాయకత్వమే నాటకమునకు ఫలమన్న వారికి ధనంజయుడిచ్చిన సమాధానము చూడుడు:-

"ఆనంద నిష్యందిషు రూపకేషు
వ్యుత్పత్తి మాత్రం ఫల మల్పబుద్ధిః
యోఽపీతిహాసా దివదాహ సాధుః
తస్మై నమః స్వాదు పరాఙ్ముఖాయ."

ఒకవేళ అటువంటి ప్రయోజనము నాటకములవలన ఉన్నదను

కొన్నను, దానిని సినీమూలకు వదలివేయుట మంచిది. అవి మీకంటె ఎక్కువ వేగముగా ఎక్కువ సులభముగా అటువంటి పనులను నెరవేర్పగలవు.

పురాణగాథలయందువలెనే పద్యములయందును మీకు మిక్కిలి నిరసనభావ మున్నట్లు పొడకట్టుచున్నది. పద్యము అస్వాభావికమనియు పద్యపఠనవ్యాజమున నాటకప్రదర్శనము సంగీతమయము అగుచున్నదనియు మీరు వాదింతురు. నిజము ఆరసినచో పద్యములును, సంగీతమును నాట్యమునకు ఉపకారకములేకాని, ప్రతిబంధకములు కావు. నాట్యము మిశ్రకళ. దానికి అంగభూతములైన కళలలో సంగీత మొకటి. ఆ సంగీతము సముచితముగా ప్రయోగింపబడి యథాస్థానమున ఉన్నంతవరకు, దానివలనగలుగు కీడేమియులేదు. రసోచితమైన రాగమును, పాడవలసిన మితిని ఎరుగని నటునివలన నాట్యము చెడిపోవుచున్నదిగాని పద్యముల యునికివలన కాదు. సంగీతము వలెనే కవిత్వమును నాట్యమునకు ఇంకొకయంగము. పద్యము కవిత్వసారము. రసోచితమైన వృత్తమును వ్రాయవలసిన చోటును ఎరుగని కవివలన నాటకము చెడిపోవుచున్నది. కాన ఎచ్చటపద్యము వ్రాయవలెనో, ఏఛందో విశేషమువాడవలెనో, తెలిసికొని కవి వ్రాయుటయు, ఏరసమునకు ఏపద్యమునకు ఏరాగ మెంతవరకుతగునో తెలిసికొని నటుడు పాడుటయు జరగవలెనుగాని, పద్యములనే తుడిచివేయుట వాంఛనీయమైన సంస్కారము కాదు.

రసానుగుణము లైన ఛందోవిశేషము లున్నవా యని ప్రశ్నింతురేమో! ఒకకాలమున నున్నవి. కాలక్రమమున వాని సార్థకతలుప్తమైనది. కాళిదాసుని కుమారసంభవములోని రతివిలాపమనెడి నాల్గవసర్గము వియోగినీవృత్తమున వ్రాయబడినది. ఆవృత్తము వియోగ భావమున కెంత పొందుపడియున్నదో దానిని చదువవలసినట్లు చదివిచూచిన రసికులకు నేను చెప్పనక్కఱలేదు. ఛందశ్శాస్త్రములలో చెప్పియున్న వృత్తములు రసానుగుణముగా లేవని తోచినచో, ఉపజ్ఞాశాలియగు కవి క్రొత్తవి కల్పించుకొనవచ్చును. అట్లే రసానుగుణమైన రాగములును ఉన్నవని గానకళావిదులు చెప్పుదురు. మేఘరంజనీ రాగ మాలపింపబడుచో వర్షముకురియునట. ఒకప్పుడట్లు జరిగినదో! లేదా దానిచల్లదనమునే యీవిధముగా ఉత్ప్రేక్షించిరో! దాని సంగతి యటుంచి మనమెరిగిన యొకదృష్టాంతము చెప్పెదను. పెండ్లి యైనవనాటి తెల్లవారుజామున పిల్లనప్పగించెడి వేళ పాడెడి యప్పగింతలపాట శంకరాభరణమున గాకోలు పాడుదురు. కన్నెనప్పగించునప్పటి యీవద్విషాద శబలితమైన యనురాగమునకు, ఆ రాగమెంత యనురూపముగానుండునో, యీతడవ మీయింటజరుగు పెండ్లిలో గమనింపుడు. కాననాట్య కళ, సర్వావయవశోభిగా నుండవలెనన్న శాస్త్రీయములైన పరిశోధనలు జరిగి యారవాస్యములన్నియు పునఃకవ్రియుక్తములు కావలెను.

ప్రస్తుత నాట్యమునందలి సంగీతము ఏవము కొల్పుటకు ఇంకొక హేతువున్నది. నటులగాత్రములు సుశిక్షితములు కావు. సాంప్రదాయికమైన గానసాధన వారికి లేదు. సాధనలేని గాలిపాట స్వాధీనముకాని గొంతుతో పాడుచుండగా రసోచితత్వము ఎట్లుకల్గును? ఆశిక్షణమే మొదలిడుదురేని హార్మోనియమును మున్ముందే విసర్జింపవలెను. సుశిక్షితమైన గాత్రము పద్యములు చదువుటకే కాక వచనమును చెప్పుటకును ఆవశ్యకమే. ఇట్టి యభ్యాసములు చేయుటకు మనస్సుగాని చేయదగిన యోపికగాని లేక, తోచినట్లు నాటకములాడు లోపము నటులయందుండగా పద్యములను సంగీతమును శపించుటవలన నేమి లాభము?

పద్యము అస్వాభావికమనికదా వివాదము? కళ యను మాటకే అలౌకికమైన రచనా చమత్కారమని యర్థమైనప్పుడు పద్యము అస్వాభావికము గాక మరేమగును? వాస్తవిక మతమనియు కాల్పనిక మతమనియు శిల్పవిషయకములైన రెండు భిన్నమతములు ప్రపంచమున ఉన్నమాట నిజము. ఈరెంటిలో మొదటి మతమువారు శిల్పరచనకును ప్రత్యక్షప్రపంచము-నకును బింబప్రతిబింబసామ్యముండవలెనని గట్టిగావాదింతురు. అందుచే ప్రకృతివిరుద్ధములైనయే యంశములను కళలయందు వారంగీకరింపరు. రెండవమతమువారు కళ, ప్రకృతికి ప్రతిబిం-బము కాదనియు, ప్రకృతిని లయాత్మకమైన పాకముగా రమణీయమూర్తిగా ప్రదర్శించుట కేర్పడిన సృష్టివిశేషమనియు, ఈప్రద-ర్శనము ప్రస్ఫుటమగుటకు వలయునాలంకారికసాధనములన్నియు

శిల్ప యథార్థ్యముగా వాడవచ్చుననియు సమాధానము చెప్పుదురు.

ఈ వాదములలోతును తరచిచూచుటకిది సమయముకాదు. కాని మనకు సంబంధించినంతవరకు ఒక రహస్యము మాత్రము మరవరాదు. ప్రత్యక్షప్రపంచమునకును నాటకమునకును అభేద్యమేని యుండరాదందుమేని ఆ నియమము ఎంతదూరము పాలింపగలము? రంగమున పాత్రలు ఉచ్చరించుమాటలు లోకమున అనుకార్యులు మాటలాడినవేనా? కావనియు అవి కవికల్పితములనియు కదా సమాధానము. అగుచో, ఒకచో నంగీకరించిన కృత్రిమత్వము వేరొకచో ఏల యంగీకరింపరాదు? లోకధర్మమును తెలిపించుచుండుటయే కళాధర్మము కాని, లోకధర్మమే కళాధర్మముకాదు. కళారచన యెప్పుడును లోకమునకు కొంచెముదూరముగా ఉన్నతముగా నుండును. లోకస్వభావము చక్కగా ప్రతిఫలించుకొనుటకే యది లోకమునకు కొంచెము దూరముగా నుండవలెను. అద్దమున ముఖసౌందర్యము చూచుకొను విలాసిని, ఆయద్దమును తనముఖమునకు కొంచెము దూరముగా ఉంచుకొనునట్లే, కళాదర్శమున తన విలాసమును చూచుకొను ప్రకృతిదేవత ఆయాదర్శమును తనకు కించుక యెడముగానే నిల్పుకొనును. కనుక స్వభావవాదమును పురస్కరించుకొని కళల మూలధర్మములను ఛేదింప యత్నింపరాదు. పద్యరచన కావ్యమున ఉపాదేయమే కాని రూపకమున కాదందురా? రూపక మనగా కావ్యత్వము లేని నాటకమని వింతసంకోచనము చేసినవా-

రగుదురు. అది హర్షింపదగినవాదముకాదు. లేదా, వైవిధ్యము కొరకు నిర్వచనపద్యబంధములవలె, శుద్ధగద్యనాటకములును ఉండవచ్చును. వానివలన ఏకీడునురాదు. పద్యములుండరాదని వాదించువారివలె గద్యనాటకము లుండరాదని నేను వాదింపను.

నాటకములను ప్రాయించుటకంటె ఎక్కువ యావశ్యక-ములైన సంస్కారములు చాలకలవు. మునుముందు వానికి పూనుకొనుట మంచిది. ప్రస్తుతకాలమున రంగాలంకృతియు వేష ధారణమును రసావస్థానుగుణముగా ఉండకపోవుటయే కాక, మీదుమిక్కిలి రసభంజకములుగానున్నవి. నాట్యశాస్త్రకర్త యోగసమునకు ఏవర్ణముచితమో యేపాత్రికెట్టి యాహార్యము తగునో చక్కగా వివరించినాడు. మనకు ఆ శాస్త్రపరిజ్ఞానము బొత్తుగా లేకపోబట్టి యంధపాయముగా ప్రవర్తించుచున్నాము. మరియు నాట్యము లోకావస్థానుకృతియైనను ఆ యనుకరణము నందును పొందవలసినశిక్ష యెంతో కలదు. కేవలవివేకజన్యమైన యనుకరణముకంటె, వ్యుత్పత్తిపూర్వకమైనది గంభీరతరముగా భావితముగా నుండుననుటకు సందేహము లేదు. కాన నాట్యశాస్త్రము ప్రస్తుతోపయోగియగునట్లు సంగ్రహముగా సచిత్రముగా వ్రాయించి, యానిర్దేశములు ప్రస్తుతదేశ-కాలపాత్రములకు పనికివచ్చునంతవరకు అనుసరించుట మిక్కిలి శ్రేయము. లేనిసందర్భములగాని, ఉన్నను ప్రస్తుతోపయోగ-ములు కానన్న సందర్భములగాని, లోకపరిస్థితులనుబట్టి మనము స్వతంత్ర కల్పనలు చేసికొనవచ్చును. అన్నియుగముల వారికిని

ఆ శాస్త్రమే సర్వదా శరణ్యమని నేనను; ఆమాట శాస్త్రకర్తయు అనలేదు.

"ఏవంనాట్యప్రయోగే బహుబహువిహితంకర్మ శాస్త్రప్రణీతం
నప్రోక్తం యచ్చలోకాదనుకృతికరణం తచ్చకార్యం విధిజ్ఞైః"

"ఏవ మేతే మయాప్రోక్తా
వాగంగాభినయాః క్రమాత్
నోక్తా యేచ మయా తత్ర
లోకాద్గ్రాహ్యాస్తు తే బుధైః"

ఇట్లే సంగీత సాహిత్యములను కూడ కొంతకాలము గురుముఖమున అభ్యసింపవలెను. నాట్యాంగములైన యీ విద్యలు నేర్చి, యీ పరిజ్ఞానమునకు వివేకము జత పర్చినప్పుడు ప్రదర్శనములు సమగ్రసవన్యముగా నుండునని యూహించుచున్నాను. ఏ కళకైనను ప్రజ్ఞబీజము. తత్కళాసంబాధియగు శాస్త్రజ్ఞానము ఆ ప్రజ్ఞను ఉన్మీలితముచేయు దోహదము. గాయకులు, కవులు లోనగు శిల్పులెల్లరు తమతమ సహజశక్తికి వ్యుత్పత్తిచే వన్నెపెట్టుచుండ నటులు మాత్రము కేవలప్రజ్ఞనే నమ్ముకొని యుండుట యేమి న్యాయము? మనతరమువారికి ఈ వయస్సున అక్షరాభ్యాసముచేయుట బొత్తిగా పొసగదుగాన, ఈ విద్యాశిక్ష రాబోవు తరమువారికైనను ఇప్పించుటకై తగిన ప్రయత్నము చేయవలెను. ఒక నాట్యవిద్యాలయమును స్థాపించి, తగిన గురువుల చే విద్యార్థులకు సంగీత సాహిత్య నాట్యవిద్యా ప్రదానము చేయింతురు గాక. ఈ పరిషత్తే ఆ విద్యాలయవల్లికి మూలకందమగుగాక.

---

# ద్విపదభారతము

## పీఠిక

వ్యాసప్రోక్తమగు సంస్కృతమహాభారతము మాతృకగా కవిత్రయకృతమైన ఆంధ్రమహాభారతమవతరించినట్లే, కాలాంతరమున, ఆకవిత్రయ భారతము మాతృకగా ఈద్విపద భారతమవతరించినది. ఇదియుపరకవిత్రయ కర్తృకము.

తిమ్మయ, సోమన, బాలసరస్వతి అనెడి యీ ద్విపద భారతికర్తలు ముగ్గురిలో, తిమ్మయ, నన్నయభట్టువంటివాడు. ఈమహానుభావుడు భారతము ద్విపదీకరించవలెనని సంకల్పించి ఆదిపర్వము మొదలు ద్రోణపర్వాంతమువరకుగల యేడుపర్వములలో, సభాపర్వముతక్క తక్కిన యారింటిని సర్వహించి కొంతవరకు సిద్ధసంకల్పుడయ్యెను. కర్ణపర్వమాదిగా మిగిలిన పర్వములను రచించి గ్రంథమును పూర్తిచేసినవాడు సోమన. మధ్య మిగిలిపోయిన సభాపర్వమును వ్రాసినవాడు బాలసరస్వతీశ్వరుడు. ఈసభాపర్వకర్త, ఈమహాకావ్య సర్గాణములో ఈకొద్దిపాలు దక్కగొనుటకుతిమ్మనార్యుననుగ్రహమే కారణమని తోచుచున్నది. తనకు శిష్యప్రాయుడో మిత్రుడో అయిన బాలసరస్వతిప్రార్థన నంగీకరించి తిమ్మనార్యుడీచిన్నపర్వమును ఆతనిపరము చేసియుండును. లేకున్న దీనితరువాతి మరి యైదుపర్వములు కొనసాగించిన ఆదిపర్వకర్త, రెండవ పర్వమును స్పృశింపక వదలుటకు హేతువుకానరాదు.

ఆదిపర్వ రచనలోనే యాతఁడస్తమించి యున్నచో పరిశిష్టభాగ-మును పూరించుభారము బాలసరస్వతి తానే వహించెననుకొనవచ్చును. గాని, అది యట్టిదిగాక యాపైని ఐదుపర్వములు తిమ్మయ కృతములుగా కానవచ్చుటచే, ఈసభాపర్వము పరిశిష్టభాగమనుటకు వలనుపడదు. పూర్వకాలమున రామాయణ రచనకు ఉపక్రమించిన భాస్కరుఁడు, తనపుత్రునెడను శిష్యునెడను ఇట్టియనుగ్రహమునే చూపి కొన్ని కాండములు వారిపరము చేయుటయు, ఈ కాలమున శ్రీ తిరుపతి వేంకటేశ్వరకవులు దేవీభాగవతమున రెండు స్కంధములు తమ కవిమిత్రులచే వ్రాయించుటయు ఈ సంప్రదాయమునకే దృష్టాంతములుగా పేర్కొనవచ్చును. భాగవతమున వెలిగందల నారయాదుల పేర కొన్ని స్కంధములు కానవచ్చుటయు ఈ యాచారమును బట్టి యనియే నాయూహ.

తిమ్మయకవి, వల్లభనూరికుమారుఁడు; కాశ్యపసగోత్రుఁడు. ఇన్ని యాశ్వాసముల తుదిని గద్యస్థానీయములైన ఈక్రింది ద్విపదపంక్తులు పైవిషయముల కాధారము—

"ఇదిసదాశివభక్త హితగుణాసక్త
సదయస్వరూప కాశ్యపగోత్రదీప
శ్రుతిపాత్ర వల్లభనూరిసత్పుత్ర
మతిమద్విధేయ తిమ్మయనామధేయ
రచిత...పర్వ నిర్మలకథయందు
నుచితమై యాశ్వాస...మయ్యె"

ఈకవి నివాసస్థలము నెల్లూరు మండలములోని బట్టేపాడు గ్రామమనియు, ఇంటిపేరు బట్టేపాటివారనియు ఊహించుటకు కొంతయాధారము దొరకినది పుష్పగిరి తిమ్మనకు సమకాలికుడును సహోత్రియునగు తేకుమళ్ళ రంగశాయి యనుకవి తన ద్విపదభాగవతములో (అముద్రితము) పూర్వకవిస్తుతి చేయునప్పు సందర్భమున, ఈద్విపదభారతకర్తయెడ సంస్మరణరూపమగు భక్తి ప్రకటించియున్నాడు. ఆస్తుతివాక్యములో, ఈ కవి పేరు తిరుమలభట్టనియు, ఇంటిపేరు బట్టేపాటివారనియు కలవు:-

"రామాయణంబు భారతమును ద్విపద
లై మీరజేసిన యారంగనాథు
ధీరు బట్టేపాటి తిరుమలభట్టు
గారి శ్రోత్రోక్తులు గలుగస్మరించి
సునయుండు మత్సహోత్రియునైన
గిరిధైర్యనిధి పుష్పగిర్యప్పనార్య
వరుని సుపుత్త్రి.........
సారజు తిమ్మనసత్కవి బిలిచి
యతనిసహాయత చతురోక్తియుక్తి
......భాగవతపు...స్కంధముల్ పదియును
రెండు రచియించితి"

(తేకుమళ్ళ రంగశాయి, ద్విపదభాగవతము)

మరియు, ఈకవికిఆశ్రయమిచ్చివిరాటపర్వము కృతిగొన్న జంగాలమమ్మయరెడ్డి యను పంటవంశ్యుడుబట్టేపాడు గ్రామవాస్తవ్యుడు:

"శ్రీరాజితాకార, శివభక్తిపూర
గౌరవాకార, జంగలముమ్మధీ"
"డిండీరకీర్తి బట్టుపాటినిలయ!"

కవినివాసస్థలము కూడ ఈబట్టుపాడుగ్రామమేయని యు, ఊరిపేరునుబట్టి యింటిపేరును అదియే యైనదని యు విశ్వసింపవచ్చును. కాని భారతమంతటను "తిమ్మయ"-"తిమ్మన" గా గోచరించు ఈ కవియేనా, రంగశాయిచే తిరుమలభట్టుగా పేర్కొన బడినవాడు! అనుసందేహము కలుగవచ్చును. బట్టుపాటి సంబంధముకలిగి, ద్విపదభారతము రచించిన వేరొక తిరుమలభట్టు కావచ్చునంతవరకు, ఈతిమ్మయయే ఆతిరుమలభట్టని విశ్వసించుటకు ఏవిధమగు నెరుబాటును ఉండనక్కరలేదు. బట్టుపాడు - ద్విపదభారతకర్తృత్వము - నామధేయము - అను మూడు విశేషములలో ఒక్కనామధేయమునమాత్రము కొంత వ్యత్యాసమున్నది గాని, తక్కిన రెండును సమానముగనే యున్నవి. పేరులైనను పొత్తు పొసగనంత దూరముగా గాక ఐక్యమును సాధించుటకు అనువుగనే యున్నవి. తిరుమలయ్య తిమ్మయగా, తిమ్మయ" తిరుమలయ్యగా లోకమున వ్యవహరింపబడుటలో వింతయేమియు నుండదు. ఇప్పటికి ఇతని పేరు "బట్టుపాటి తిమ్మయ" అనియే యనుకొందము.

ఈభారతమును అర్థాధికముగా రచించినవాడు అత్తుకూరి సోమన. ఇతని తండ్రిపేరు తిమ్మయ:

" ఇది వేంకటాచలాధీశ్వర దివ్య
పదపద్మ మకరంద పానద్విరేఫ
మగు నాతుకూరి తిమ్మార్యతనూజ
సుగుణాఢ్య సోమనసుకవీంద్రవర్య
రచితమై కర్ణపర్వమున నాశ్వాస
ముచితార్థయుతముగా నొక్కటియయ్యె."

ఈతని భారతభాగములోని అన్నిపర్వముల యన్ని యాశ్వాసములతుదిని ఈపంక్తులే యుండును. ఆతుకూర నెడి యింటిపేరునుబట్టి యీతనినివాసస్థలము నెల్లూరుమండలము లోని 'ఆత్మకూరై' యుండునని యూహింపవచ్చును. లేదా, ఈగృహనామము ఆగ్రామనామమునుబట్టి వచ్చినదే కాదేమో? కాని బట్టేపాటి తిమ్మయకృత భారతమునందుకొని పూర్తిచేసిన యీతడు, బట్టేపాటికి సమీప గ్రామమగు ఆత్మకూరు వాస్తవ్యుడై యుండునని యెంచుటయు దోసగు కాదు. 'ఆత్మకూరు' 'ఆతుకూరు' అనియు వాడుకలో నున్నదట. ఈజంటగ్రామములు (బట్టేపాడు-ఆత్మకూరు) ఒకకాలమున ఉదయగిరి రాజ్యలక్ష్మికి పాదుపద్మములుగా పరిఢవిల్లినవట—

" ఉదయగిరి రాజ్యలక్ష్మికి
సదనము నెల్లూరు; అట్టి సాధ్వీమణికిన్
వదనంబు కందుకూరగు
పదయుగళంబాత్మకూరు బట్టేపాడుల్." (చాటువు)

కావున ఈ ద్విపదభారతజన్మస్థానము, ఇప్పటి నెల్లూరు మండలము.

స్థూలదృష్టికి, ఈ సోమన యాదిపర్వకర్తయగు తిమ్మనకు కుమారుడేమోయని భ్రమ కలుగును. కాని తరచిచూచిన మీఁద, ఈ కవులిరువురకు అట్టిసంబంధము కానరాదు. కొడుకే యైనచో, భట్టబాణుని పుత్రుఁడు కాదంబరి యుత్తరభాగ ప్రారంభమందువలె, కాచవిభు విఠ్ఠలరాజులు రంగనాథ రామాయణోత్తరకాండాదినివలె, సోమన కర్ణపర్వారంభవేళ గాని, మరి యే యితరాశ్వాసాంతమందుగాని తండ్రిరచనను కొనసాగించువాఁడని తననుగూర్చి చెప్పికొనక మిన్నకుండ జాలఁడు. చెప్పుకొనుట, పితృపూజ్యతకును స్వీయగౌరవము నకును కారణమగును; చెప్పుకొనకుండుట, పితృతిరస్కారము నకును ఆత్మపాపమునకును హేతువగును. ఈకవియీధర్మాధర్మ ములను ఆలోచింపలేని యవివేకి కాఁడు.

అది యట్లుండ, ఆరణ్యపర్వమునుతిమ్మయసంగ్రహముగా రచింపగా, సోమన మరికొన్ని యుపాఖ్యానములతో దానిని విపులీకరించి, అయిదాశ్వాసములను ఏడాశ్వాసములుగాపెంచి, ఆపెంపును తానే చేసినట్లు ఆపర్వాంతమున చెప్పికొన్నాఁడుః—

"......ఆరణ్యపర్వంబునందు
......తిమ్మనార్యుఁడు విడిచినకథలు
కువలయంబున నాతుకూరి...
......వేంకటాచలాధీశ్వర దివ్య
పదపద్మ మకరంద పానద్విరేఫ
మగు నాతుకూరి తిమ్మార్యతనూజ

సుగుణాఢ్య సోమనసుకవీంద్రవర్య
విరచితారణ్యాఖ్యవిపులపర్వమున
నరుదుమీరగ సప్తమాశ్వాసమయ్యె."

దురదృష్టవశమున ఈ పంక్తులుగల తాటాకు, క్రిమిదష్ట మగుటచే కొన్ని పంక్తులు అసమగ్రములుగా నున్నవి. మిల్చి యున్నవైనను కొంతవరకు ఈమూలాంశకు అక్కరకువచ్చునవి యగుటచే,సంతసింపవలసినదే. ఈపంక్తులలోనిరువురుతిమ్మనార్యుల పేళ్లుకలవు, ఒకడు ఆరణ్యపర్వమున కథలువిడిచినవాడు; అనగా ద్విపదభారతకర్త. రెండవవాడు సోమనసుకవీంద్రుని తండ్రి. ఈయిర్వురును అభిన్నులేయైనచో, అనగా సోమన ద్విపదభారత కర్తయగు తిమ్మయకొడుకేయైనచో,-ఆత్మసంబంధరహితముగా, నిరుపపదముగా ఊరక 'తిమ్మనార్యుడు' అని వ్యవహరించుట కైనను ఆతడు వెనుకాడియుండునుగదా! మరియు, భారత కర్త తిమ్మనార్యుడు 'సదా శైవ భక్తుడు.' సోమన తండ్రి తిమ్మనార్యుడు 'వేంకటాచలాధీశ్వర దివ్య పదపద్మ మకరంద పానద్విరేఫము.' అదిగాక, తిమ్మకవి యింటిపేరు 'బట్టేపాటి' వారు. సోమన యింటిపేరు 'ఆతుకూరి' వారు. కావున ఇప్పటికి లభించిన ఈ యాధారములనుబట్టి తిమ్మనసోమనకవులు తండ్రికొడుకులు కారని నిర్ధారింపవచ్చును.

పైని చూపబడినరీతిని ఈసోమన కర్ణపర్వాదిగా మిగిలిన పదునొకండు పర్వములను రచుచేగాక, తిమ్మకవికృతమైన యారణ్యపర్వమును విపులీకరించి సమగ్ర మొనర్చెను. ఈతని

యీరచనయంతయు బాలసరస్వతిరచనవలె తిమ్మయ సమక్ష-మున సమకాలమునగాక, ఆతని జీవితానంతరమున ఏకొలది కాలమునకో జరిగియుండునని తోచుచున్నది. అట్లు కానిచో, ఆతని యారణ్యపర్వమును తానై స్వతంత్రించి విపులీకరించు-టయు, ఒక్కపట్టున పదునొకండు పర్వముల గ్రంథమునంతను తానే రచించుటయు పొసగదు. తిమ్మన యనుమతిమీదనే, బాలసరస్వతివలెనే, భాంతకర్తృత్వభాగభాగ్యము ఆసించిన వాడైనచో, ఆతనివలెనే ఏకొన్ని పర్వములో ఎడనెడ వ్రాసియుండును గాని, అర్ధాధికమైన యింత పెద్ద భాగమును తిమ్మయయుడుగజాడయైనను గానరాకుండ తానే యరికట్టు కొనుట యసంభవము. తక్కిన పర్వములమాట యెటులున్నను. ఆపక్షమున, స్వర్గారోహణపర్వము తిమ్మయ యీతనిపరము చేయుటకే వలనుపడదు. కావ్యగోపుర నిర్మాణమునకు ఆరంభించినశిల్పి, శిఖరారోపణ మహాభాగ్యము నితరుల పరమొనర్చి తాను దూరముగా తొలగియుండ లేడు నిర్వహణానందము ప్రారంభకుతూహలము కంటె ఎన్ని మడుగులో గొప్పది. కావున బాలసరస్వతి తిమ్మయకవిక సమకాలికుడు; సోమన యర్వాచీనుడు.

వీరెప్పటివారు? అను సమస్య సులువుగా పరిష్కారము చేయరానిది. దానికివలయు నాధారము లీగ్రంథమున సూచనా మాత్రముగనైన లేవు. అయినను యథాశక్తి నొక స్థూల నిర్దేశము చేయబూనెదను. పెద్దలు వివేచింతురుగాక.

తిమ్మనకవియెడ భక్తి నెరపిన ద్విపదభాగవతకర్త, (పూర్వోదాహృతుడైన తేకుమళ్ల రంగశాయి) 18 వ శతాబ్ది చరమభాగముననున్న పుష్పగిరి తిమ్మనకు సహోత్రి గావున, ఈబట్టుపాటి తిమ్మకవి యంతకుపూర్వుడని చెప్పనక్కరలేదు. అతని కాలమునకు ఇది యొకవైపు మేర.

మఱియు, తంజాపురీ పుస్తకభాండాగారమునకై యీద్విపదభారతము ప్రతులువ్రాయించిన యుదారశీలుడు శాహాజీయనెడి మహారాష్ట్రప్రభువు. ఈరాజు, ఆంధ్రనాయక వంశమును తొలగించి తంజావురిని స్వాధీనమొనర్చుకొన్న ఏకోజీకుమారుడు. అనగా, చోళమండలము నేలిన మహారాష్ట్ర వంశములో రెండవ పురుషుడు. ఈతని పరిపాలన కాలము క్రీ. శ. 1684–1712. ఈ రాజు నానతిని సంబాజీయనెడి రాజోద్యోగి, ఖప్పయమంత్రియనెడివ్రాయసకానిచే ఈభారతము ప్రతి వ్రాయించినట్లు, విరాట - ఉద్యోగ - భీష్మ - అశ్వమేధ పర్వాంతముల నుదాహరింప బడియున్నది.

దీననిబట్టి సోమన, శాహాజీ ప్రభువునకు పూర్వుడై యుండవలెను. ఎంత పూర్వుడు! అనునదియు తేల్చరాని విషయమే. కాని, సోమనగ్రంథము ప్రతులు వ్రాయించుకొనదగినంతప్రశస్తి సంపాదించిన ప్రాచీనరచనయైనపుడే, తంజావూరు వారికి దానియెడ అంత యపేక్ష కల్గుటకు వీలుండును. కావున సోమన శాహాజీకి సమకాలికుడును అవ్యవహితపూర్వుడును గాక కొంతప్రాచీనుడే కావగును. అత్యుక్తి లేకుండుటకై

ఆప్రాచీనతను ఏబదిసంవత్సరముల వ్యవధిగా అంగీకరింతుమేని, యీకవి 17 వ శతాబ్ది పూర్వభాగముననో మధ్యభాగముననో యుండియుండవలెను (1600-1650). మరి, యితనికి పూర్వుడైన తిమ్మయకాలము 16 వ శతాబ్ది తుదిభాగమో, మధ్యభాగమో కావచ్చును (1550-1600), ఈయిర్వురు నింతకంటె ప్రాచీనులైనచో, తిమ్మయ యించుమించు కృష్ణదేవరాయల కాలమువాడగును. ఆమహారాజు పరిపాలనా కాలమున, కన్నడములో కుమారవ్యాసుడనుకవి భారతమును దేశీయచ్ఛందమైన షట్పదులలో రచించెను. కాలపరిభావమున ఈ రెండు భారతములును ఒకయుగముననే పుట్టినవేమో!

ఈ కవుల కాలమును గురించి నియతోపకారకములైన ఇతరాధారములు లభించునంతవరకు ఇంతకుమించిన నిర్ణయము చేయజాలను. ఆభారము లోకమునకును భావికాలమునకును వదలితిని.

ఈ ముప్వురిలో తిమ్మనార్యుడు, ఆదిపర్వమును నరసయాధిపు కుమారుడైన చౌడామాత్యునకంకితమొనర్చెను. విరాటపర్వమును జంగాల మలిరెడ్డి పౌత్రుడును దేవయ పుత్రుడును అయిన ముమ్మడు యనుపేరుగల పంటవంశ ప్రభువునకు కృతినిచ్చెను. తక్కిన తన పర్వములన్నియు రామార్పితమే చేసెను.

ఈచౌడప్ప యేరాజునకు మంత్రియో, ఆతనితండ్రి నరసయాధిపుని యాధిపత్యము ఏసీమకో, ఏ గ్రామమునకో?

తెలియవచ్చుటలేదు. ముమ్మయరెడ్డి విషయము మాత్రము ఇంతకంటె కొంతమెరుగు. ఈతని నివాసము బట్టెపాడు గ్రామమని స్పష్టీకరింపబడినది. కాని, ఈతనివృత్తి యెట్టిదో! ఏ చక్రవర్తికి సామంతుడో, ఏరాజునకు దుర్గాధిపతియో, ఇంకేప్రభువునకు దండనాథుడో? నిశ్చయముగా చెప్పలేము గాని, అసాధారణ గౌరవముగల యొక మేటిమానిసియని మాత్రము సమర్థింపవచ్చును. ఈమేటితనము కేవలసంపన్న గృహస్థతమాత్రమే కాదు. మరి, "కర్ణాటతిలక-చలమర్తి-గండాది" బిరుదాంకితము; "పరిపాలనాభార ధౌరేయము"; "లలిత చౌవష్టి కళా ప్రావీణ్యాత్మకము". ఏవంవిధ గుణ మహితుడైనయీకృతిపతి, ఉదయగిరి రాజ్యాభ్యుదయకాలమున, బట్టెపాడుప్రాంగసీమకు వంశపరంపరాగతమైన యాధిపత్యము వహించి చరిత్రప్రసిద్ధినందిన యొకమహాపురుషుడై యుండును.

దురదృష్టవశమున మనదేశచరిత్ర 'అతుకులమారి బొంత'గా నుండుటవలన ఇటువంటి మహాపురుషులెందరో ఊరును పేరును లేకుండబోయిరి. అదేసమగ్రమైననాడు, ఇట్టివారి పేర కొన్నిప్రకరణములు వేరుపాటు చేయవలసియుండును.

అయితే, ఈకృతిపతిత్వమీమాంసలో ఒకచిన్న చిక్కు-ఉన్నది. అది విడదీయరానంత చిక్కు-మాత్రము కాదు. ఏమనగా, నేనుజూచిన విరాటపర్వ ప్రతులు నాలుగుగలవు:- తంజావూరి ప్రతి, మద్రాసు ప్రాచ్యలిఖిత గ్రంథాలయ ప్రతి, వనపర్తి శ్రీనివాసాచార్యులువారి ముద్రితప్రతి, ఆంధ్ర

విశ్వవిద్యాలయప్రతి, (శ్రీ శేషాద్రి రమణకవులు, నైజాము సీమనుండి ఆంధ్రవిశ్వవిద్యాలయమునకై సంపాదించిన తాళపత్ర గ్రంథసముదాయములోనిది). ఈనాల్గింటిలో ఒక్కతంజావూరి ప్రతిలోమాత్రముతప్ప, తక్కినమూడిటను ఈపర్వము ముమ్మ-యాంకితముగానె ప్రస్ఫుటమైయున్నది. తంజావూరి ప్రతిలో ముమ్మయస్థానమున శ్రీరాముడు ప్రతిష్ఠింపబడెను. ఈమార్పు తంజావూరి వ్రాయసకాండ్రు చేసిరో, లేక, వారి వ్రాతకు మాతృకయైన ప్రతిలోనె కలదో! ఈమార్పుచేసినవారి యుద్దేశ మెట్టిదైయుండునో ఊహించుటకష్టము. దైవవశమున, ఏకవాక్యతగల మరి మూడు ప్రతులు ఆంధ్ర దేశమందలి నానా భాగముల లభింపకున్నచో, తంజావూరి ప్రతివలన ముమ్మయ రెడ్డియు మనుమును వంచితులమే యయ్యెడివారము. ఇటు చెన్నపట్టణము మొదలు అటు నైజామురాష్ట్రము వరకు వ్యాపించిన ముమ్మయ పేరు, తంజావూరిలో లేనంతమాత్రమున శంకింపదగినదికాదు. ఉన్న పేరును ఒకచోట తుడిచివేయ వచ్చునుగాని, లేనిపేరును పలుచోట్ల కల్పించుట కష్టము. విరాటపర్వము ముమ్మయాంకితమే.

నరసయచౌడుని విషయమునను తంజావూరి ప్రతి కొంత వంచనకె దొరకొనెనుగాని, అది తుదముట్టలేదు. ఆదిపర్వములో మొదటి మూడాశ్వాసములలోను నరసయచౌడుని పేరు తొలగింపబడి, యాస్థానమున శ్రీరాముని పేరు నెలకొల్పబడినది. తక్కిన అయిదాశ్వాసములును ఆ మంత్రిపేరనే చెల్లుచున్నవి.

ఈపర్వమునకు లోకమున మరెవ్వటను ప్రత్యంతరము లభింపక పోవుటచే మొదటి మూడాశ్వాసములు యథాస్థితిని కనిపట్టి విమరించుటకు వీలు కాకపోయెను అయినను, ఉన్న యాధారమును బట్టి యాదిపర్వము చౌడామాత్యాంకిత మనుకొనుటలో సందియము ఉండనక్కర లేదు.

ఈ వాదమునకు ప్రత్యంతరము ఆలోచించి యీక్రింది విధముగా ఆశంక చేయవచ్చును:-"తిమ్మయ తనపర్వములన్నిటిని రామనామాంకితముగను రచింపగా, కాలాంతరమున చౌడామాత్యుడు ఆదిపర్వమునందును, ముమ్మయరెడ్డి విరాటపర్వమందును శ్రీరాముని తొలగించి యాచోట తమపేర్లు చొప్పించుకొనగూడదా!" యని. కాదుగాని యిందు సంభావ్యత లేదు. ఈకృతిపతులు అట్టిదొంగతనమునకే పాల్పడినచో సొత్తునంతను అపహరింతురు గాని, కొంచెముతో తృప్తిపడి యెక్కువపాలు వదలిపెట్టిపోరు. వదలిన ఆయెక్కువపాలు తమ దొంగతనమును పట్టిచూపునేడి భయమునకును లోనగుదురు. అదిగాక, ఈపంచమ ప్రారంభించిన నరసయచౌడుడు దానిని తానే తుదముట్టించి యుండునుగాని, స్థలాంతరమందలి ముమ్మయరెడ్డికి కొంతపాలు వదలిపెట్టడు. మరియు, ఈపురుషు లిరువురును ఇట్టి నికృష్టకార్యమునకు లోపడవలసిన నీచులును గారు. వారు సంఘమున ఉన్నతపదస్థులు; దానకర్ణుడని దిక్కులవెలసిన మంత్రియొకడు; "కర్ణాట తిలకు" డని పేరు మోసిన జనాధీశుడొకడు. కృతిపతిత్వకాంక్ష తీర్చుకొనుటకై

యీయిరువురు "ఈశ్వరార్పణ" మన్న వస్తువు నపహరించు కర్కర్తకి పాల్పడక, స్వతంత్రించి తామే యెన్నోగ్రంథములను వ్రాయించుకొనగల సమర్థులు. కావున వీరి కృతిపతిత్వమును నవ్యాజ మొనర్చుటకు నామనసు ఒల్లకున్నది.

"మరి, తిక్కయకవి గ్రంథమునంతను ఈ యిర్వురికో వీరిలోనొకరికో అంకిత మొనర్పక, కొంత యీతనికి, కొంత యీతనికి, మరికొంత రామునకు, ఏలసమర్పింపవలెను?" అను ప్రశ్నయు రావచ్చును. ఈప్రశ్న వలెనే సమాధానమును సులభమే. ఆ కవి యొక్కొక్క పర్వము నొక్కొక కృతిగా నూహించి, ఆ యా కృతులను దొరకినప్పుడు దానకర్తలైన పతులకు సమర్పించి, దొరకనపుడు "బ్రహ్మార్పణ" మని రామునకు ధారవోసియుండును. భాస్కరరామాయణముప్రతి నిగ్రహమును సమగ్రమును అయినది లభించినపుడు, ఈ ద్విపద భారతమువలెనే, కొన్ని కాండములీశ్వరార్పితములుగా, మరి కొన్ని సాహిణిమారాంకితములుగా, వేర్వేర కనుపట్టునని నాయూహ. ఇప్పటిముద్రితప్రతులలో, ఆ రామాయణ కృతిపతిత్వము చాల తారుమారుగా అనిర్దేశ్యముగా నున్నది.

సభాపర్వము ఆదిని, రామాంకితముగను, అంతమున రంగయామాత్య పుత్రుడగు అనంతామాత్యున కంకితముగను ఉన్నది. బాలసరస్వతీశ్వరుడు ఈయిరువురను కృతిపతులగా భావించినో? లేక రామునకే యంకితమిచ్చి తనపోషకుడగు అనంతామాత్యుని గౌరవార్థము సంబోధించెనో?

రాఘవపాండవీయ కృతిప్రదానముకూడ, ఇట్లే ఆకువీటి పెదవేంకటాద్రికా? వికూపాక్షునకా? అని సందేహింపదగినట్లుండును.

సోమన, తన పదునొకండు పర్వములను శ్రీ తిరుపతి వేంకటేశ్వరునకే సమర్పించెను. తిక్కయ క్లుప్తముగా వ్రాసి విడిచిన యారణ్యపర్వమున ఈతడు పెంచి తిరుగవ్రాసిన గ్రంథభాగమునుగూడ ఆ దేవునిపరమే చేసెను. ఇది ఈ ద్విపద భారతచరిత్ర స్వరూపము.

చిత్రవిచిత్ర కార్యకమనీయమైన ప్రకృతిదేవతా-చిద్విలాసమునుచూచి యానందపరవశుడై, ప్రాకృతజీవియగు ప్రాక్తనమానవుడు చిందులుత్రొక్కుచు పాడినపాటయే మానవలోక కవితావిర్భావమునకు శ్రీకారము. ఆ కవిత్వము ఆడుచు పాడినదిగనుక దానికి "ఆట-పాట" లేక "నృత్తగీతము" (Ballad dance) అని పేరు. ఈ "యాట-పాట" లో మూడు భిన్నకళాంశములు కలవు :— అడుగువేయుట, రాగము తీయుట, మాటపలుకుట. శాస్త్రపరిభాషలో ఈమూడును క్రమముగా నృత్తము-గీతము-శబ్దము-అయినవి ఈమూడిటిలో శబ్దమే కవితాద్రవ్యము; తక్కిన రెండును ఉపస్కారకములు. కాలాంతరమున ఈమూడంశలును క్రమముగా మూడు భిన్నశాఖలై, నాట్యము - సంగీతము - పద్యముగా పరిణమించినవి తొలినాటికవిత్వమునకు సాహచర్యము నెరపిన నృత్తగీతములలో నృత్తమును పూర్తిగను గీతినికొంతవరకును తొలగించి,

కవిత్వమునకు ప్రధానాంగమైన శబ్దము తన రాజ్యమును తానే యేలుకొనజొచ్చినది. అదియే పద్యకవిత. ఈరాజ్యములో నృత్తమునకు ప్రవేశమే లేదనుట యెల్లరకును విశదమే. గీతికిమాత్రము అప్రత్యక్షమైన యధికారము కొంతకలదు. గీతిగతమైన యే లయపరిబద్ధత కలదో అదే పద్యగతమైన ఛందస్సు. ఈ ఛందస్సుకతముననే పద్యపఠనవేళ మధురమైన యొకగీతివిశేషము, వచనపఠనముకంటె భిన్నమైనది వ్యక్తమగు చుండును. పాటగాపుట్టినకవిత్వము పద్యముగా పరిణమించుటలో నృత్తమునువలె గీతమును కేవలము విసర్జింపలేక పోయినది. దానినిసైతము విసర్జింపవచ్చునని ఋజువుచేయుటకు పుట్టినదే గద్యకావ్యము. ఛందోవిసర్జనమువలన గద్యము కవిత్వమని-పించుకొనునా లేదా? అనునది విషయాంతరము. అది యెమయి తేల్చదగినదికాదు. కాని, తనరాజ్యమైన కవిత్వమున తానే సర్వాధికారము నెరపుటకై శబ్దముచేయుకృషి యెంత దూరము పోవునో చూపుటకు మాత్రమే ఈ యంశమును స్మరించి విడిచితిని.

గీతికి అప్రత్యక్షసంబంధము మాత్రమే కాక ప్రత్యక్షాధి-కారమే యొసగినకవిత్వము పదకవిత్వము. పద జాతికిని పద్య జాతికిని ముఖ్యమైన భేదమిదియే. ఈ పదజాతిలో ఇంకొక యుపశాఖ, కవిత్వాంశకంటె గానాంశకే యెక్కువప్రాధాన్యము నొసగి గేయకవిత్వమనెడి వ్యపదేశము తాల్చినది. గీతిని అంగీకరించియు కవిత్వాంశకే యెక్కువ ప్రాధాన్యమిచ్చిన

రెండవయుపశాఖ, జాతివాచకమైన పదకవిత్వము పేరనే నిలిచి యున్నది. వీనిలో మొదటిదాని సంచారము, రాగతాళ ప్రధానమైన సంగీతకళాజగత్తున; రెండవదాని ప్రవర్తన, భావనా ప్రధానమైన సారస్వతశిల్పలోకమున. ఈ రెండు శాఖలనుండియు మరల పెక్కు చిలవలు పలవలు పుట్టినవి. వానిసూక్ష్మవివరణము ఇయ్యెడ అపేక్షణీయము కాదు. కావున గేయశాఖ-పదశాఖ-యనెడి వర్గీకరణముతో నిలిపెదను.

ఏ వాఙ్మయములోనైనను ఈపదకవిత్వము పద్యకవిత్వము కంటె ముందు పుట్టి పెరుగును. కాని, ఛందోవ్యాకరణాద నియమనిష్కర్షతయు, శైలిప్రౌఢియు, ఇతివృత్తౌదాత్త్యము, విజ్ఞానాధాయకతయు లోనగు నితర కవితామహాంగముల సంతరించుకొని, నాగరకమై పద్యకవిత్వము, ప్రౌఢ సాహిత్యమను పేర విద్వల్లోకమున స్థిరప్రతిష్ఠ సంపాదించుకొనును. పదకవిత్వము, అతిసరళమధురమును నిరాడంబరమును అయినను ప్రౌఢవాఙ్మయమున స్థానమూనింపక, గాలిలోనేపుట్టి గాలిలోనే సంచరించుచు, పుట్టుకదార్ఢ్యమువలన కొంతకాలము సజీవమై యుండును. ఇదియే, మనలో శుద్ధదేశికవిత్వమనిపించుకొన్న శాఖ. దీనికిని సారస్వతప్రతిష్ఠ నాపాదించి స్థిరత్వము నలగొల్పుటకై పలువిధముల పాటుపడిన సంస్కర్తలే ద్విపద కావ్యకర్తలు. పాడదగిన పదకవిత్వమునెడ నొకకంటిని పఠనయోగ్యమైన పద్యకవిత్వమునెడ రెండవకంటిని పెట్టి, యుభయగుణములను ఏకముచేసి ఆమహానుభావులు వచనము

చేసిన రసాయనమే ద్విపదకవిత్వము. ఇది గేయమును అగును, పాఠ్యమును అగును. ఈవాఙ్మయశాఖ నిసర్గమాధుర్యముతోడి యుదాత్తతకు, నిరాడంబరత్వముతోపాటు విజ్ఞానాధాయకతకు, సౌలభ్యసహితమైన శైలీప్రౌఢికి కూడలియై, దేశీయమైన శుద్ధపదకవిత్వమునకును సాంస్కృతికమైన ప్రౌఢసాహిత్యమునకును సామరస్యము గలిగించి, యుభయతారకమైన కావ్యపథమును తీర్చిదిద్దినది.

ఈ వాఙ్మయమునకు మూలపురుషుడు పాల్కురికి సోమనాథుడు. పద్యకావ్యపథము తీర్చుటలో నన్నయ యెట్టి ప్రథమాచార్యుడో ద్విపద కావ్యపథమును తీర్చుటలో సోమనాథు డట్టియాచార్యుడు.

ఈ మూలపురుషత్వమునుబట్టియు, గౌరనాదుల శైవ మతమునుబట్టియు గాబోలు, శైవులే ద్విపదవాఙ్మయసిర్మాతలని దేశికవితాభిమానులని యొక అపప్రథ లోకమున వ్యాపించినది. ఇతరులమాట యటుండనిండు; సోమన యెంత వీరశైవుడో అంత వీరవైష్ణవులేయైన తాళ్ళపాకవారికి సైతము ఈ ద్విపద ప్రపంచ నిర్మాణములో ఎక్కువ పాలేకలదు. మరియును పాల్కురికి వారివలెనే పరమమాహేశ్వరులైన పిడుపర్తివారి యింట, వారిమగపిల్లలతోపాటు ఆడుపిల్లలువలె, ద్విపదకవితతో పాటు పద్యకవితయు నుదయించినది. ద్విపదసేవయే కవితా వ్రతముగా నెగడిన గౌరనయింటనే ఆతనికొడుకు భైరవకవి "అవశ్యం పితురాచార" మనెడి ధర్మము నుజ్జగించి

శ్రీరంగేశ్వరుని పద్యములలోనే పూజించెను. అంతదూరమేల! ప్రథమ ద్విపదాచార్యుడైన సోమనాథుడే. వారి యవతార పురుషుడగు బసవేశ్వరునిపాదములను చంపకోత్పలములలో అర్చించెను. కావున ద్విపదకు శైవుల సొత్తనియు, పద్యములు వైదికుల ధనమనియు, నేర్పాటుచేయుట సొరగనిసంగతి. ద్విపదలకును కులగోత్రములకును సంబంధమేమియులేదు. దానికి కాలపరిభావములోగూడ పొత్తులేదు. పోగా, ఆ యా కవులయు వారిపోషకులయు ఆశయాభిరుచులే ఆ యా వాఙ్మయులతికు ఆలవాలములనుకొనుట లెస్స.

సోమనాథుని ద్విపదలు అనేకకారణములచే సర్వజన సంసేవ్యములు కాకపోయెను. రామాయణరచనారూపమున ద్విపదకు, సార్వజనీనత కల్గించినవాడు గోన బుద్ధారెడ్డి. ఈతని రామాయణము నన్నయభారతముతో సమానమైన ప్రతిపత్తిని ఆర్జించుకొన్నది. ద్విపదకవిత్వమునకితడు ద్వితీయాచార్యుడు. ఈసోమనబుద్ధన లిర్వురును ద్విపదకావ్యసృష్టిస్థితులకు కారకులు.

అర్వాచీనులగు కొందరుకవులు తమ పద్య రచనా కుతూహలమునుబట్టియో, పద్యప్రబంధములకున్న ప్రచారము ద్విపదకావ్యములకు పండితలోకమున లేదని గ్రహించుట-జేసియో, కృతిపతులయాదేశమునకు లోగియో, వీరి యిర్వురి ద్విపదకావ్యముల ననుకరించి పద్యకావ్యములను సృష్టించిరి. భాస్కర రామాయణము రంగనాథ రామాయణమునకు ఈవిధమగు ననుకరణసృష్టి, సోమనాథుని బసవపురాణము

పిడుపర్తి బసవనయు, పండితారాధ్యచరిత్రమును శ్రీనాథుడును ఆరీతిగనే రూపాంతరమును పొందించిరి. ఈయాచారమంతతో ఆగలేదు. భాషలో పుట్టిన ప్రతి ద్విపదకావ్యమునకును ఇంచుమించు ఈదశయే పట్టినది. శంకరకవి హరిశ్చంద్రయు, తిమ్మభూపతి పరమయోగివిలాసమును, రామనామాత్యుని గయోపాఖ్యానమును ద్విపదకావ్యములు పద్యప్రబంధములైన ప్రక్రియకు కొన్ని యుదాహరణములు.

ఈవింతమార్పు కన్నులయెదుట జరుగుచున్నను, ద్విపద కవులు తమ వాఙ్మయమును ఉత్తరోత్తరాభివృద్ధిగా కొనసాగించుచునేయుండిరి. పద్యవాఙ్మయములో ఎన్ని కావ్యజాతులు కలవో, యించుమించు అన్ని జాతులను వీరుకూడ సృష్టించిరి. అంతమాత్రమే కాదు; వారిలో కొందరు సమర్థులు, పద్యప్రబంధ రాజ్యముపై దండెత్తి యాభాగములను కొన్నిటిని తమ ద్విపద రాజ్యమునకు కలుపుకొనజొచ్చిరి. వారి సొత్తును వీరు, వీరి సొత్తును వారు ఆత్మీయత్వ మొనర్చుకొనుట యొకపరిపాటి యైనది. ద్విపదకావ్యమును ప్రబంధీకరించి యాకథను నవీన మార్గకవితామండలమునకు (Neo-classical field) కొనిపోవలెనని ప్రబంధకర్తలు ప్రయత్నింపగా, ప్రబంధములను ద్విపదీకరించి ఆయితివృత్తములను దేశికవితాభూమికి (Popular field) కొని-తేవలెనని ద్విపదకర్తలు ఉద్యమించిరి. ఈ పినిమయములో ఇరువాగులయెడ నొకరికి స్పర్థమాత్రము లేదు. మాతృకను భక్తితో అనుసరించి, తమరచనలను తల్లిచాలుపిల్లలుగా

కనపర్చవలెననియే ఈ యనువాదకులు ముచ్చటపడిరి. ఈజంటలో దేనిని పరిశీలించినూ చినను, మాతృకలోని భావములు ప్రతిఫలించుచునే యుండును. భావములు మాత్రమే కాదు, ఆపలుకు లేవినబడుచుండును. ఒకరొకరికి ఒండొరులయెడగల యీ విధేయత కతమునసనే వారికి స్పర్థలేదంటిని. స్పర్థలేకపోవుటయే కాదు; పరస్పరభక్తిగౌరవములును కలవు. లేనిచో ఇంత సంపూర్ణానుకరణమే పొసగదు.

పద్యప్రబంధములలో ఉద్గ్రంథములనిపించుకొన్న పురాణేతిహాసములను ద్విపదీకరించిన పెద్దకవులలో ఈబట్టుపాటి తిరుమలార్యుడు మొదటివాడు. పురాణేతిహాసములలో ముఖ్యమైనవి భారత భాగవత రామాయణములు గదా! వానిలో రామాయణమును గోనబుద్ధారెడ్డి స్వతంత్రముగనే సంస్కృతమునుండి తెనుగునకు ద్విపదగా అవతరింపజేయుగా, మిగిలిన రెండిటిలో భారతమును తిమ్మయయు, భాగవతమును తేకుమళ్ళ రంగశాయియు ఆంధ్రపద్యగ్రంథములనుండి ద్విపదకు అవతరింపజేసిరి. ఈపనుసలో బుద్ధారెడ్డి తిమ్మయకు, తిమ్మయ రంగశాయికి మార్గదర్శకులు.

భారతాదిమహాగ్రంథములలోని పరమార్థమును జనబాహుళ్యమునకు సుబోధము చేయవలెననెడి యాశతో, దక్షిణాంధ్రయుగమునకు చెందిన కొందరు కవులు పద్యగ్రంథములను వచనములుగా అనువదించిరి. వారి యనువాదము మూలమునకు కేవలదండాన్వయప్రాయమైన

ప్రతిపద పరివర్తనము కుటచే హా రా సిం చి న ప్రయోజనసిద్ధి సంశయాస్పదమైనది. కాని, వారివలన, తెనుగున ప్రత్యేక వచనరచనలు లేని లోటుమాత్రము తీరినది. సముఖము వేంకటకృష్ణప్పనాయుని వచనజైమినిభాగతము మొదలగునవి ఈ జాతిలోనివి.

ఈ ద్విపదభారతము ఆ వచనములవలె అస్వతంత్ర పరివర్తనముమాత్రము కాదు. వ్యాసభారతమునకు కవిత్రయ భారతమెంతవిధేయమో, వాని భారతమునకు ఇదియును అంతే విధేయము. అనగా, అదియు నిదియు మూలమునకు యథోచితానుసరణము లేకాని యథామాత్రుకములుగావు. ఒక్కొక్కయెడ, మూలానుసరణములో సన్నయకంటె తిమ్మయ యే విశృంఖలముగా విహారించెనేమోయనియు తోచును.

సంస్కృతపురాణకర్తలు, బహుప్రాచీనకాలమునుండియు పరంపరాగతములై వారి చెవిసోకిన యనేకచరితములను, అర్థవంతములను నీతిదాయకములను అని వారికి తోచినవానిని, భారతాది మహాగ్రంథములలో ఎట్లో సందర్భము గల్పించి, పురాతనేతిహాసములను పేర కథలో అతికి, వానియునికికి స్థిరత్వము చేకూర్చిరి. చిన్నవియు పెద్దవియునైన ఈ యుపాఖ్యానముల మూలమున ప్రధానగ్రంథములు ఆవశ్యకతకు మించిన విపులత తాల్చెను. వ్యాసుని భారతము చాలవరకు ఈవిధముగా పెరిగినదే. అందును, అనతారికాప్రాయమైన మొదటి రెండు మూడు ఉపపర్వముల

గ్రంథము మహాగహనమువలె నీరంధ్రముగా అల్లుకొనియున్నది. భారత కథారంభమునకును ఈ భాగములలోని కొన్ని ప్రకరణ-ములకును దూరబంధుత్వమే కాని దగ్గరచుట్టరికము లేదు. మరియు, బ్రిహ్మణకోశములవలె లౌకిక వాఙ్మయము సైతము శ్రుతముగానే నేర్వబడి శాశ్వతముగా కాపాడబడిన యా కాలములో, గ్రంథసందర్భమునకు విషయసూచిక కాదగిన యంశములుకూడ సంస్కృత భారతగ్రంథములో అంతర్భాగ-ములే కావలసిన యావశ్యకతకల్గినది. పర్వసంగ్రహ-పర్వాను క్రమణికాది కథనమంతయు ఆజాతిలోనిదే. ముద్రణ సౌభాగ్య-మును-ముద్రణమందనుకనేల - వ్రాతనేర్పునే యెరుగని మన పూర్వులు, గ్రంథసంరక్షణార్థము పడిన పాట్లకు, వచ్చిన యుపాయములకు ఇదియొక దృష్టాంతము. భారతాదిపురాణేతి-హాసములు దేశభాషలలోనికి అవతరించు కాలమునాటికి ఆ విషయసూచికాదుల యావశ్యకతగాని, అనేకోపాఖ్యాన-ముల ప్రస్తుతత్వముగాని యంతగానుండదు. ఈ ధర్మమును గుర్తెరిగియే నన్నయభట్టు, వ్యాసుని గ్రంథావతారికా గహన-మును చాలవరకుచ్ఛేదించి, మార్గమును సుగమము చేసెను. ఈ తిమ్మయ ఆమార్గమును మరింత చక్కపర్చి రాచబాట నేర్పరచెను.

ఈతడు, తనకు అప్రస్తుతములనితోచిన ఉపపర్వశమంత-కాక్షోహిణీసంఖ్యాకథనము, దేవశుని వృత్తాంతము, చ్యవనుని చరిత్ర, ప్రమద్వరాకథ, మొదలగు ప్రకరణముల నామమాత్ర

ముగనైనను స్మరింపక, సూచ్యార్థసూచనగా భారతకథను ప్రస్తావించి, సాక్షాత్కథాప్రవర్తనకు పూర్వరంగమైన యుదంకుని జనమేజయాస్థానప్రవేశముతో నుపక్రమణము గావించి, భారతకథాశ్రవణకుతూహలపరులైన సభాస్తారులకు దుస్సహకాలయాపన గలుగకుండ, వినువిందొనర్చిన నిపుణ సూత్రధారుడు.

కథాగమనసన్నివేశౌచిత్యకై యీతడు కల్పించుకొన్న యీప్రణాళికయే, ఆదిపర్వరచనకు అంతకును వ్యవస్థాన సూత్రమైనది. ఆ సూత్రము వెంటనడచియే యీతని భారతకథా సరస్వతి, దేవదానవుల యుత్పత్తిక్రమమును, పురూరవాది రాజవంశచరిత్రలను తెలిసికొనలేనని పౌరవవంశవృక్షములను వెనక లేము; వృషితాశ్వశ్వేతకేతువులు, దీర్ఘతమునకు, దూరమునుండియే నమస్కారము సమర్పించి తొలిపోయినది; సుందోపసుందమదపాలాపములను ఒక్కమాటతో మాత్రమే సాగనంపినది; దుర్వహమైన శాస్త్రప్రసంగభారమును తాను మోయగలిగినంతే వహించి తక్కినది విసర్జించినది.

ఈతడు చేసిన స్వైరవిహారములో చాలవరకు దారి చూపినది రంగనాథ రామాయణము. బుద్ధారెడ్డి, ఆంధ్ర పురాణేతిహాసములను తెనిగించిన కవులలో అతిస్వతంత్రుడనియు, రామాయణములో అతడు చొప్పించిన యమూలకగాథాకల్ప-నలవంటివానిని మరి యేయనువాదకుడును కల్పింపలేదనియు, ఆ రామాయణ పీఠికలో నిదర్శనపూర్వకముగా ఉగ్గడించి

యుంటివి. కొంతవరకు ఆ లక్షణమే యీద్విపదభారతమునకును పట్టినది. ఈతడు చేసిన మొదటి యమూలకకల్పన మువ్యాసశ్వాప వృత్తాంతము. సముద్రమథనమునకు మూలకారణమైన ఈ యితివృత్తము వ్యాసభారతమున లేదు. కావుననే నన్నయ భారతమునను లేదు. అయ్యెడ సముద్రమథనోపక్రమము హఠాత్సంభవముగా నున్నది. విష్ణుపురాణాది గ్రంథములలో ప్రథితమైయున్న యీ కథాంశమును తిమ్మయ సముద్ర మథనమునకు పూర్వరంగముగా పొందుపరచి ఆయితివృత్తమును సోపపత్తికము చేసెను. ఈఘట్టములో దేవదానవులకు పొత్తు కూర్చుటకై రాయబారమునడపిన బృహస్పతివాక్యనిపుణత ఈకవి లోకజ్ఞతకును, ఈతని శైలిలోని సంభాషణచాతుర్యము నకును ప్రబలనిదర్శనముగా నున్నది:—

"నావుడు నాదైత్యనాథులతోడ
నావిబుధాచార్యుఁడనియె నేర్పెసఁగ :
అమరవల్లభుఁడు మీయందఱతోడ
సముచితముగఁ గూడుచరియింపఁదలఁచి
పవిపాణి మీతోడఁ బలుకుమన్నట్టి
వివరంబు చెప్పెద వినుడు మీరెల్ల.
తాము నేమును నన్నదమ్ములమయ్యు
నీమాడ్కి నన్యోన్య మీసుగా నేల?
జగతి నేపొద్దొ గోచాలాన మనకు
జగడంబువచ్చెనఁ జనునె పాయంగ?

ఉభయవాదులముఁ గూడఁగొనిన మనకుఁ
ద్రిభువనంబుల నెదిరింపంగఁ గలరె?
యొనరంగ మనమెల్ల నొక్కటై దివిజ
దనుజభటాళిచేఁ దడయక యిప్పుడు
శ్రీయఃధి మథియింప దొరకును నమృత
మాయమృతముఁ ద్రావునంతనె మనము
చావును దెవులును జరయును నెవ్వి
భావింపఁగా రాక భాసిల్లఁగలము.
మా యెగ్గు లేమియు మదిలోన నిడక
యీ యెడ మీరెల్ల నీ కార్యమునకు
..............................
కించిత్తు మేలును గీడును లేదు
వంచక యనుభవింపఁగఁ గీర్తిఁ గలుగు.
అని చెప్పి పుత్తెంచె : నదియును గాక,
యెనయంగ మీరెల్ల నేకరూపమున
వినుఁడు నామాట; యీవిధమున నడవ
ననుకూలమై వచ్చు నన్ని కార్యములు.”
అని వారు పల్కినయందుల కెల్ల
మొనసి ప్రత్యుత్తరంబులు చెప్పి తీర్చె.”

ఆజన్మవిరోధులతో కార్యవశమున మైత్రి నెరపదలచిన కార్యవాది, సమయజ్ఞుడై యెట్టిసల్లాపమాధుర్యమును కురిపించునో ఆ వంచనాచమత్కారమునకు, దేవగురుని యీ యుపన్యాసము మూర్తరూపము.

నిసర్గరమణీయమైన ఈపలుకపొంకమే కావ్యశిల్పమునకు ప్రాణము. అది వ్యక్తమైన ఘట్టములనే యౌచిత్యసంపన్నములుగా, విమర్శకులు కొనియాడుదురు.

హేయమైన తల్లి దాసీత్వమునుజూచి, తనదైన్యమును తలచి, కంటికినివగచి, "అమ్మా! మనకీగతియేమి?" అని వినతను పృచ్ఛించు గరుడుని దీన వాక్యములలో ఎట్టిసహజసల్లాపసుఖమున్నదో సహృదయులు గ్రహించి యానందింతురుగాక :—

"అప్పుడు కద్రువ యతిరాజసమున
నెప్పటిపోల్కి నయ్యిర్వురచేతఁ
బనిగొనుచుండ, నాపన్నగాంతకుఁడు
జననికి నొకనాఁడు సద్భక్తి మ్రొక్కి
తల్లి! నిన్నిదియేమి తవిలి మావార
లిల్లాదిగా వీరికిచ్చిరో వెఱకు?
కాదేని, నీకొండుకడ దిక్కులేమి
నీదెసపొంది నీవిడుమఁ బొందెదవో!
కాకున్న, ననదనై కడుపుఁగూటికిని
ఈకద్రువకుఁ బను లిట్లుచేసెదవో?
అదిగాక, ప్రతినకునైపూని తగవు
వదలక యిట్లుండవలసెనో నీకు?
కులిశసన్నిభ పటుక్రూర తుండాగ్ర
దళిత సింధుర ధరాధరుఁడనై వీరిఁ

చేపట్టి కుచ్చితు చెలువున నేను
ఈపాపకోదమల నిట్లు మోచుటకుఁ
బనియేమి? చెప్పుమేర్పడ నాకు?" .........

ఈపంక్తులు చదువుచున్నప్పుడుఁ గరుడుని యశ్రుస్లావిత నేత్రములును గద్గదకంఠమును భావుకుని మనోనయనమునకును స్వాత్మకర్ణేంద్రియమునకును గోచరించు ననుటకు సందియము లేదు.

పేలవములైన సన్నివేశములనుసైతము, ఈప్రజ్ఞాబలము చేతనే యీకవి చమత్కరించి రసవంతములనిపించగలడు. పైతృకమైనధనమంతయు దక్కఁగొని తానే యనుభవించుచున్న విభావసుని, సుప్రతీకుడను తమ్ముడు తన వంతుకై నిలబెట్టి యడిగినమాటలు ఎంత లోకస్వభావానుగుణముగా నున్నవో చిత్తగింపుడు:—

"సుప్రతీకాఖ్యుఁడచ్చోటికి వచ్చి...............
............చేరియిట్లనియె : నొచ్చితిఁ జేవనైతిఁ;
బితృపితామహులెల్లఁ బెంపారఁ దొల్లి
యతులధనాఢ్యులై యందఱు నేఁగ
దాఁచినయర్థమంతయు నొక్కఁడవె
చూచి చేకొంటి, వచ్చుగ విభాగించి
నాకు నీవలదె ధనంబులో సగము?
చేకొని తండ్రిచేసిన ఋణంబున్న,
నడఁబంచి నాకిచ్చువాఁడవు గావె?

గడుసరితనమేల! కన్నవారెల్ల
నగుదురు; గాన సన్నకుసన్న ధనము
నగమిమ్ము.................'

లోకములో జరిగిన యొకవృత్తాంతము పురాణేతిహాస నిబద్ధమగునపుడు ఆకథ తాల్చెడి యాకారమునకును, అదియే ప్రబంధీకరింపబడినపుడు తాల్చు స్వరూపమునకును ఎంతో వ్యత్యాసముండును. పురాణేతిహాసములలోనికథ ఉన్మీలనము జరగని యాకారరేఖ మాత్రమే. ఆ కవి దాని యున్మీలనార్థము పరిశ్రమింపడు. అది యా గ్రంథమర్యాదయును కాదు. ఏ ధర్మ నిదర్శనార్థమో, ఏ రాజవంశ చరిత్రాంగముగనో చెప్పబడిన ఆయుపాఖ్యానమును పురాణకర్త, సర్వాంగసుందరముగా దిద్దవలెనని పాటుపడిన సాగదు. కాని, ఆయుపాఖ్యానమునే కైకొని ప్రత్యేకకావ్యనిబద్ధము చేయుకవి, ఆ యస్థిపంజరమును సర్వావయవసౌష్ఠవముగల మాంసలాకృతిగా అలంకరించి ప్రదర్శించును. నేపథ్యరచనాసిపుణుడైన ఆ శిల్పియే ప్రబంధ కర్త. ఆతనిచేతిలో, శుష్కమైన పురాణోపాఖ్యానము సజీవమును రసస్యందియు నగును. అతనివర్ణనాప్రజ్ఞకు ఫలితమే. కథకుగలుగు ఈరూపాంతరలబ్ధి. ప్రబంధములో కథాప్రవర్తనకు రంగమైన స్థలము, దానిపరిసరములు, కథాప్రవర్తకములైన పాత్రలు, వానియాకారచిత్తవృత్తులు, లోనగు సమస్తావయవములును యథాభావరసావస్థముగా వర్ణింపబడుట చేతనే యీసుందర రూపాంతర పరిణతి కలుగుచున్నది. ఈయర్థమున

ప్రబంధమనగా "వర్ణనాత్మకమైన మహాకావ్యము" అని చెప్పవచ్చును.

మనవాఙ్మయములో ఈకావ్యజాతి, యొక స్వతంత్ర శాఖగా 16 వ శతాబ్దినుండి ప్రసరించినది. దానికే ప్రబంధ యుగమని పేరు. ఈ తీర్పు ఆకాలముకవి యగుటచేతను, ప్రబంధాభిరుచి పెరిగినవాడగుటచేతను ఈభారతమున ఆయా ఘట్టములను ప్రబంధోచితములైన వర్ణనలచే అలంకరించి కాలప్రభావమునకు లోగినవాడాయెను. ఈతడేకాదు, ప్రబంధయుగమునపుట్టిన యేపురాణకర్తయైనను తనరచనను ప్రబంధలక్షణముద్రితముగానే యొనర్చును. కంకంటి పాపరాజు నుత్తర రామాయణము ఈ ధర్మమునకు ప్రబలదృష్టాంతము. ఏకవియైనను బుద్ధిపూర్వకముగా గాని, అప్రతర్కితముగా గాని కాలప్రభావమునకు వశుడగుచునే యుండును.

ఈ యాదిపర్వాంతర్గతములగు అనేకోపాఖ్యానములు సుందరప్రబంధవర్ణనలతో, అనతివిస్తృతములైన కావ్యములుగా చమత్కరింపబడినవి. ఈ పరిచరవను వృత్తాంతములోని శుక్తిమతీనదికి మానవనాయికాత్వ మారోపించి యీతడు చిత్రించిన చిత్రము వసుచరిత్రకారుని రూపకల్పనకు ప్రతిద్వంది‌గా నున్నది:—

"ఆరయ నొక్కయెడ జాతనిపురము
చేరువఁబారు విశేషసంపదల,
చూచు నొక్కొకమారు సుకుమారమీన

లోచన శుభగుణ లోలదృష్టులను;
పలుకు నొక్కొకమాఱు బక చక్రవాక
కలహంస మధుకర క్రౌంచనాదములఁ;
మెలఁగు నొక్కొకమాఱు మృదులమృణాల
వలన హస్తవిలాస వైభవం బొప్ప;
వెలయు నొక్కొకమాఱు వీచిసంక్షోభ
కలిత కైరవ ఫేన కమలహాసముల;
వనవారణములు ప్రవాహమధ్యమున
మునుఁగఁ గుంభకుచాద్రులును గానవైన
భయవతిగతిఁ బద్మపత్రాంబరమున
నయమతిఁ గప్పు నున్నతి నొక్కమాఱు;
సిగిడిన యిసుకతిన్నియ పిఱుందునకుఁ
దగు మొలనూలని తజ్ఞులెన్నంగ
దరి నోలి రాలిన తరుముకుళముల
నురుపంక్తి శోభిల్లు నొక్కొకమాఱు;
అరవిందములమీఁద నళిసమూహంబు
సరసవైఖరి వ్రాలి సందడించుటకు
రాజిత కల్హార రాజి హస్తముల
నోజతోఁ దొలఁగించు నొక్కొకమాఱు".

యయాతి చరిత్రలోని దేవయాని వసంతవనవిహారము ప్రబంధకర్తలందరును బ్రోదిచేసి పెంచిన యుద్యానవనములలోని విహారమే:—

"అంత నాభార్గవి యట నొక్కనాఁడు
కాంత శర్మిష్ఠాదికాంతలు గొలువ
వనకేళి చేయుచో వలనొప్పునపుడు
వనమున నొప్పెయ్యె వాసంతలక్ష్మి.
మాకంద మందార మధుక మాలూరి
శాఖోట పాటల చంప కాశోక
సల్లకీ బిల్వాది సకలభూజములు
మొల్లంబుగాఁ బూచె ముద మొంద నళులు.
విరహులపై దండు వెడలంగ మదనుఁ
డిరవుకో మునుఁబంచు నెలగోలనంగ
మింపతుమ్మెదపిండు మించుఁబూఁదేనె
కండగ్రొవ్వునఁగ్రోలి కలగుండువెట్టె.
"మానినీమణులార, మానంబు మాని
మానుగాఁ గవియుఁడు మగల" నన్నట్లు
మావిలేఁజివురెల్ల మత్తిల్ల మెసవి
కోవిలకదుపులు గొణఁగంగఁ దొడఁగె.
ఫలరసధారలు బాగుగాఁ గ్రోలి
చిలుక మూఁకలు గూడి చెరలుగొట్టుచును
పంచబాణుని తేరి వార్యాలమనుచు
మించి పాంథులమీఁద మొగమెత్తఁజేసె.
విరహుల విరహాగ్ని విదితంబుసేయ
మరుఁడుపుత్తెంచిన మందిది యనఁగ

మలయాద్రి చలిగాలి మధుర సౌరభము
వలనొప్పఁ బొలసి నవ్వనవీధులందు.
అప్పుడు భార్గవి యతిసంభ్రమమున
నుప్పొంగి చెలులతో నుద్యానవీధి
విహరించి..............................

దుష్యంతుని మనస్సు చూరగొన్న శకుంతలా మనోహర రూపము పినవీరన సృష్టికి ప్రతిబింబము :-

" ......కణ్వుని పర్ణశాలకే తెంచి............
నెమలిబర్హముకంటె నెఱిఁగల్గిగలిగి
యమరినకొప్పున నమరినదానిఁ,
బదియారుగాఁ జంద్రు భంగమొందించు
వదనపద్మమున వలనొప్పుదాని,
దొండపంటికి సిగ్గు దొడరంగఁజేయు
దండి కెంపులమోవిఁ దనరెడుదానిఁ,
బలుకుకో వెలలకుఁ జెలగువీణెలకుఁ
బలుకులఁ దలవంపుఁ బాటించుదాని,
మరుఁడు జయముంబంది మహిమఁబూరించు
కరశంఖగతినొప్పు కంఠంబుదానిఁ,
గవజక్కవలఁ గవకవ నవ్వఁజాలు
సవరని చనుదోయిఁ జానొప్పుదాని,
నిగురించులతలతో నెకసక్కె మాడు
జిగిబిగిగల మేని చెలువంబుదానిఁ,

గన్నియు లావణ్య గౌరవంబునను
వెన్నునవిహరించు విపులంపువేణి
యుదరంబుపైఁదోఁచెనో యనఁజాలు
నొడవిన రోమాళి నొప్పారుదానిఁ,
బటుపైన చనుదోయిభారంబువలన
నరిఁ జేనమధ్యంబుజడియు, నానాభిఁ
బసిఁడిశలాకచే బంధించిరనఁగఁ
బసఁ మూఁడువళులను భాసిల్లుదాని,
మరునిజైత్రిరథంబు మార్కొనఁజాలు
వరజఘనంబున వాసైనదాని,
ననఁటికంబంబుల నదలించుతొడల
నొనరినపిక్కల నొఱపైనదాని,
రాయంచగములతో నంతుగావించు
పాత్రియుంపునడపులఁ బరఁగినదానిఁ
గుటిలకుంతలను శకుంతల నతఁడు
వెఱఁమాఱు చూచుచు ....................
చెలువుల నాబ్రహ్మ సృజియించుచోట
నలరు ఘుణాక్షరన్యాయాన దీని
సృజియింపఁబోలు నీక్షితి; నట్లుగాక
యజునకు నీనేర్పు నందమానేని
యింక నొక్కతెఁ గాంత నీయింతిసవతుఁ
గొంకక మఱి యేలకూర్పంగ లేఁడు!

శృంగారరసమెల్లఁ జెన్నారఁగూర్చి
యంగజు డిచ్చోట యంత్రించెఁగాక
వితత వేదాభ్యాసవికలుఁడై నట్టి
చతురాననున కిట్టి చాతురత గలదె?"

ఈతడుచేసిన సర్వప్రబంధ సామాన్యములగు నానావిధ వర్ణనలకు ఎన్నని యుదాహరణము లీయవచ్చునుగాని, యివి చాలును.

ఇంకొకమాట, మదుసునారికేళ పాకమునబడిన కొన్ని ప్రబంధములలోని వర్ణనలవలె గహనములు గాక, యీ కవి వర్ణనలు సహజసుకుమారమైన తన ద్విపద సరస్వతికి అనురూపమైన సౌకుమార్యముకలిగి యుండును. ఇది మిక్కిలి ప్రశంసింపదగిన విషయము.

సాధారణముగా కవులెల్లను పూర్వకాలికములగు గ్రంథములను బట్టియే కాక, తమనాటి లోకవ్యవహారము ననుసరించియు తమ కలవడినభాషనే గ్రంథములలో వాడుదురనుట సారస్వతమర్యాద. ఆగ్రంథములందలి ప్రయోగ విశేషములను పరిశీలించి, వానికొక యనుగతి కల్పించుకొని, తమకు సమ్మతమగురీతిని వాని సాధుత్వాసాధుత్వములను నిరూపించుట లాక్షణికులపని. మన తెనుగు లాక్షణికులత్రోవలు పరిశీలింప భిన్నభిన్నములుగా కానవచ్చును. వీరిలో నొక్కరును ప్రాచీన గ్రంథములను సాకల్యముగ పరిశీలించి లక్షణములను కల్పించినవారు కారు. అది యేయొక్కనికిని సాధ్యమైన

పనియును కాదు. అదిగాక, దేశములో వివిధప్రాంతములందు భిన్నభిన్నగతులతో తాండవించుచు, నానావిధములగు పరిణామముల నొందుచున్న దేశభాషలకు లక్షణమిదియని నూటికి నేర్పరచుట మిక్కిలియసాధ్యము. కావుననే యొక కాలమున ఒకరు చెప్పిన లక్షణము, వేరొక కాలమున అపలక్షణ మగుటయు సంభవించుచుండును. దీనినిబట్టియే తెలుగు లక్షణ గ్రంథములు ఆంధ్రభాషాస్వరూపమును సాకల్యముగా నిరూపింప జాలవనియు, అసమగ్రములనియు మనమనుకొంట.

సర్వజ్ఞులును మహర్షులును అనిపించుకొన్న పాణిన్యాదులకే సంపూర్ణ భాషాస్వరూప నిరూపణము శక్యముకానపుడు, దేశభాషా లాక్షణికుల మాట చెప్పనేల?

తెలుగు వ్యాకరణములందు కానరాని ప్రయోగ విశేషములు మనగ్రంథములందు తండోపతండములుగా కలవు. అట్టివానినిసైతము గ్రహించుట భాషాలక్షణ జిజ్ఞాసువులకు ఆవశ్యకము.

ఈ ద్విపద భారతమున జిజ్ఞాసా చోదకములగు అట్టిప్రయోగవిశేషములు చాలగలవు.

వ్యాకరణముల యడుగుజాడలనుమాత్రమే యాశ్రయింపక, కొంతవరకు పదప్రయోగమునెడ స్వాతంత్ర్యము వహించిన యాంధ్రకవులెందరో ప్రాచీనులుగలరు; అందును సోమనాథుడు మొదలగు ద్విపదకవులు అతిస్వతంత్రులు. ఈ తిమ్మయయు ఆ జాతిలోనివాడే. ఈతనిరచనకు ప్రాచీన

ద్విపదవాఙ్మయమే చాలవరకు ఒరవడిద్దియైనది. వ్యాకరణ విషయములతోపాటు ఛందోవిషయములందు నియతిని ఈతడు, ఇతర ద్విపద కావ్యకర్తలవలెనే స్వచ్ఛందుడుగా అగపడును. చూడగా చూడగా, ఈ ద్విపదవాఙ్మయ కర్తల ధోరినయే స్వచ్ఛందమని తేలును.

దక్షిణతీర్థములను సేవింపబోవునాంధ్రులు దర్శింపవలసిన ముఖ్యతీర్థము తంజావూరు సరస్వతీమహాలులోని పుస్తక భాండాగారము. ఆ యాలయమును నిర్మించిన ఆంధ్ర నాయక రాజులు, అందు ప్రతిష్ఠ చేసిన దేవి ఆంధ్రసరస్వతి. కాలక్రమమున ఆ దేవికి ఇరుపార్శ్వముల ఇతర భాషామూర్తులును నెలకొల్ప బడినవి. అయినను మూలపీఠమున దర్శనమిచ్చు దేవత ఆంధ్ర సరస్వతియే. ఆతీర్థసంసేవనము ఆంధ్రులెల్లరును, విశేషించి సాహిత్యోపాసకులును ముఖ్యముగా ఆచరింపదగినది.

చోళమండలమును 140 సంవత్సరములు అవిచ్ఛిన్న-ముగా పరిపాలించిన యాంధ్రనాయకరాజవంశములో మూడవ పురుషుడును అపరకృష్ణరాయలునునయిన రఘునాథరాయలే యీభాండాగారమును తొలుత నెలకొల్పినవాడని పెక్కుమంది యభిప్రాయము. ఆతని తాతతండ్రులైన చెవ్వప్పనాయకుడును అచ్యుతనాయకుడును ఆతనివంటి కవితారసికులును కవిపోషకులును గారు. లక్ష్మీపూజతోపాటు సరస్వతీపూజయు ప్రారంభించిన మహారాజు రఘునాథరాయలే. కావున భాండాగారనిర్మాత ఆతనియే కావచ్చు. రఘునాథరాయుని

పుత్రుడు విజయరాఘవుడు, రాజ్యపాలనాదులయందెట్లున్నను సంగీత సాహిత్యలోలత్వమున తండ్రివంటివాడే. అతనికాలమున ఆ భాండారము మరింతవృద్ధియైనది. 1673 వ సంవత్సరములో ఆ రాజుపరిపాలన యంతమైనది. 1675 లో మహారాష్ట్రులు ఆ కోటను స్వాధీనమొనర్చుకొనిరి. వారు అన్యరాష్ట్రీయులేయైనను పరజాతీయులుకారు కనుక, ఆ భాండాగారము నెడ పూర్వరాజుల భక్తిగౌరవములనే చూపి, యథాశక్తి పోషించుటకును పెంపొందించుటకును పాటుపడిరి. వారిలో రెండవ మహారాష్ట్ర ప్రభువైన శాహజీయు, నాల్గవవాడైన తుకోజీయు, తరువాత ప్రతాపసింహుడును, ఆపై రెండవశరభోజియు, భాండాగార పోషణకర్తలలో ముఖ్యులు. నాయికరాజులవలెనే వీరును స్వయముగా కొన్ని తెనుగు కావ్యములను వ్రాయుటయేకాక, తమ తమ యాస్థానకవులచే పెక్కు వ్రాయించి సత్కరించిన సాహితీరజ్ఞులు. మరియు, వారియదుగుజాడలనే, నడచి నానాదిశలనుండి నానాభాషలలోని ప్రశస్తగ్రంథములకు ప్రతులు వ్రాయించి తెప్పించి గ్రంథాలయమును విస్తరింపజేసిన యుదారశీలురు. ఆ సంప్రదాయములో శాహజీచే వ్రాయింపబడినదే యిచ్చట ఆంధ్ర విశ్వవిద్యాలయమునకు లభించిన యీ ద్విపదభారతప్రతి.

ఆంధ్రసహృదయులు నేను మనవిచేయు ఒక్కసంగతిని చిత్తగింతురు గాక. ఈ భారతమును కవిత్రయభారతముతో పోల్చిచూచి, యిందు "అవిలేవివిలేవ"ని యూగడింపకుందురు

గాక. దాని స్వరూపము వేఱు-దీనిస్వరూపము వేరు; దాని ప్రయోజన మొకటి-దీని ప్రయోజనమింకొకటి; అది పుట్టినది ఒకజాతి పాఠకలోకము నకు - ఇదిపుట్టినది యింకొకజాతివారికి. కావున, ఒకజాతి వాఙ్మయము నకు చెందిన యీ గ్రంథమును, వేరొకజాతికి జెందిన కవిత్రయభారతముతో పోల్పయత్నింపక, దీని గుణముల బట్టియే దీని నాదరింపవలెను. అట్టి సరసులకు, ఇది మెచ్చు గొల్పునేగాని నిరసన భాజనముగాదు.

భారత భాగవతాదులను పాటలుగా ఆటలుగా పదములుగా శతకములుగా వెలయించి, ఆ పురాణముల పరమార్థమును, సంఘమున ఎవరికిదగినట్లు వారికి పంచిపెట్టిన నిష్కామయోగులనదగు కవిసత్తములు, ఈతిమ్మయవంటివారు పెక్కురు కలరు. వారి రచనలన్నియు పామరములనియు అప్రౌఢములనియు దోషభూయిష్ఠములనియు, ఇప్పుడు వారి సంస్మరణముసైతము మరిచిపోయితిమి కావుననే, మన వాఙ్మయశరీరమున ఒక పార్శ్వము పక్షవాత పీడితమై చచ్చుపడినది. దానిని పునరుజ్జీవింపజేయుట మనకు మానరాని కర్తవ్యము.

ఈభారత మొకప్పుడు పేరుపడిన గ్రంథమేయనియు, దీని ప్రతులు ఆంధ్రదేశమెల్లెడల ప్రాకినవనియు చెప్పుటకు సందియము లేదు. కానిచో విరాటపర్వము ప్రతి యొకటి తంజావూరిలో, ఇంకొకటి నైజాము రాష్ట్రములో ఎట్లు లభింపగలవు? కావ్యజీవమునకు వ్యాప్తియేకదా పరమప్రమాణము? ఇది

యాంధ్రదేశ మెల్లెడలను సంచరించుచు సజీవమైయున్నది. కవిత్రయభారతమునందు ఈద్విపద,తలయెత్తుకొనినిల్చియుండుటలోగల విశేషమేమో సహృదయులే యూహింతురుగాక.

ప్రాచీన తాళపత్ర గ్రంథములను సంస్కరించి ముద్రింపబూనుకొనువారికి కావలసిన సదుపాయములలో మొదటిది ప్రత్యంతరలబ్ధి. వివిధప్రతుల సాహాయ్యమున్నచో వానియందలి పాఠాంతరముల పరిశీలించి, "ఏది సాధువు–ఏది యసాధువు, ఏది కవిది–ఏది కాదు" అను విషయములను నిర్ణయించుకొని, గ్రంథమునంతను కవి హృదయానుసారముగా ఒకసూత్రమునకు తెచ్చుటకు వీలగును. ఆ సాయము లేని నాడు సంపాదకుడు పడుక్లేశము అతనికే యెరుక. ఈ ద్విపదభారత సంస్కరణమున నాకు నట్టిశ్రమయే కలిగినది.

ఒక్క తంజావూరిలోతక్క, ఈ యాదిసభాపర్వములకు వేరొకప్రతి యెచ్చటను దొరకలేదు. దానికితోడు, ఉన్న యొక్క ప్రతియు వివిధలేఖన ప్రమాదములతో నిండియున్నది. అందుచే అనేకపదముల స్వరూపము, వాక్యముల యన్వయము తారుమారైయున్నవి. వానిని సాధ్యమైనంతవరకు సురూపములుగను అన్వితములుగను చేసితిని. ఒక్కొకచోట లేఖనప్రమాదము అగమ్యగోచరమైనపుడు ఛేదింపరాని గ్రంథులవలె కొన్నిపదములు, వాక్యములు మిగిలినవి. అట్టి వానిని సవరించుట నేను సొంతకవిత్వము చెప్పుట. కవియెడ అట్టియపచారము చేయలేక, పాఠకలోకమో యేనాటికేని ప్రత్యంతరమో నిర్ణయింపవచ్చునని వానినట్లే విడిచితిని.

ఇవిగాక, లక్షణగ్రంథానుసారముగా నే సవరింపఁజూచినచో సంస్కరింపదగిన పదప్రయోగము లెన్నియో కలవు. అవన్నియు అపశబ్దములుగానే పండితులు భావింపవచ్చును. కాని, ఈ ద్విపద కవులభాష సర్వథా లక్షణగ్రంథ విధేయము కాకుండుటచేత, కవిసమ్మతములైన ఆ రూపారూపములను పొడవఁగింప సాహసింపక యథాతథముగా విడిచితిని.

ఒక్కొకచో మూలపదమునకు ఏదో యొక యర్థమున్నను, ప్రకరణమునుబట్టి యది కవిప్రయుక్తమై యుండదని తోఁచియు, స్వారస్యమపేక్షించియు దానిని సవరించి, మూలపదమును పాదతలసూచనలలో (Foot notes) చూపితిని. నాసవరణకంటె మూలపదమే బాగనుకొనువారు దానినే గ్రహింపవచ్చును.

కొందరకు, అక్కడక్కడ నేనుచూపని సవరణ లావశ్యకములైనట్లు తోఁచవచ్చును. అది సహజమే. అచ్చు పూర్తియైన తరువాత మరల చూచుటలో నాయూహకే కొన్ని తట్టినవి. చూచిన కొలది అట్లే తోఁచుచుండును కాఁబోలు? మరి ఒకటి రెండు ప్రతులు లభించువఱకు, ఈవికల్పములు పొడముచునే యుండును. లభించునుగాక!

# రంగనాథ రామాయణము.

## పీఠిక

ఈరామాయణము రచించిన కవి గోనబుద్ధారెడ్డి. తనతండ్రి విఠ్ఠలధరణీశుని పేర దీనిని వెలయించి రంగనాథ రామాయణమని పేరిడెను. ఈయంశము గ్రంథావతారికలో శిలాశాసనమువలె ఉదాహరింపబడియున్నను, ఈగ్రంథకర్తృత్వము వివాదగ్రస్తమగుట శోచనీయము. గ్రంథకాలకర్తృత్వాది నిర్ణయమునకు అక్కరకువచ్చు సాధనములలో గ్రంథస్థనిదర్శనము పరమసాధనము. గ్రంథాంతరనిదర్శనములు దానియభావమున అనుమానప్రమాణములుగా పర్యాలోచింపదగినవే కాని, దానివలె స్వతఃప్రమాణములుగా గ్రహింపదగినవికావు. ఈధర్మము నుజ్జగించి కొందరు ఈరామాయణరచనాఖ్యాతిని రంగనాథుడను నొక కవికి దక్కింపజూచుచున్నారు. వాల్మీకి రామాయణమును వాల్మీకియు, భాస్కరరామాయణమును భాస్కరుడునువలె, ఈరామాయణమును రంగనాథుడు రచించుటచేతనే రంగనాథరామాయణమనుపేరు వచ్చినదని వారి వాదము. ఆరంగనాథుడు గోనబుద్ధారెడ్డికి కవియశమును సమకూర్పదలచి, యవతారికలో ఆతనిపేరు పెట్టినను, సత్యము దాగదు గనుక రంగనాథునిపేరనే ఈగ్రంథము జగత్ప్రసిద్ధమైనదని వారొక చిత్రమైన యుక్తి చెప్పుదురు. అట్లే కానిచో బుద్ధరామాయణమని గాని విఠ్ఠలరామాయణమనియో పేరుండవలెనుగాని, రంగనాథ

రామాయణమను పేరెట్లు పొసగునని యెవరు సవాలు వేయుదురు. "ఎవరయ్యా? ఈరంగనాథుడు" అనిప్రశ్నింతు మేని యాతనిని పేర్కొన్న కొన్ని యైతిహ్యములను లక్షణగ్రంథ-ములను చూపి, యీరంగనాథుడే యీరామాయణకర్తయని బోధించుటకును వెరాకాలికిని యుడి పెట్టుదురు. రంగనాథుడను నొక కవి ఆంధ్రకవిలోకమున నుండవచ్చును. ఆతడేయీ రామాయణ కర్తయనుట యెట్లు? ఏలాక్షణికుడేని యీ రామాయణము రంగనాథునిదేయని యుదాహరించి యుండవచ్చును. ఆలాక్షణికు డెప్పటివాడు? ఆతనికిగల చారిత్రక జ్ఞాన మెంతటిది? అసలు, లాక్షణికులు లక్ష్యసంగ్రాహక రాయుణులే కాని చరిత్ర పరిశోధకులు కారు. వారి కా పరిశోధనతో ప్రసక్తి లేదు. బహుగ్రంథపరిశీలకుడని పేరువడసిన అప్పకవికే యాలోపము గలదు. ఇంతియును, ఈతో లుబ్రాటంతియు గ్రంథనామమునకు ఉపపత్తి కుదుర్పుటకే కదా? అగుచో ప్రత్యక్షముగా గోచరించు నాధారముల పురస్కరించుకొని యీపేరు సమర్థింప జూడపలెనుగాని, వానిని త్రోసిపుచ్చి సత్యమునకు దూరము తొలగిపోనేల? ఈగ్రంథము బుద్ధరాజవిభుడు రచించెను; తన తండ్రి విట్ఠలుని పేరప్రఖ్యాతముచేసెను. గ్రంథమున గోచరించు నాధారము లివి. తండ్రి పేర ప్రఖ్యాతముసేయుట అనగా ఆతనిపేర రామాయణమును పిలుచుట. ఈయర్థమే యాతండ్రికొడుకుల యిరువురి మనస్సులందునుకలదని యీక్రిందిపంక్తులు ఘోషించుచున్నవి.

"భూమిఁ గవీంద్రులు బుధులును మెచ్చ
రామాయణంబు పురాణమార్గమునఁ
దివ్వక నాపేరఁ దగ సంగ్రహముగఁ
జెప్పి ప్రఖ్యాతంబు సేయుంపు మిప్పు"
..............................
"పనిపూని యరిగండ భైరవుపేర
ఘనుపేర మీసరగండవుపేర
లలితనిర్మలగుణాలంకారు పేర
నలఘు నిశ్చలద మాయతబుద్ధి పేర
నాతతకృతిపేర నతిపుణ్యుపేర
మాతండ్రి విట్ఠలక్ష్మాపాలు పేర
..............................
................శ్రీరాము చరిత
మొప్పఁ జెప్పెద."

ఈ యర్థమును దీనికి విట్ఠలరామాయణమనియో విట్ఠలనాథరామాయణమనియో పేరుండదగును. అటుల లేదు. రంగనాథరామాయణమనియున్నది. ఇటులున్నను విట్ఠలు పేరనే వెలయించుటయే యగునేమో మనము ఆలోచింపవలయును. అగుననియే యొక యూహచే నాకు తోచుచున్నది. విట్ఠలుని పూర్తి పేరు "పాండురంగవిట్ఠలనాథు"డై యుండవచ్చును (విట్ఠలుడనునది-పండరిపురములో వెలసిన పాండురంగ విట్ఠలనాథుని పేరుగనుక). దీనిలో ఉచ్చారణ సౌలభ్యముగల

'రంగనాథ' యను ఏకదేశమును రామాయణ శబ్దమునకు లగించి కవి, "రంగనాథరామాయణము" అని కర్ణపేయమైన పేరు పెట్టియుండవచ్చును. "నామైకదేశే నామగ్రహణం" శాస్త్రసమ్మతమే కదా! అథవా, అతని పేరు ప్రఖ్యాతము సేయుట యనగా కృతియిచ్చుట యగునేని, తండ్రికి కృతి యిచ్చిన యీ కావ్యమును, ధర్మపురి, లేపాక్షి రామాయణములవలె ఏక్షేత్రదేవతాపరముగనో కవి పిలిచియుండవచ్చును. ఈ రెంటిలో మొదటిపక్షమే నాకు బలవత్తరముగా తోచుచున్నది. *

---

* 1942 సంవత్సరములో, ఆంధ్రవిశ్వవిద్యాలయ ప్రచురణముగా నాపీఠికతో, ఈరామాయణము ప్రకటింపబడిన తరువాత, శ్రీ కూత రామప్పల్లి అనంతకృష్ణశర్మగారు, ఈపీఠికను విమర్శించుచు, 1943 సం॥ మెయినెల భారతిలో ఒకవ్యాసము వ్రాసిరి. అందులో, నేను చేసిన యీనామసమన్వయ సిద్ధాంతము, శ్రీ వావిలాల వేంకటేశ్వరశాస్త్రిగారి సిద్ధాంతమునకు అనువాదమని ముకనిందమోపిరి. అనగా, ఈయూహ నాసొంతము కాదనియు, శ్రీ వేంకటేశ్వరశాస్త్రిగారి యూహకు అనుకరణమనియు వారి, యభిప్రాయము.

ఇది సత్యదూరము.

శ్రీ వేంకటేశ్వరశాస్త్రిగారి 'కోనబుద్ధరాజు-రంగనాథరామాయణము' అనువ్యాసము, 1940 సం॥ ఆగస్టునెల భారతిలో ప్రచురింపబడినది.

నేను అంతకు అయిదేండ్లముందే (1935 సం॥ మార్చి) "Andhra University Telugu Association Bulletin" అనెడి పత్రికలో ఈ నాయూహను వ్యాసరూపమున ప్రకటించితిని.

శ్రీ అనంతకృష్ణశర్మగారు, నా వ్యాసమును చూచియుండరు.

మొదలు, రంగనాథరామాయణమన్న పేరు తొల్లింటి నుండియుగలదా? మధ్యకాలమున వచ్చినదా? నడుమ వచ్చినదని చెప్పసాహసించువారెవరును ఉండరు. ఉన్నచో, తొలినాటి పేరేమైయుండునని యడిగినపుడు చెప్పలేరుసరిగదా, యూహింపనైనను ఊహింపలేరు. అదిగాక, యెంతప్రయత్నించి పరిచారముచేసినను నడుమువచ్చినపేరులు తొల్లింటివానిని తుడిచివేయలేవు. కావున, ఈగ్రంథమునకు మొదటినుండియు రంగనాథరామాయణమనియే పేరు.

రంగనాథుడు రచించుటచేతనే రంగనాథరామాయణ మయ్యెనేని యాతనియెడలను తనకు అపాదించుకొన్న బుద్ధారెడ్డి, తనదుష్కార్యమును యుగాంతరములు దనుక మాదరించుచుండెడి యీ పేరునకు ఎట్లంగీకరించియుండును? మఱి తనకీర్తి అతనికి ధారపోసిన రంగనాథుడు, ఆత్మవంచనకును మిత్రవంచనకును పాల్పడి తనపేరనే గ్రంథమెటుల వెలయించియుండును.

మఱియు, అతడు తనకీర్తిని బుద్ధారెడ్డికి ధారపోయనేల! అప్పటికిని నింకను రాజ్యమేలుచున్న విట్ఠలునకే అర్పించియుండదగునుగదా? ఆ రాజు, ఆకవియశము తానే ఆశింపక, కొడుకునకు దక్కింపనేల?

అదిగాక "ఆతతకృతిపేర నతిపుణ్యుపేర, మాతండ్రి విట్ఠలక్ష్మాపాలుపేర" అనెడి పంక్తిని విట్ఠలుని పుత్రుడుతప్ప మరెవ్వడు వ్రాయగలడు?

ఇంకొకసంగతి; ఈబుద్ధారెడ్డి కొడుకులు, కాచవిభుడు, విఠ్ఠలుడు, అనువారు, ఈరామాయణ పరిశిష్టభాగమగు ఉత్తరకాండను రచించి, దానికి రంగనాథ రామాయణమనియే పేరిడిరి. రంగనాథుపట్టియే రంగనాథరామాయణ మయ్యేనేని యీరంగనాథుడే యాతరమువరకును బ్రతికియుండి, వారికిని తన కవితాతపస్సును ధారవోసెననుట హాస్యాస్పదము కాదా?

కావున రంగనాథరామాయణము రంగనాథకృతము కాదు. రాజకర్తృకములైన గ్రంథములలో, ఆయుక్తమూల్యదకు దీనికిని మాత్రమే యిట్టి దుష్కీర్తి యాపాదింపబడినది. నన్నచోడుడు, రఘునాథుడు, అనంతభూపాలుడు, మొదలగు రాజకవుల నెవరిని శంకింపని విమర్శకులు; బుద్ధారెడ్డి కృష్ణదేవరాయలను మాత్రమే శంకించి, వారి యశము నితరుల పరము చేయజూచుట వింతలలో వింత.

అవతారికలో కవివర్ణించుకొన్న యాతని వంశవృక్షము ఈక్రిందిరీతిగా నున్నది :—

గోన కాటభూపతి
⋮
రుద్రభూపతి
⋮
బుద్ధభూపతి
⋮
విఠ్ఠలుడు
⋮
బుద్ధభూపతి (రామాయణకర్త)

వీరు, భూవిభుండనియు భూపాలుండనియు వ్యవహరించు కొనుట రాచరికమునుబట్టి; పుట్టుకచే రెడ్డికులజులు. వీరు వేయించిన శాసనములలో ఈవిషయము స్పష్టముగానున్నది. కాకతీయాంధ్రచక్రవర్తులకు వీరు సామంతులై, యిప్పటి నిజాము రాష్ట్రములోని రాయచూరు ప్రాంతముల నేలుచుండిరి ఈవంశములో రామాయణకర్తయగు బుద్ధారెడ్డియెప్పటివాడో సరిగా నిర్ణయించుటకు తగిన ప్రమాణములు ఈగ్రంథమునగాని ఉత్తరకాండమునగాని లేవు. అమ్యోడశాసనములే శరణ్యము. ఈవంశ్యనామచిహ్నితములైన శాసనములు, క్రీ. శ. పదుమూడవ శతాబ్దిని, మూడు కానవచ్చుచున్నవి. వానిలో రెండింటికి బూదపూరు శాసనములని పేరు; మూడవది రాయచూరు శాసనము.

ఈబూదపూరు శాసనములలో మొదటి దానినిబట్టి, కాకతిగణపతిదేవచక్రవర్తి సైన్యాధిపతులలో మల్యాల గుండదండాధీశుడను నతడొకడు కలడనియు ఆతడు గోన బుద్ధభూపాలుని పుత్రికయగు కుప్పమాంబకు భర్త యనియు తెలియుచున్నది. ఈశాసనము క్రీ. శ. 1259 లో పుట్టినది. రెండవ బూదపూరు శాసనము క్రీ. శ. 1276 లో, ఆ కుప్పమాంబికయే వేయించినది. అప్పటికి ఆమెభర్త గుండ దండాధీశుడు పరలోకగతుడైనట్లును, కుప్పమాంబిక

* ఈ శాసనాధారములను చూపినవారు శ్రీమల్లంపల్లి సోమశేఖర శర్మగారు.

శివలింగప్రతిష్ఠచేసి భూదానాదులు కావించినట్లును దానిలో వివరింపబడియున్నది. దీనియందును కుప్పమతండ్రి గోన బుద్ధభూవిభుడుగానే పేర్కొనబడెను.

ఈకుప్పమ, రామాయణావతారికలోని వంశవృక్షమునగానవచ్చు బుద్ధభూపతుల యుక్తిలో రంగనాథ రామాయణకర్తయైన బుద్ధభూపతికేని, అతని తాతయైన బుద్ధభూపతికేని పుత్రిక కావచ్చును. రామాయణకర్తకే కొమార్తె యయ్యె నేని, ఈగ్రంథరచనాకాలము పదుమూడవశతాబ్దిపూర్వార్థమై యుండును. ఎట్లనగా—క్రీ. శ. 1259 నాటికి అత్తింట కాపురముచేయుచు శాసనములో వర్ణింపబడదగిన వయస్సులోనున్న కూతురుగల బుద్ధారెడ్డికి, ఆనాటికి కనీసము నలుబదియైదు సంవత్సరముల ప్రాయమైనను ఉండవలయును. రామాయణరచనాటికి ఆతడింకను చిన్నవాడు. రాజ్యమేలుచున్న తండ్రియానతిని రామాయణరచన కువక్రమించిన యీకుమారుని వయస్సు, ముప్పది-ముప్పదియైదు సంవత్సరములై యుండవచ్చును. ఈయూహ నిజమగునేనియాతని క్రీ. శ. 1210 ప్రాంతమున జనించి క్రీ. శ. 1240 ప్రాంతమున గ్రంథరచన చేసియుండును.

అటుగాక, కుప్పమాంబ, రామాయణకర్త తాతకే కొమార్తెయనుకొన్న చో, తండ్రికి సమవయస్కురాలగు మేనత్తకంటె ఈతడు సుమారు ఇరువదియైదు సంవత్సరములు చిన్నవాడై యుండదగును. క్రీ. శ. 1259 నాటికి శాసనములో

ప్రస్తుతింపబడిన కుప్పమకు, ఇరువదినైదు సంవత్సరములైనను వయస్సుండవలయును. అప్పట్టున రామాయణకర్త క్రీ. శ. 1260 ప్రాంతమున జనించి, క్రీ. శ. 1290—95 ప్రాంతమున గ్రంథము రచించియుండవలయును.

ఈరెండింటిలో నాకు మొదటిపక్షమే సమంజసముగా తోచుచున్నది-కుప్పమ రామాయణకర్తకు కొమార్తెయని, రామాయణము క్రీ. శ. 1240 ప్రాంతమున రచింపబడినదని. ఏమన, ఈపూర్వరామాయణము ఆరుకాండలు తనకంటె మున్నె రచింపబడినవి కనుకనే ఉభయకవి మిత్రుడు తిక్కన తెనుగున రామాయణమును పూర్తిగాచేయు తలంపుతో ఉత్తర కాండను, ద్విపదగా గాకున్నను, నిర్వచనోత్తర రామాయణ మనుపేర పద్యకావ్యముగా రచించియుండును. లేనిచో రామాయణ రచనా కుతూహలముగల తిక్కన, యున్నట్లుండి పూర్వకాండలను వదలి యుత్తర కాండనే చేపట్టవలసిన యావశ్యకతలేదు. ఈనిర్వచనోత్తర రామాయణము క్రీ. శ. 1260 ప్రాంతమున రచింపబడినదని చరిత్రపరిశోధకులు నిర్ణయించిరి. దాని పూర్వరచనమైన రంగనాథరామాయణము పైనిచెప్పినట్లు క్రీ. శ. 1240 ప్రాంతమున పుట్టినదనుటలో విప్రతిపత్తి యేమియు నుండదని నాయభిప్రాయము.

అటుగాక, రెండవ పక్షమునుబట్టి యిది క్రీ. శ. 1290 ప్రాంతముల బుట్టెనేని, క్రీ. శ. 1320 ప్రాంతమున పుట్టిన భాస్కరరామాయణమునకు చాల సన్నిహితముగానుండును.

ఆపద్యరామాయణము ఈద్విపద రామాయణమునకు ఇంచు మించు ఛాయవలె నడచినట్లు చూపగలగుర్తు లనేకములు కలవు. అవన్నియు భాస్కరాదులకు బుద్ధారెడ్డియందు గల గౌరవమునకు సూచకములు. భాస్కరునివంటి ప్రౌఢకవిచే అట్టిగౌరవము పొందదగిన యీద్విపద, ఆనాటికి ప్రాచీన గ్రంథముగా ప్రసిద్ధికి వచ్చియుండవలయును గాని, యాతనికి ఇంచుమించు సమకాలికమగుట మాత్రము తటస్థింపదు, స్నేహితులకును సమకాలికులకును విద్యాస్పర్థలు మెండుగా నుండును గాని, యిట్టిగౌరవ ప్రపత్తులుండుట అరిది. అందును, సమానేతివృత్తములను రచించిన కవులలో, అది మరియు శూన్యము. పాల్కురికి సోమనాథుని ద్విపదకావ్యములు, అర్వాచీనకాలమున పద్యకావ్యము లైనట్లుగనే, యీరంగనాథ రామాయణము సైతము, ఇంచుమించు ఒకశతాబ్ది గడచిన పిమ్మటనే యనుకరణయోగ్యమయ్యెనని తలంచుట సత్యదూరము కాదు.

ఈయంశములన్నియు పర్యాలోచించి చూడగా, గోన బుద్ధారెడ్డి యీరామాయణమును పదుమూడవశతాబ్ది పూర్వ భాగముననే రచించినట్లు నిశ్చయింప వీలగుచున్నది.

ఈతని పుత్రులు రచించిన యుత్తరకాండలో వీరి వంశ క్రమమునుగూర్చి పొసగని వ్యాకమొకటికలదు. పూర్వ రామాయణమునుబట్టి బుద్ధారెడ్డి తండ్రిపేరు విట్ఠలుడు. ఈయుత్తరరామాయణమున ఆతని పేరు గన్నక్షితింద్రుడు;

అనగా, గన్నారెడ్డి. దీనిని సమర్థించుటకు ఊహ తప్ప మరియొక యాధారములేదు. సంపన్నులైన రెడ్డివంశ్యులలో సాధారణముగా ప్రతిపురుషునకును రెండేసి పేరులుండునట; ఒక పేరు గృహమునను, మరియొకటి లోకమునను వ్యవహరింపబడుచుండునట. విట్ఠలునకుగూడ గన్నారెడ్డియని రెండవపేరుఉండి యుండవచ్చును. లేదా, బుద్ధారెడ్డికి, విట్ఠలుడు-గన్నారెడ్డి-అను ఇద్దరిలో ఒకడు కన్నతండ్రియు మరియొకడు పెంపుడుతండ్రియు గావచ్చును. నిరపాయమైన యీస్వల్పవిషయమును విషగా గైకొని, యుత్తర రామాయణ కర్తలు పూర్వరామాయణ కర్తకు పుత్రులేనాయని శంకింపరాదు. పూర్వరామాయణము రచించిన తమతండ్రి బుద్ధభూవిభుని యాదేశానుసారమే, తాము ఉత్తరకాండను పూర్తిచేసితిమని యీ సోదరకవులు ఎలుగెత్తి యుగ్గడించిరి. దీనిని కాదనుట యెట్లు?

"గోన కులార్ణవసుధాకరుండు
నానొప్పుగోన గన్నక్షితీంద్రునకు
ననఘాత్మయగుచున్న నన్నమాంబికకుఁ
దనయుండు సాహిత్యతత్త్వకోవిదుఁడు
దాన ప్రసిద్ధుఁడు ధర్మశీలుండు
భానుతాచారుండు బుద్ధభూవిభుఁడు
తెలుఁగున నొప్పఁగా ద్విపదరూపమున
నలిపూర్వరామాయణమును చెప్పి
...............మమ్ముబిల్వఁబంచి

నాకులదీపకుల్ నాగుణాన్వితులు
నాకీర్తి వర్ధనుల్ నాకూర్మిసుతులు
గాన నాపూనినకథ యెల్లజనులు
మానుగాఁగొనియాడ మనోహరవాక్యముల
నెమ్మిఁ జెప్పెడు మీరు నిపుణులై యనుచు
మమ్ముఁ బంచిన మేము మాతండ్రిపంపిన

చిరకీర్తులెసఁగంగ జెల్లింపఁగనుట
పరమధర్మంబని భక్తితోఁ గోరి
రామావతారంబు రమణీయమగుట
రాముపావన చరిత్రము దివ్యభాష
లోకానురంజన శ్లోకబంధములఁ
జేకొని వాల్మీకిఁ జెప్పినజాడ
మాతండ్రి బుద్ధక్రమానాథుపేర
ఖ్యాతత నృపకైరవాప్తునిపేర
ఘనుఁడు మీసరగండకాచవిభుండు
వినుతశీలుఁడు పినవిఠలక్ష్మాపతియు
నని జనుల్ మముఁగొనియాడంగ మేము
వినుత నూతనపద ద్విపదరూపమ్మునఁ
బ్రకటంబుగ నాంధ్రభాషను జెప్పఁ
గైకొన్న యుత్తరకథ యొట్టిదనిన"

(ఉత్తర కాండావతారిక)

"భానుతుఁడగు గోన బుద్ధభూవిభుని
సూను లుదారులు సుగుణభూషణులు
ఘనుఁడు మీసరగండ కాచభూవిభుఁడు
వినుతపుణ్యుండగు విట్ఠభూపతియు
రచియించి రుత్తరరామాయణంబు
రుచిరమై నిత్యమై రూఢిపెంపెసఁగ
నాచక్రవాళ శైలావనియందు
నాచంద్రతారార్కమై యొప్పఁగాత."

(కాండాంతము.)

ఈ కాచవిట్ఠలవిభులు పూర్వరామాయణ కర్తయైన బుద్ధభూవిభుని పుత్రులనియు, ఉత్తరకాండ రచయితలనియు స్పష్టమేకదా. ఇక వీరిని గురించిన చరిత్రాంశము లింతకుమించి కానవచ్చుటలేదు. పైని పేర్కొన్న శాసనములలో మూడవది యైన రాయచూరు శాసనమున (క్రీ. శ. 1294) "గన్నారెడ్డి విట్ఠలనాథులు" అను నిరువురి పేరులు ఉదాహరింపబడియున్నవి. వారిలో గన్నారెడ్డికి "కాంతీయ కటకసన్నాహరుద్రదేవ దక్షిణభుజాదండ" ఆది బిరుదములు కలవు. విట్ఠలుడు ఆ గన్నారెడ్డికి "రాజ్యరక్షామణి."

"శ్రీమతుమీసియురగండ గోన గన్నయరెడ్డివారు వర్ధమానపురమందు సుఖసంకథావినోదంబున పృథివీరాజ్యంబు సేయుచుండగాను తద్రాజ్యరక్షామణియైన విట్ఠలనాథ భూనాథుండు రాచూరిపట్టణ ప్రవేశాభిముఖుండై"

(రాయచూరు శాసనభాగము)

ఈగన్నారెడ్డివిట్ఠలనాథులును, ఉత్తరకాండలో తాత మనుమలుగా గానవచ్చు గన్నారెడ్డివిట్ఠలనాథులును నొకరే యనుటకు తగిన యుపపత్తులు లేవు. శాసనములోని విట్ఠలుడు, గన్నారెడ్డికి రాజ్యరక్షామణి. ఉత్తరకాండకర్త విట్ఠలుడు, గన్నారెడ్డికి మనుమడు. ఆ యిద్దువురే యీ యిరువురైనచో, అంతటి దగ్గర బంధుత్వము శాసనమున విస్మరింపబడుట పొసగదు. అదిగాక తాతగారికి, మనుమడు రాచరికమున రాజ్యరక్షామణి యనిపించుకొనదగినంతగా అండయై నిలిచెననుట సులువుగా నమ్మరానిది. ఒకవేళ అట్టి మనుమలు ఉందురనుకొన్నను, కొడుకులను గోల్పోయిన తాతలకు వార్ధకమున కుడిభుజములైయుండి యౌవరాజ్య సూచకమైన బిరుదమేదో వహింతురుగాని, యుద్యోగసూచకమైన "రాజ్య రక్షామణి" బిరుదము తాల్పరు. అందుచేత వీరిరువురకును దూరబంధుత్వమేమైన నుండవచ్చును గాని తాతమనుమలవరుస మాత్రము లేదు. ఒకవేళ ఈవిట్ఠలుడు ఆవిట్ఠలుడైనగావచ్చును గాని, యీగన్నారెడ్డి మాత్రము ఆగన్నారెడ్డికాడు.

తెనుగునగల రామాయణములన్నింటిలో రంగనాథ రామాయణము మొదటిది. పుట్టువుచేతనే కాక గుణముచేతను అగ్రగణ్యమే. భాస్కరరామాయణము కొంతకుగొంత దీని నతిక్రమింపజూచినను దీనివ్యాప్తి దానికి రాలేదు. దేశికవిత్వ మును మెచ్చని మార్గాభిమానులు ఈద్విపదకావ్యమును తోసివుచ్చి, యాపద్యకావ్యమునేయాదరించినను, దీనిప్రశస్తిని

దానికి కొన్ని తేజాలక పోయిరి. భాస్కరరామాయణము బహుకర్తృకమగుటచేతను అందును మల్లికార్జునభట్టాదులు భాస్కరునివంటి ప్రౌఢకవులు గాకపోవుటచేతను, ఆ రచన సర్వత్ర సమముగా లేక, కొన్నిపట్టుల బాగుగా, కొన్నిపట్టుల ఓటుగా, అతుకులమారి కూర్పుగా పరిణమించినది. ఇక రంగనాథరామాయణమో, ఆద్యంతము ఒకచేతి మీదనే ధారావాహినిగా నడచిన రచనయగుటచేత నెట్టిలోటులేక ప్రతిప్రకరణగుణాస్పదమై నెగడినది. మరియు, వాల్మీకి రామాయణమువలె నిదియు "పాఠ్యే గేయే చ మధుర" మై, పాటగా పాడుకొనువారికిని, కావ్యముగ చదువుకొనువారికిని సమాదరపాత్రమై, పండితులకే గాక పామరులకు వినియోగపడి, సార్వజనీనమైన పేరును గడించినది. ఈరామాయణములోని కొన్నిప్రకరణములను పాటలుగా పాడుకొను నారీమణులు ఇప్పటికిని గలరు. రామాయణ కథా ప్రదర్శనములవేళ తోలుబొమ్మలవారు గానముచేయు గ్రంథమిదియే.

అసలు, దేశికవిత్వము ప్రాయికముగా గేయకవిత్వము. ద్విపదకావ్యములు గేయభావమును సంరక్షించునవి యగుటచేత సామాన్యప్రజాలోకమున వీనివ్యాప్తి పద్యకావ్యములకు లేదు. ఈరహస్యము గుర్తెరింగియే కాబోలు సోమనాథాది శివకవులు తమ మత ప్రచారమును ద్విపద కావ్యములద్వారా సాగించిరి. వానివ్యాప్తిని అరికట్టుట ఇతరులకు దుష్కరమయ్యెను. ఈద్విపదరామాయణ వ్యాప్తియు

అట్లే యప్రతిహతముగా నేటికిని ఆంధ్రలోకమున సాగుచున్నది. అందును, పశ్చిమాంధ్రులు సారస్వతమహోత్సవములలో బుద్ధారెడ్డికే యగ్రతాంబూల మిచ్చెదరు. ఆ సీమలో రంగనాథ రామాయణము చదువని అక్షరాస్యుడు లేడు. ఒరులు చదువగా నైనను వినని నిరక్షరాస్యుడును లేడు. వారికి అది పూర్వార్జితమైన యక్షయ ధనము.

పశ్చిమాంధ్రులకును ప్రాగ్దేశాంధ్రులకును సారస్వత సృష్టిలోను సారస్వతసేవలోను, కొంత భేదమున్నది. మన వాఙ్మయమునగల "మార్గ-దేశి" శాఖలలో, పూర్వకాలమున మార్గశాఖ ప్రాక్సీమలోను, దేశిశాఖ పశ్చిమసీమలోను ఎక్కువ వృద్ధినొందెనని బాహుళ్యమునుబట్టి చెప్పవచ్చును. ఇటులనుటచే, పడమట మార్గకవిత్వముపుట్ట లేదని కాని, తూర్పున దేశిరచనలు లేవనికాని యర్థము కాదు. మరి యీవిభాగము ప్రాధాన్యమునుబట్టి చేసినది. ఈ భేదమునకు నైసర్గికమైన యొక కారణము పొడకట్టుచున్నది. ప్రాక్సీమ, పర్వతారణ్య రహితమును ఫలవంతమును నైన భూభాగమగుటచే, ఔత్త-రాహుల ప్రవేశమునకును వారి విద్యా సభ్యతల వ్యాప్తికిని ఎక్కువ యవకాశ మిచ్చినది. ఈప్రాంతముల సంస్కృతవిద్య ఎక్కుగా వ్యాపించుటయు, సంస్కృత సారస్వతానుకరణముగా సారస్వతసృష్టి జరుగుటయు దానిఫలమే. ఎన్నటి మాటలో యెందుకు; వర్తమానకాలమునగూడ వంగసాహిత్యాను కరణము ఈ సర్కారులలోవలె పశ్చిమాంధ్రమున లేదు.

ఇక పశ్చిమాంధ్రులు వీరియంత యదృష్టవంతులుగారు. నిరంతరము ప్రకృతితో పోరుచు పాటుపడవలసిన కష్టజీవులు. ఆకష్టజీవనమే వారిని దృఢకాయులుగా, వీరులుగా స్వాతంత్ర్యతత్పరులుగా చేసినది. తాతలనాటి తల్లిభాషయే వారికిచాలును పరభాషల యావశ్యకతగాని, వానిని నేర్వవలెనను కుతూహలముగాని, నేర్వదగినయవకాశముగాని వారికుండదు. పరసంప్రదాయములకు మురిసి పొత్తుకొను మెత్తదనము వారి మనస్సులకును ఉండదు. తమ సంఘములో మహోదారమైన జీవితముగడపి తరలిపోయిన వీరుల చరిత్రలే వారి కావ్యములకు ఇతివృత్తములు, అవియే వీరపదములు. ఒకవేళ, ఇతర చరిత్రలు మహాత్మ్యమునుబట్టి సంఘములోనికి చొచ్చుకొని వచ్చినను, అవి దేశీయతాముద్రలతో రూపాంతరముపొంది యాత్మీయములగునేకాని యెరవుసొమ్ములవలె వింతగొల్పవు ఇది యాసీమలో ఉత్పన్నమైన ప్రాచీనసారస్వతమునకు సాధారణమైన ధర్మము. కాలప్రభావమునుబట్టియీధర్మము అర్వాచీనకాలమున కొంత సడలినను, ఆ జనుల సారస్వతాభిరుచి మాత్రము పూర్వసంప్రదాయముదెసకే మొగ్గుచూపుచుండును. దేశీయతా-మహితమైన యీయభిరుచిని తృప్తిపరచగల కవులే మహాకవులుగా, జాతీయ కావ్యకర్తలుగా పూజింపబడుదురు. గోనబుద్ధారెడ్డి యట్టి మహాకవి. ఇతడు సంస్కృత మహాకావ్యమును తెనిగించినను ఆంధ్రీకరణమును దేశీయ చిహ్నములతో విలక్షణతాశోభితమొనర్చి తన స్వాతంత్రతా తృష్ణను, తన

దేశీయుల సారస్వతాభిరుచులను తనిపెను. ఈకావ్యవిఖ్యాతికి ఇది యింకొక కారణము.

నిజమునకు శుద్ధదేశికవిత్వమున ఇతివృత్తము, భాష, ఛందస్సు—అనెడి మూడును దేశీయములేయై యుండవలెను. గీతి, దానికి ఆయువుపట్టు అట్టి లక్షణముగల వాఙ్మయమే మన పదకవిత్వము. దానికి కేవలభిన్నమైనది శుద్ధమార్గకవిత్వము, దీనియందు, ఇతివృత్తము సంస్కృతపురాణసంబంధి, భాషయు సంస్కృతమయము, ఛందముకూడ సంస్కృతవృత్తానుకరణము. కాలక్రమమున, ఈయనుకరణవాఙ్మయమే ప్రబలి, ప్రౌఢసాహిత్య మనిపించుకొని, స్వతంత్రమును సజీవమును అగు దేశికవితను వెనుకకు నెట్టినది. దానిని సృష్టించువారును సేవించువారును పామరులుగా తిరస్కరింపబడిరి. తుదకు అనుకరణశీలమైన వాఙ్మయమే పట్టము కట్టుకొనెను. దీనిదాడికి తాళలేక కోమల దేశికవిత నగరములు రాచబాటలు వదలి, పల్లెపట్టుల సందుగొందుల నడయాడదొడగెను. సహజసౌందర్యము గల యా ముగ్ధ సరస్వతికిని ఏదో కొంత ప్రౌఢవేషమువేసి నాగరమర్యాదులు నేర్పి, సభాప్రవేశార్హత కలిగింపవలెనని పాటుపడినవారే ద్విపదకావ్యకర్తలు. వీరు, ఒకవంక తమ దేశికవితాభిమానమును, ఇంకొకవంక విద్వత్కవి కీర్తకాంక్షను అణచుకొనలేక, యుభయతారకమైన మార్గము త్రొక్కి కొంతవరకు చరితార్థులైరి. ఇట్లనుటచే సంస్కృతమువలన మనభాషకు

సమకూడిన మేలు తలపనివాడనని కాని, కొంచెపరుచువాడనని కాని యెంచకుడు. తత్సాహాయ్యమువలననే, తెలుగుబాస యింతసంపన్నమును, తెలుగువాఙ్మయము ఇంతవిస్తృతమును అయినవి. కాని యీ సాంస్కృతికశాఖతో పాటు నానాటికి పెంపొంది యింతకంటెను ఎక్కువ విస్తృతికి రావగిన దేశిశాఖ యుపేక్షింపబడినదనియే నావిచారము. ఈదుర్దశకు కారణము ప్రజలో, రాజులో, కవులో, ఎవరు చెప్పగలరు?

సమాజముగా ప్రాచీనద్విపద కావ్యకర్తలచిత్తవృత్తి దేశి కవితాప్రవణము. కానియీ దారినేపోయినచో, దృఢస్థానకమును విద్వల్లోక ప్రతిష్ఠితమునునైన సారస్వతాలయమునకు వెలవారమగుదు మెమోయన్న భయముచే, తత్ప్రవేశార్హత నిచ్చు సంస్కారముల కొన్నింటిని స్వయముగా చేసికొనిరి. అనగా, పైని పేర్కొన్న దేశికవితాలక్షణములలో ఏ యొకటి రెండింటినో పాటించి, మిగిలినవానిలో మార్గశాఖాను యాయులేయై, యిటు ప్రజాసామాన్యమునకును, అటు-సాహిత్యపరులకు ఇష్టులై, వారి హృదయములలోను, వీరి కోశములలోను స్థానములను దక్కించుకొనిరి. వీరిది పదకవిత్వ మయ్యు పామరకవిత్వముకాదు; పండిత కవిత్వమయ్యు దేశికవిత్వము కాకపోదు. ఇదియే ద్విపద కావ్యకర్తలకుగల ప్రత్యేకత.

కాలమునుబట్టి యీ వర్గములో మొదటివాడు సోమనాథుడు. సోమన నతిశయించి ప్రథమ గౌరవము

డక్కగొన్నవాడు బుద్ధారెడ్డి, వీరిరువురును ఇంచుమించు సమకాలికులని చెప్పదగినవారు. సోమన ద్విపదకావ్యములు వ్యాకరణచ్ఛందోలక్షణాదులలో నిగ్రహములు కాకపోవుటచేత పండితకవులకును, శైవమత విషయకము లగుటచేత శైవేతరులైన బహుళాంధ్రజనమునకును, ఎక్కువ యాదర పాత్రము కానయ్యెను. ఇక బుద్ధారెడ్డి ద్విపదకావ్యము, లక్షణయుక్తమును సర్వపూజ్యమగు రామచరితమును అగుటచే వారు వీరనక యెల్లరకును శిరోధార్యమయ్యెను. అందువలన రామాయణములలో అగ్రగణ్యమగుటయే కాక ద్విపదవాఙ్మయశాఖలో సైతము రంగనాథరామాయణము అగ్రగణ్యమే.

మరి ఇంకొకసంగతి; సంస్కృతపురాణాంధ్రీకరణమునకు అంకురార్పణము చేసిన నన్నయభట్టు, భారతానువాదములో మూలకథావిధేయముగా నడచెనేకాని తానై స్వతంత్రించి యాకథలో ఎట్టిమార్పులును చేయలేదు. ఒకచో కథతగ్గించుట, ఒకచో పెంచుట, ఒకచో వదలుట, అను పద్ధతి దానియందును గలదుగాని, యది మూలభిన్నమని చెప్పదగిన స్వతంత్రకల్పన కాదు; రచనాసరణికి అనుకూలముగా వేసికొన్న యనువాద మార్గము. కేవలానువాదకుడు స్వతంత్రమూలభిన్న కల్పనలు చేయడు. స్వతంత్రానువాదకుడు అట్టికల్పనల చేయుటకు వెనుదీయడు. వీనిగ్రంథము, నామమాత్రమునకే అనువాదముగాని నిజమునకుగాదు. రంగనాథరామాయణము ఈమాదిరియను

వాదము. ఆంధ్రపురాణేతిహాసకర్తలలో ఇంతస్వేచ్ఛగా నూతన గాథాకల్పన చేసినకవి యింకొకడు లేడు.

ఈరామాయణమునకు విశిష్టతను ఆపాదించిన యంశమే మూలభిన్నగాథాకల్పన. ఆ గాథలు రామకథాప్రస్తావముకల పద్మపురాణాదులలోగాని, నవవిధ రామాయణములలో గాని యుండిన ఉండవచ్చును. ఉండకపోవచ్చును. యీ పురాణముల నన్నింటిని వెదకి గాలించి యేర్చి యిందు కూర్చుకొనెనని చెప్పుటకష్టము. ఆకథలన్నియు ఏమార్గమునవో, యేనాడో యాంధ్రప్రజల చెవులబడి, వారినోట పదములుగా పాటలుగా కీర్తనలుగా నలిగి, సంఘమున వేరునాటుకొనిపోయియుండును. నాటిపదకవిత్వఖనినుండియే ఈకవీశ్వరుడు ఆజాతిరత్నములనుదీసి సానలదీర్చి తన రామాయణ మహామాలలోకూర్చియుండును. ఈ కావ్యమునకు దేశీతనముగాపాదించిన ఇంకొకలక్షణమిదియే. అట్లుగాక దీక్షకొరకు యథావాల్మీకముగానే కవి దీనిని తెనిగించి యుండునేని, పరిచితవస్తురహితమైన యీరచన దేశీయులకు ఆశాభంగము కలిగించెడిది. కావ్యము నెడ వారు విముఖులును అయ్యెడివారు.

"ఆదికవీశ్వరుడైన వాల్మీకి
యాదరంబునఁ బుణ్యులందఱు మెచ్చఁ
జెప్పిన తెఱఁగున శ్రీరాముచరిత
యొప్పఁజెప్పెదఁ గథాభ్యుదయ మెట్లనిన."

అని కవి వ్రాసినచేసినను, తద్భిన్నముగా వ్రాసిన కాండము నందును ఏదోయొక అవాల్మీకాంశమును కల్పించుచునే కథ నడపెను. వానిలో పెక్కు, కావ్యమునకు గుణసంపాదకములును తద్విశిష్టతకు హేతుభూతములును నైనవి. వీనిలో కొన్నింటికి లోకమే యాధారమనుటకు నిదర్శనముగా, స్త్రీల పాటలను, పదములను, భజనకీర్తనలను పెక్కింటిని చూపవచ్చును. నేటి యీపాటలే కవికి, ఆనాడు ఆధారము లయ్యెనని నేనని జాలను గాని, యీపాటల యర్థముగల ప్రాచీనపదము లేవో తప్పక యై యుండునని మాత్రము చెప్పగలను. సంస్కృతపురాణములను పండితకవులు తెగింపకమున్నే, యందలి గాథలు విడివిడిగా పదకవిత్వరూపమున తెనుగుదేశమున వ్యాపించెనని చెప్పుట సారస్వతధర్మ విరుద్ధముగాదు.

కీర్తన :-

చరణము. "రాతినాతిగఁ జేసె నీపదరజమటంచును ఖ్యాతిగావిని ప్రీతితో నెంచుకొంటిని నాపాతకము లెడబాపుతండ్రి!"

పల్లవి:-సీతామనోహరా! రారా! సేవకుఁడ ననుబ్రోవవేరా!"

అహల్య రాతిగ పడియున్నదనెడి ఈ యర్థముగల కీర్తనలు, తెనుగుదేశమున ఎప్పటినుండికలవో ఎవనికెరుక?

"అపరి గౌతముఁ డహల్యాదేవిఁ జూచి
పడఁతి పాషాణరూపముదాల్చి యిచట
కరము గ్రుంగుచు నెండ గాలిబెంధూళిఁ
బొరలుచుండుము నీవు పొడగానఁబడక"

ఈపంక్తులలో బుద్ధారెడ్డి గ్రహించినది ఆకీర్తనలలోని అర్థమే.

"లక్ష్మణదేవర నవ్వు," "ఊర్మిళాదేవి నిద్ర," "లక్ష్మణమూర్ఛ" అనునవి ఆంధ్ర స్త్రీలు నిరంతరము పాడుకొను పాటలలో ప్రశస్తములై పేరు మోసినవి. ఈకవి యుద్ధకాండాంతమున "ఆత్మసంప్రీణనము" లో జొనిపిన "సౌమిత్రినవ్వు" "లక్ష్మణదేవర నవ్వు" నకు ప్రతికృతి.

ఇట్టియు, మరి ఇట్టి వేయైన మరికొన్నియు అంశములు కాక, కావ్యసౌందర్యసంపాదనదృష్టిచే, అరణ్యయుద్ధకాండములలో ఈకవి ప్రవేశపెట్టిన యమూలకగాథలు ముఖ్యమైనవి మూడు కలవు.

వానిలో మొదటిది జంబుమాలి వృత్తాంతము. దీనియొక్కకి ఈ రామాయణమునకు క్రొత్తవన్నెను పెట్టుచున్నది; అనతివిస్తృతిగల యీ చిన్న కథ స్వయం సంపూర్ణమై వెలుగొందుటేగాక ప్రధానకథకు నైతము పోషకముగానున్నది. ఈవృత్తాంతమే లేనిచో శూర్పణఖాప్రవేశము సోపపత్తికమే కాదు. లోకులకు పరిహాసపాత్రమైన ఆయుపవేశరాలి చరితము దీనివలననే శోచనీయమును దయనీయమును అయ్యెను.

రెండవది కాలనేమి వృత్తాంతము. ఇందు, జనుల ఆశ్చర్యమగ్నుల జేయునది రాక్షసుల ప్రతిక్రియాకల్పనా-చతురత, అది యటుండ రావణశక్తిచే మూర్ఛిల్లియున్న లక్ష్మణుడెప్పుడు పునరుజ్జీవితుడగునాయని తహతహపడు, పాఠకులకు, ఈయవాంతరకథవలన గలిగిన కాలయాపనము. భరింపరాని యుత్కంఠను గలిగించి, దుర్భరసంశయాస్పదమైన పరిస్థితి సృష్టించి, అంతమున చేకూరిన మేలును ఇనుమడిగా ముమ్మడిగా ఆస్వాదయోగ్యమొనర్చుచున్నది.

మూడవది సులోచనావృత్తాంతము. దీనిని వేరొకచో వివరించెదను.

ఇవి గాక ప్రత్యేకముగా యుద్ధకాండకథకు వన్నె తెచ్చిన కల్పనలు, వేరువిధములైనవి మరికొన్నికలవు.

బాలకాండమున అయోధ్యలో బయలుదేరిన రామకథ క్రమముగా ఆర్యావర్తమును దండకారణ్యమును కిష్కింధా రాజ్యమును సముద్రమునుదాటి, యుద్ధకాండమున లంకలో ప్రవేశించి కిందిదవశిష్టముగా అచటనే ముగియును. ఈతుది ఘట్టమునగాని రావణునియొక్కయు ఆ త ని సం సా ర ము యొక్కయు స్థితిగతులనుగూర్చి పాఠకులకు యథార్థజ్ఞానము కలుగునవకాశము ఉండదు. అందుచే లంకాపట్టణము దయ్యాల కొటారమనియు, రావణుడు దయ్యాల దైవమనియు, ఆతని దారపుత్రాదులు భూత ప్రేత పిశాచములనియు తలచుకొని భ య ప డు దు రు. ఆసంసారముయొక్క నిజస్వరూపమును ఎరుగవలెనన్నచో, ఈరంగనాథ రామాయణమునే చదువవలయును. ఆరావణ గృహము దైవభక్తులకు, నీతిశాలులకు పతివ్రతలకు, వీరమాతలకు, వీరపత్నులకు ఆకరము.

ఆరావణుని స్వ భా వ మై న ను పై కి గానవచ్చునంత ఆసురముకాదు. ఆతని మహత్త్వమును గుర్తించి వెల్లడించిన వాడుఈరామాయణకర్త. కావ్యశిల్పధర్మమునుబట్టి చూచినను నాయకునివలె ప్రతి నా య కు డు ను ఉదాత్తమూర్తియై యుండుటయే సమంజసము గాని, నీచప్రకృతియగుట తగదు.

రావణుఁ డెంత లోకభీకరుఁ డైన శూరుఁడో అంత మహోదారుఁడైన వీరుఁడు. క్షుద్రములైన క్రోధ్యాసూయలచే కన్నులు మూసికొనిపోయి యెదిరి ఘనతను మెచ్చనియంధుఁడు కాఁడు. ప్రపంచము, ఆ రావణమో ఆ రామమో కావలెనని గట్టిపగబూనియుండియు, ఆ రాముని ధనుర్విద్యాకౌశలమును చూచినంతనే తలయూఁచి యూఁచి మెచ్చి బిట్టుకెనసి పొగడిన గుణగ్రహణపారీణుఁడు.

"నల్లవో రఘురామ! నయనాభిరామ!
విల్లువిద్యాగురువ వీరావతార!
కరశరలాఘవ క్రమకళానిపుణ
స్ఫురదురుచాప సంశోభితకృపణ
భుజసారదృఢముష్టి భువనవిఖ్యాత
విజితరిపువ్రాత విదితసమేత
మానవరాజకుమార కంఠీర
వా, నవ్యదివ్యశస్త్రాస్త్రసంపన్న
స్ఫారఘోరాక్షయ బాణతూణీర
వీరాగ్రగణ్యయో విశ్వశరణ్య
బాపురే! రామభూపాల! లోకముల
నీపాటి విలుకాఁడు నేర్పునేకలుగ
పాటించి పురములపైఁ బడ్డహరుని
ఏటొప్పు నిందు నీయేటొప్పుఁగాక"

ఈపొగడ్త యాదైత్యవిభుమంత్రులకు వెగటయ్యెను.

"పగవాని నీరీతి పంతంబువిడిచి" పొగడరాదనియు "పొగడిన భయమందబోలు నటంచు." పగవారు తనవారు పలుచగా జూతు" రనియు నుందలించిరి. వారిమాటలకు దశకంఠుడు నవ్వి "మేటిశూరులపెంపు మెచ్చంగవలదె" యని నీతి చెప్పుచు అచ్చోటువాసి పోయెను.

ఇంత మాత్రమే కాదు. రాముడు సాక్షాద్విష్ణు స్వరూపుడని యెరిగిన మహాజ్ఞాని యీరావణుడు. ఆజ్ఞానమును మనమున సిగూఢముగా నుంచుకొని శత్రుసాధనచే ఆరాముని చేతిలో కడతేరి సాయుజ్యసుఖమును పొందగోరినముముక్షువు.

"శ్రీరాము శరములచే జత్తునేని
నాకవాసులుమెచ్చ నాకోరుచున్న
వైకుంఠ మెదురుగావచ్చు నిచ్చటికి
లలన! నీవేటికి! లంక యేమిటికిఁ?
దలకొన్నముక్తి సత్పథముఁ గైకొందు"

మహారాక్షసత్వములో పరమదివ్యత్వమునుచూడగల్గిన యీకవి, ఆరాక్షసరాజును అసురలోకమునుండి యాధ్యాత్మిక లోకమునకు గొంపోయెను.

ఇక, రావణుని తమ్ములలో విభీషణుడు లోకమెరిగిన రామభక్తుడే.

ఇంచుమించు రావణునివంటి రాక్షసుడే అనిపించుకొన్న కుంభకర్ణుడెట్టి వాడో చూతము.

ఇతడు "ధర్మోజయతి" యని యెరిగియు స్వపక్షమును విడక యన్నకై యసువులనర్పించిన మహాత్యాగి. ఈ తని

ధర్మబుద్ధి వ్యక్తము చేయుటకో యన, ఈకవి యుద్ధభూమిలో విభీషణ కుంభకర్ణులకు ఒక ప్రసంగము కల్పించి, కుంభకర్ణునిచే అమూల్యములైన యీ వాక్యములు పలికించెను:—

"విను విభీషణ నీదువిక్రమంబునకు
ననువైనతటి యిది యవనీశు నెదుర
నన్నదమ్ములపాఁడి యని స్రుక్క-వలన
దిన్నరనాథుసహృదయంబె పట్టు
పూని యెన్నఁడు నిన్నుఁబొందవాపదలు
భానువంశ్యునికృప పడసితిగాన
నారాముదయగల దటుమీఁదసిద్ధ
సారదరామోదము శ్లాఘ్య చిత్తుఁడవు
లంక సద్గుణగణాలంకృతి నేల
నింక నెవ్వరుగలరిట నీవె కాక
సాహసబల మహోత్సాహంబు మెఱసి
యాహవంబున వేగమడరినన్ గడక
మగతనంబును బాఁడి మదిలోనఁదలచి
తగనీవునాతోడఁ దాకెదనరుచు
బలికితిగాని యీపట్టున నిలువ
దలవియెబ్రహ్మరుద్రాదులకైన
తొలఁగుము తమ్ముఁడా స్రుంగకీవైన
వలఁదు నిరాక్షస వంశంబుమనుప"

ఇక వీరి తల్లి కైకసి, యిట్టికొడుకుల గన్న వీరమాతయే గాక, కులమునకు రానున్న చేటు నూహించి పెద్దకొడుకునకు బుద్ధులుగరప పాటుపడిన సత్యాన్విత. ఈవృద్ధమాత తెగువతో తనంత పుత్రుకొలువుకూటమునుచేరి రామునితోడి పగవలదని నయభయముల బోధించి ఫలములేక "ఏతెరంగున బోవదిదైవకృతము; నీతిచెప్పిన విననేర్పునే" యని యిల్లుచేరి యూడిల్లిన ప్రశాంతహృదయ.

ఈమెను పోలినదే యీయింటి పెద్దకోడలు మండోదరి. పురాణవేత్త లీమెను మహాపతివ్రతలలో గణించి ప్రస్తుతించుట నిర్హేతుకముగాదు. పతివ్రత కనుకనే పతిహితముకోరి ఆతనిబుద్ధి మరల్ప మాటిమాటికి ప్రయత్నించి చూచెను. అందు విశేషమేమియును లేదు మరి, "రాము విశిఖసంతాన వేగము సైరింపలేక, జర్జరితాంగుడై రజనీచరేంద్రుడు రణభూమివిడిచి యిల్లుచేరి చింతాక్రాంతుడైనపుడు ఆతనిపౌరుషోత్సాహముల నెత్తిపొల్ప,

"........ఓవంక్తికంధర నీకుఁ
జనునె దీనునిభంగి శౌర్యంబువిడువ
జగములు నీవన్నఁ జలియించు, నేల
మగఁటిమి సెడి యిట్టి మతము గైకొంటి?
నేఁడింత ధైర్యంబు నీకు లేకున్న
నాఁడేల తెచ్చితి నరనాథుదేవి
వలదని చెప్పిన వారివాక్యములు

తలకూడెనే నేఁడు దనుజలోకేశ
భుజవిక్రమం బెల్లఁ బోవంగవిడిచి
నిజముగా మునివృత్తి నీవు గైకొంటి
వింద్రుచేనవి నోడ నెఱుఁగవు రాము
చంద్రుగెల్వఁకయున్న జనులెల్ల నగరె
యని చేసి గెలుతు గా కసురేశనీకు
ననదచందము లేల॥

అని దూరబలికి పతిం రణభూమికి మరల్చినవీరవనిత• పగవీడుమని పలుమార్లు చెప్పిన హితముకంటె పౌరుషము వీడవలదని తుదిసారి చేసిన యీయుపదేశము ఇంద్రజిత్తునకన్న వీరమాతకే తగును.

మండోదరికోడలైన సులోచన, అత్తగారికిని అత్తగారి యత్తగారికి ఎందుచు తీసిపోని సకలసద్గుణ సంపన్న. ఈమె వారి యింటికి ఒక మాణిక్యదీపము. యీ ధీర పతివ్రత యుద్ధరంగమున శత్రుమధ్యమునకు బోయి వారిం మెప్పించి రణనిహతుడైన పతికళేబరమును సహాగమనార్థమై తెచ్చికొన్నపుడు,

"ఆయింతి తెగువకు నాయింతి తెలివి
కాయింతిసుబుద్ధి కా మహామహిమ
కాయింతి పతిభక్తి కాయింతి వేగఁ
గాయముదెచ్చిన శ్రమశక్తి యుక్తి
కేమనజాలక"

ఎందును ఆశ్చర్యమెఱుగని రావణుడే మహాశ్చర్య-చకితుడయ్యెను. ఈ కథను చదివిన యెల్లవారును ఆశ్చర్య చకితులే యగుదురు.

ఏవంవిధ మహోన్నతమైన యీ పౌలస్త్య కుటుంబమును చిత్రించుటలో ఈ కవి చూపిన స్వతంత్రతకు, సమబుద్ధికి, విశాలదృష్టికి, భావుకలోకమే ప్రమాణము.

ఈ మహా గ్రంథమును ఆంధ్రవిశ్వకళాపరిషత్తు వారి కోరికపై ఎంతయో శ్రమకోర్చి బహుతాళపత్ర గ్రంథ పరిశీలనముచే నిర్దుష్టముగా పరిష్కరించి ముద్రణయోగ్యముగా నొనర్చి యిచ్చిన పండితవర్యులు శ్రీయుత వేటూరి ప్రభాకరశాస్త్రిగారికి యీ విశ్వకళాపరిషత్తు పక్షమున కృతజ్ఞతాభివందనము లర్పించుచున్నాను.

---

# మానికొండ రామాయణము.

:o:

## పరామర్శ.

మిత్రుడు మానికొండ సత్యనారాయణశాస్త్రి చుట్టపు చూపుగా విశాఖపట్టణము వచ్చి కుశలప్రశ్నానంతరము నాతో నిట్లనెను: "నేను వాల్మీకి రామాయణమునంతను ఆంధ్రీకరించుచున్నాను. అందులో మొదట సుందరాకాండము అచ్చుపడినది. మీరు దానిని చూచి యొక చిన్న పీఠిక వ్రాయవలెనని నా కోరిక. మీరు మంచిని మంచిగా, చెడును చెడుగా నుడివెదరనియు, అట్టి విమర్శయే గ్రంథకర్తలపేక్షింపదగుననియు నాయుద్దేశము. కాని యీ గ్రంథమునకు నేనే యొకయుపోద్ఘాతము వ్రాసితిని. దానిని చక్కగా పరిశీలించియే మీరు నాగ్రంథమును విమర్శింపవచ్చును" అని.

నేను ఆయన ముగముపై చూపునిలిపి ఆమాటలు ఆలకించుచు, లోలోన వేరొక తలపులో మునిగితిని. "ఈయన కవిత్వ మెప్పుడు నేర్చెను? నేర్చెనుపో, తొలుదొల్త నే రామాయణరచనమునకు ఎట్లు ఉపక్రమింపగలిగెను? సారస్వతములో నిదివరకున్న రామాయణములు చాలక ఈయనకుగూడ ఈబుద్ధియే పుట్టనేల?" అని.

కాని యీమాటలు నేను పైకిఅనలేదు; ఇంకొకడైనచో అనియుందునేమోకాని, ఈవ్యక్తిని అనజాలకపోతిని. ఏమనగా, వయసున నాకంటె పిన్నయయ్యు ఈయన నాకు చిన్ననాటి

నుండియు గౌరవపాత్రుడు. మొదటి అహింసాయుద్ధ మారంభమైనపుడు అస్మదాదులము దూరమున నిల్చి చూచుచుండగా. "అహమస్మి" యని ఆసత్రశాలకు పరువెత్తిన యువకులలో సత్యనారాయణ శాస్త్రియొకడు, మహాత్ముని సేనాధిపత్యమున అహింసాత్మక మగు ఆమహా యుద్ధమునందు పోరాడిన వీరులలో వకనితని చూచినను నాకు అట్టి గౌరవభావమే మనమున పొడముచుండును. కలియుగదుర్లభమైన వీరి త్యాగశీలత యెవరి గౌరవమునకు పాత్రముకాదు.

ఆ యుద్ధమున జయముకలిగి దేశము స్వతంత్రమైనది. కొంచెమో, గొప్పయో ఫలభాగస్వామ్యము ఆ యోధులలో కొందరకు దక్కినది. ఈయనమాత్రము సర్వనిరపేక్షుడై నేటికిని నిష్కామకర్మ చేయుటకే కుతూహలపడుచున్న సంసారయోగి. ఇట్టివాడు తన గ్రంథమునకు తొలిపలుకుగా నాలుగు మాటలు వ్రాయు మని కోరగా నేను ఎదురుప్రశ్న వేయుట యెట్లు? వ్రాయకతప్పించుకొనుట ఎట్లు? అందుకే ఉపచారపూర్వకముగా "గ్రంథము పంపుడు, అట్లే వ్రాయుదును"అని చెప్పితిని.

గ్రంథము రాగానే, చేతిలోనున్న వేరొకపని యావలకు త్రోసి, అతికుతూహలముతో ఈ సుందరాకాండము చేపట్టితిని. గ్రంథనామము-కృతిసమర్పణ-అలిపురస్థలపురాణము-ఈమూడే చాలినవి, నేను ఈ మహావ్యక్తియొక్క కవితాత్మను గ్రహించుటకు.

దీనిపేరు "తెనుగు వాల్మీకము"; "మానికొండ రామాయణము". వాల్మీకి కవిత్వమునకు చిన్నెలు వన్నెలు పెట్టి తెనుగుసారస్వతమును అలంకరించిన రామాయణములు పెక్కు లున్నవి. ఉండు గాక! వానినిచూచి ఆ యాదికవి మోదమో, ఖేదమో పొందుచుండునుగాక! ఇది యట్టిదిగాదు సాధుపుంగవుడైన వాల్మీకి సాత్త్విక స్వరూపమునకు ప్రతిబింబము. ఈపేరుపెట్టుట వాల్మీకికి ఈకవి నెరపిన పూజ. మరి, మానికొండ రామాయణము అను నామాంతరము అభిజనస్థానమునకు చేసిన యర్చన.

దేశాభిమాన మనునది యథార్థమేయైనచో ఆ దేశపు సమస్తసంప్రదాయముల యెడను అభిమానమే యుండవలయును గాని, ఏకదేశాభిమాన మెన్నడును అక్కరకురాదు. తనది కుగ్రామమే యగుగాక, నిరుపేదకుటుంబమే యగుగాక, ఆ గ్రామమును, ఆ వంశమును భక్తిపూర్వకముగా చెప్పుకో లేనివాడెవ్వడును దేశభక్తుడు కాజాలడు. ఈయన దేశభక్తి ఆ జాతిది కాదు గనుక, తనయింటిపేరును, ఆ యింటిపేరునకు కారణమైన మానికొండ గ్రామమును రామాయణమునకు జోడించి, ఆ రెండింటికి అమరత్వము సాధించెను. చరితార్థుడు.

బళ్ళారిపట్టణమునగల ఆలిపురముజైలు, అదిచేసికొన్న పూర్వపుణ్యావశమున సత్యాగ్రహ శాంతవీరులకు, ఎన్నెన్ని మారులో, ఎంతెంతకాలమో చెరసాలయై చరిత్ర ప్రసిద్ధి వహించినది. కాని, సత్యనారాయణశాస్త్రి ఆ జైలునువర్ణించిన

పద్యములు ఆ స్థలమాహాత్మ్యమును ప్రదర్శించినట్లుగా ఏ చరిత్రయు ప్రదర్శింపజాలదు. ఆ స్థలము ఆ నాటి కిష్కింధా రాజ్యము; "అపి గ్రావా రోదిత్యపి దళతి వజ్రస్య హృదయం" అని కవులు చెప్పుకొనునట్లుగా పరావహృతయైన సీతామహాలక్ష్మికై రాముడు పలవించిన పంపాతీరము. ఆ స్థలము నుండియే, మొదట సీతాన్వేషణకై, తరువాత రావణ సంహారమునకై వానరసేనలు తరలివెడలినవి. పరాపహృతయై సముద్రాంతముల బంధింపబడియున్న స్వాతంత్ర్య లక్ష్మిని సంపాదింపబూనిన ఈ సత్యాగ్రహసముం పీరులందరు ఆ స్థలమును మెట్టుటలో ఏమి దేవరహస్య మున్నదో యెవని కెరుక!

ఈ స్థలపురాణమునుగూర్చి ఈయనవ్రాసినవి పండ్రెండు పద్యములు మాత్రమే. అయినను అవి రసవంతమును, గంభీరార్థద్యోతకమును అగు ఒక చక్కని ఖండకావ్యముగా దీపించుచున్నవి. ఆ చెరసాలసమీపమున గల కొండకొనను 'హైదరాలీ' "టిప్పుల" కోటలు "కాలపురుషుని కోరల కాటుబొల్లి" చూపట్టుచుండునట! ఈపంక్తి చదువుటతోడనే సత్యనారాయణశాస్త్రి అగ్రేసరులైన కవులలో నొకడు గాని సామాన్యుడుగాడు అని యనుకొంటిని. నేనెరిగినంతవరకు ఇట్టి యుపమానముతో వస్తువును ధ్వనింపజేసిన కవులు - పూర్వ కాలపువారు ఇరువురే - తిక్కనయు, నన్నెచోడుడును.

తనయుపోద్ఘాతము విధిగా చదివితీరవలెనని ఈమిత్రుడు తొలుదొల్తనే కోరియుండుటచే కావ్యపఠనాకుతూహలమును

ఒకింతసేపు అణచుకొని యుపోద్ఘాతమును అతిశ్రద్ధతో చదివితిని. ఇందు రెండు ప్రధానాంశములుగలవు :— ఒకటి కారాగార నివాసమునకు సంబంధించినది, రెండవదికవి యవలంబించిన ఛందోవ్యాకరణాది నియమములకు, నియమోల్లంఘనములకు సంబంధించినది.

ఇంటిబెంగకును, ఇల్లాలి విరహమునకును లోగిన పేద మనసులుగల యే కొలదిమందియో తక్క, అక్కడి కారాగృహ వాసులందరును నైమిశారణ్యములో దీర్ఘసత్రమునజేసిన ఋషులవలె, పురాణకాలక్షేపములతో తపస్సాధనలతో ధర్మమీమాంసలతో కావ్యరచనలతో సుఖ... ...ముగడపుచు, సంసారకూపమున లభింపని శాంతిని ఆజైలులో అనుభవించిరని నేననుకొంటిని.

శరీరము నిగ్రహింపబడినపుడు దానితో పాటు చిత్తముకూడ కృంగిపోవుట కృపణుని లక్షణము. శరీరచేష్టా-రూపమున వ్యయమైపోవు చైతన్యశక్తి, బంధనాగారమున విరామము లభించుటచే దానిని అంతరింద్రియప్రణవము చేసి, చిత్తమునకును ఆత్మకును ఉత్తేజము కల్గించుట ధీరునిలక్షణము. మొదటిదానిచే జడత్వమును, రెండవదానిచే ఋషిత్వమును సంప్రాప్తములగును. శరీరసుఖనిరపేక్షచే ఆత్మను ఉత్తేజిత మొనర్చినపుడు అపరిమితముగా, భావస్థితములైయున్న నిగూఢశక్తులెన్నియో బయల్వెడలును. ఆదశలో, అల్పకాలము లోనే ఎన్నిభాషలో నేర్వవచ్చును. ఎన్నెన్ని యుద్గ్రంథములో చదువవచ్చును. ఎన్నెన్ని భాష్యములో వ్రాయవచ్చును.

ఈ పత్క విత్తావాసన యున్నచో, ఎన్ని మహాకావ్యములైనను రచింప వచ్చును. లోకమాన్య బాలగంగాధర తిలక్ గీతాభాష్యము వ్రాయుట కారాగారములోనే. మంత్రి మాణిక్య మగు జవహార్ లాల్ నెహ్రూ జగద్వ్యాప్తములైన మహా గ్రంథములు రచించుట ఆ పుణ్యస్థలమునసే. శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారు "మాలపల్లి" యను మహోదారమైన నవలను రచించినది చెరసాలలోనే. ఈ మానికొండ రామాయణము ఉద్భవించినదియు అట్టి బంధనాగారమునసే. ఇతరలోకము మాట యెట్లున్నను, ఆ నాటి ఈయన జైలు సోదరులందరును ఈ రామాయణము చదివి యెంత మురియుదురో!

భాషావిషయకమైన రెండవయంశమును గురించి ఇంతటి యుపోద్ఘాతము చదివిన పిమ్మట ఏమి చెప్పుటకును వలనుపడదు. ఆ యుపోద్ఘాతము లేనిచో ఈ కావ్యము ఒక సర్గమైనను చదువలేము. బుద్ధిపూర్వకముగా అనేకబంధములను ఛేదించితి నని, నియమముల నుల్లంఘించితినని, తనకు సంస్కృతభాషా పాండిత్యము అంతగా లేదని ఆయనయే వ్రాసికొనుటబట్టి యిక ఈరచనలో తప్పులెన్నుట యెవరికిని తగదు.

ఈతప్పులన్నియు ఇంచుమించు తెనుగుపాటలలో పదము లలో కీర్తనలలో బహుళముగా కానవచ్చునవే. ఆ తప్పులను సవరించినచో, ఆ గేయకవిత్వమునడక సాగదు. కావుననే పెద్దలు గేయకవిత్వమును వ్యాకరణవిధేయము చేయుబూనక స్వతంత్రముగా సాగిపోనిచ్చిరి.

ఈ కావ్యముగూడ అట్టిదే యనుకొన్నచో, అంతగా ఆక్షేపణ లుండవు. అట్లే యనుకొనవలెనని కవికోర్కి. ఇందలి ద్విపదలు, పాటలు లోనగు గేయభాగములు కవి మనోరథజ్ఞాపకములు. కాని అచ్చటచ్చట సంస్కృతవిభక్త్యంతములే "పితుఃసంధాన" మని, "ప్లవతాంవర"యని, "లవణాంభసి" యని ప్రయోగింప బడినవి. అది మనభాషలోలేని యాచారము. కాని మళయాళ ములోనున్నది. దానిని వారు మణిప్రవాళశైలి యందురు. అసలు, ఈకావ్యమంతయు గేయముగానే వ్రాయబడియున్నచో ఇంతకంటె బాగుండెడిది. అపశబ్దములు పద్యకవిత్వమును బాధించునంతగా, వచనమును గేయమును బాధింపవు.

ఇదిగాక, "తప్పొప్పుల మాట సరే; కావ్యము రసవంత ముగా నున్నదా! అదియున్నచో, తక్కినలోపములు క్షంతవ్యములు" అని కవి సవాలు. రసమనగా నేమి? కావ్యము రసవంతముగా నున్నదనుమాటకు అర్థమేమి? ఈ మొదలైనవి ఆలంకారికచర్చలు. వాని కిచట తావులేదు. లోకానుభవమునుబట్టి, కావ్యపఠనమువలన హృదయరంజనము కలిగినదా, లేదా అనుటయొకటియే దీనికి ప్రమాణము. శైలి శ్రుతికటువుగాక, కుంటువడక, ధారాళముగా ప్రవహించుటయు, అర్థము ప్రసన్నతాసంపన్నమై పాఠకుని తదేకాయత్తమనస్కుని చేయుటయు గావ్యము రసవంతమని తెల్పుటకు సహృదయు లంగీకరింపదగిన ప్రధానప్రమాణములు. ఆ రెండును ఇందు సంపూర్ణముగా నిర్వహింపబడినవని చిత్తశుద్ధితో చెప్పగలను.

ఇంకొక విశేషము-సీతారాములమధ్య హనుమంతుడు సందేశ ప్రతిసందేశములు నడపుటయే గదా సుందరకాండము యొక్క సారము. ఆ కథాభాగములు గల సర్గలను చదివి చూడుడని నేను సహృదయులను అర్థించుచున్నాను. ఊరక చదివి చూచుటకు కాదు, తక్కిన తెనుగు రామాయణముల లోని ఆ యా భాగములతో పోల్చి చూడదగును. అట్లు చూచినచో, నేను వర్ణింపనక్కర లేకయే మన సంపాదనలో ఈ కవికిగల ప్రజ్ఞను, ఇతర రామాయణములకును దీనికిని గల తారతమ్యమును వారే గుర్తింపగలరు. ఇట్టి తన్మయీభావము ఇంకొకచో గలదనుట సాహస మనిపించును.

వాల్మీకి రామాయణము వలె ఈ మాసికొండ రామాయణము గూడ కొండలున్నంతవరకు నుండుగాక.

---

# వ్యాస మంజరి

(శ్రీకట్టమంచి రామలింగారెడ్డి వ్యాససంపుటి)

ఆంధ్రసారస్వతము, భారతరూపమున సుప్రతిష్ఠితమైనది మొదలు ఆరేడు శతాబ్దులు, బహుళముగా చంపూకావ్యములును, సకృత్తుగా నిర్వచనప్రబంధములును వెలసినవే కాని, పేరుగల ఒక్క వచనగ్రంథమైనను తలచూపలేదు. గద్యపద్యాత్మకములైన చంపువులు ఉభయతారకములగును గదా యన్న నిబ్బరముచేతనో, గద్యము పద్యమువలె ధారణాయోగ్యము కాదన్న అనుమానముచేతనో, పద్యరచనవలె గద్యరచన యశోదాయకము కాదన్న నిరసనభావముచేతనో, మన పూర్వకవులు ప్రత్యేక వచనరచనలను ఆదరింపరైరి. కానిచో, సంస్కృతమున ఉత్తమగద్యకావ్యములగు కాదంబరీ దశకుమార చరిత్రలు సయితము, తెనుగున చంపువులుగానే అవతరించుటకు హేతువుండదు.

ఇట్లుండగా, వచనగ్రంథముల అభావమువలని లోటును గ్రహించి, దక్షిణాంధ్ర కవులు ఆ కొరతను తీర్పసమకట్టిరి. మధుర, తంజావూరు, మైసూరు మొదలగు సంస్థానముల యధీశ్వరులు, 17, 18 శతాబ్దులలో పెక్కు వచనగ్రంథములు వ్రాయించుటే కాక, వారిలో కొందరు స్వయముగా కొన్ని రచించిరి. కాని, అవి ఆంధ్రభారతభాగవతాది పురాణేతిహాసములకును, మరికొన్ని పూర్వప్రబంధములకును దండా

న్వయప్రాయములగు వచనరూపములే కాని, స్వతంత్రరచనలు కావు. అందుచే, వానికి చారిత్రక ప్రాధాన్యమున్నంత సారస్వతగౌరవము లేదు.

అసలు స్వతంత్రవాఙ్మయశాఖగా పరిగణింపదగిన వచనావిర్భావము, మనభాషలో అధునాతనమే యని నిస్సంశయముగా చెప్పవచ్చును. ఆంగ్లేయులు మనకొసగిన విద్యాసంస్కారమువలన మనభాషకు కల్గిన మేలు ఏమైనఉన్న యెడల అది యిదొక్కటే. వారిభాషలో ఉన్నంత కావ్య వైవిధ్యము మనభాషలో పూర్వము లేదు. వారి వాఙ్మయము చదివి, ఆ సారము గ్రహించిన పిమ్మటనే మనవారు తదను కరణముగా, నవలలు, కథానికలు, వ్యాసములు, మొదలగు నానా వచనగ్రంథములను రచింప మొదలిడిరి.

ఈనూతనగద్య గంగావతరణమునకు చిన్నయసూరి భగీరథుని వంటివాడు· దాని నానా ముఖాప్రతిహతప్రవాహగతికి కారణభూతుడు శ్రీవీరేశలింగము పంతులు. వచనప్రపంచమున పంతులు త్రొక్కని దారిలేదు. ధారాళమును, తేటతెల్లమును అయిన శైలిలో ఆయన వ్రాసిన శతాధికవచనములు, ఆయన గద్య తిక్కన బిరుదమును సార్థకము చేసెను. ఆరచనలన్నిటిలో కవులచరిత్ర చిరస్థాయియై ఆయన కీర్తిని చిరస్థాయిగా కాపాడగలదు. పూర్వకవుల జీవితాంశములను చారిత్రక పరిశోధనపూర్వకముగా నిర్ణయించు తలంపుతో, ఆయనసల్పిన కృషి అనన్యసాధ్యము. కాని ఆయన ఆసించిన ముఖ

ప్రయోజనము ఆయాకవుల కాలనిర్ణయము మాత్రమే. ఆకవుల గ్రంథవిమర్శనమునెడ ఆయనకు అంత దీక్షలేదు. ప్రసంగవశమున గ్రంథగుణములను గూర్చియు ఏకొలదిపాటి ప్రశంసయే నియున్నను, అది విమర్శనమనిపించుకొనదగినట్లుండదు. యథార్థమైన ఆంధ్రకావ్యవిమర్శ ప్రారంభము కవులచరిత్ర పుట్టుకకు తరువాత జరిగినది. ఆ మహారంభమునకు ప్రథమాచార్యుడుగా పేర్కొనదగినవాడు శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి.

శబ్దసాధుత్వాసాధుత్వనిర్ణయమే గ్రంథవిమర్శనమనెడి భ్రమలో విద్వాంసు లొకరితో నొకరు వాగ్యుద్ధములు చేయు దినములలో, భావుకుల దృష్టిని శాబ్దికచర్చనుండి తాత్త్విక మీమాంసకు మరల్చిన రసికుడు శ్రీ రెడ్డి. కావ్యమునకు శబ్దము ఆధిభౌతికాంశము మాత్రము. అది బాహిరము. దాని ఆధ్యాత్మికాంశము తద్గతకళాసౌందర్యము. అది ఆంతరము. విమర్శమార్గమును బాహిరజగత్తునుండి ఆంతరజగత్తునకు కొనిపోయిన ప్రథమాంధ్రవిమర్శగ్రంథము శ్రీ రెడ్డి కృత కవిత్వతత్త్వవిచారము. మనభాషలో ఈగ్రంథరాజమునకు ప్రతిబింబములుగా ఇటీవల అనేకతత్త్వవిచారములు పుట్టినవి. అవన్నియు ఇంచుమించు దీనికి అనుకరణములే. కళాపూర్ణోదయపరామర్శమును నిమిత్తముగా గైకొని, ఈయన కవిత్వతత్త్వవిచారమున మనకు అపూర్వములైన అనేక కళాధర్మములను ప్రతిపాదించి, వ్యాఖ్యానము నొనర్చెను. అట్లే

ఆధునిక కవులను ఆదరించి ప్రోత్సహించు తలంపున వారి ఖండ కావ్యములకు పెక్కింటికి తొలిపలుకులు వ్రాయుచు, విమర్శ సారస్వతమును మరికొంత వృద్ధికి తెచ్చెను.ఒకవంక మహాభారత కళాపూర్ణోదయాది ప్రాచీనకావ్యములను ఆరాధించుట, ఇంకొక వంక బాలకవుల భావగీతములను ఆదరించుట! ఈప్రాచీన నవీనతాసమరసభావము నిజముగా ప్రశంసార్హము. దేశకాల నిరపేక్షమైన గుణగ్రహణ పారీణత అచ్చవు సహృదయతగల వారికిగాని ఉండదు. అదిలేకయే ప్రాచీనతాభిమానులు నవ్య కవిత్వమును, నవీనతాభిమానులు ప్రాచీన కవిత్వమును నిరంతరము శపించుచున్నారు.

ఆధునిక కవిత్వములో నైనను, సరసతతోపాటు నియమబద్ధత కలదానినె ఈయన కొనియాడునుగాని, విశృంఖల విహారమొనర్చు దానిని మెచ్చడు. సముచితనియమపరిపాలనము నిరర్థకబంధవిచ్ఛేదము, అస్వాతంత్ర్యతాతిరస్కారము—ఇవియే ఈయన పదింపదిగా సాంఘికాచారవిషయముననను, కావ్య మర్యాదావిషయముననను బోధించుధర్మములు. ఈయన ఉపన్యాసములలో, వ్యాసములలో, ఈధర్మత్రయమే ఆత్మగా భాసించుచుండును.

విమర్శకులలో ఈయనకెంత ప్రాధాన్యమున్నదో వ్యాసరచయితలలోను అంత ప్రాధాన్యమున్నది. సాహిత్యాంగముగా పరిగణింపదగిన వ్యాసరచన, ఆంగ్ల భాషలోవలె మనభాషలో ఇంకను పరిణతావస్థకు రాకున్నను,

జరిగినంతవరకు దానిపెంపునకు కారణభూతులైన విద్వాంసులలో ఈయన యొకడు. గ్రంథములకు పీఠికలు వ్రాసినను, పత్రికలకు వ్యాసములు వ్రాసినను, తాత్వికముగా విషయము చాలన మొనర్చి, పటుత్వముగల భాషలో సోపపత్తికమైన సిద్ధాంతముచేయు నేర్పు ఈయన వాక్కునకు సహజగుణము. ఈవ్యాసములకు ఇదియే ప్రథమాలంకారము. రెండవది, వాని శైలి. విషయౌన్నత్యముతోపాటు అర్థగాంభీర్యమును, దానికి అనుగుణమగు శైలియు నున్నప్పుడే, వ్యాసము సర్వాంగ సుందరముగా నుండును. అర్థగాంభీర్యము లేనిచో పేలవతయు, శైలీసంపన్నత లేనిచో నీరసతయు తటస్థించి వ్యాసమునకు తీరని లోటుకలిగించును. ఈయనవ్యాసములలో అర్థ మెంతగంభీరముగా నుండునో, శైలియు అంతసురుచిరముగా నుండును. ఆ శైలియు, విషయవిభేదమునుబట్టి ఒక్కయెడ అలంకారికముగా, ఒక్కయెడ ప్రాస్తావికముగా, ఒక్కయెడ తార్కికముగా మారుచుండును. ఏరూపము దాల్చినను దాని పటుత్వము సొగసుదనము పోవు. నన్నయనూరనలను ప్రశంసించుచో, శైలియెంత అలంకారికముగా నున్నదో, తాతతండ్రుల ముచ్చటలు చెప్పుచో అంత ప్రాస్తావికముగా నున్నది. ఇన్ని అవాంతరరూపభేదములు పొందుచున్నను, దానికి ఆత్మీయమైన మూలధర్మమును విడనాడదు. ఈ శైలికి ఆత్మీయాంశము బుద్ధిగమ్యత. నానా శాస్త్రప్రసిక్తాతిమును, విజ్ఞానసాంద్రతమును, సమ్యగ్యోజనా యుతమును నిన మేదస్సునపుట్టిన భావముగల రచన బుద్ధి గమ్యమయి గాక ఇంకొకవిధముగా నుండదు; ఉండదగదు.

నూతన శాస్త్రపరిచయము వలననో, అన్యసంప్రదాయ సంపర్కమువలననో, ఒకసంఘములో గాని ఒకవ్యక్తికి గాని అపూర్వభావములు పొడమునపుడు వానిని వ్యక్తీకరించుటకు పూర్వస్థితమైన సాధారణభాష చాలదు. అట్టియెడ నూతన పదజాలము సృష్టించుటో, అన్యదేశ్యములు ప్రయోగించుటో పూర్వపదములనే లక్షణార్థమున వాడుటో తప్పనిసరియగును. ఈమూడుపద్ధతులలో అన్యదేశపదప్రయోగము భాషాస్వచ్ఛతకు ఉపహతి కల్పించును. ఈగ్రంథకర్త అట్టిస్వచ్ఛతాభ్రంశమును బొత్తిగాఒల్లడు; మఱి పూర్వపదములనే నూతనార్థములకు తగినట్లు మలచును. ఈదుర్ఘటనియమమునుఅసిధారావ్రతముగా పరిపాలించుటచేతనే ఈయన తన శైలిని సాంకర్యమునకు తొలగించెను.

ఈ విధముగా నానాగుణశోభితములైన ఈ వ్యాసములన్నియు-అప్పుడప్పుడు అవసరమును బట్టి అనేక కాలముల వ్రాసినవి-ఒక్కచోచేర్చి, సమగ్రసంపుటముగా ప్రకటించుట భాషకు మేలుసేతయని మిత్రులు హెచ్చరించగా, శ్రీరెడ్డి ఆమోదించుటయేకాక, ఈవ్యాసమంజరిని విశ్వకళాపరిషత్తునకు సొత్తుగా దానమొనర్చి, వారి కృతజ్ఞతకు పాత్రుడయ్యెను.

---

# "ముసలమ్మ మరణము" ఇత్యాదులు.

(శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి ఖండ కావ్యసంపుటి)

భావనాత్మకమైన కావ్యసృజనశక్తియు, వస్తుతత్త్వవివేచనాత్మకమైన కావ్యవిమర్శప్రజ్ఞయు ఒకవ్యక్తిలోనే నెలకొని యుండుట అసంభవము గాకపోయినను అసాధారణము. అట్లుండుటయే తటస్థించిననాడు ఆవ్యక్తి చేరచింపబడిన కావ్యము కళాకౌశలపరిభూషితమును, తత్కృతమైన విమర్శము రసవంతమును నగును. అట్టివానిని కేవలవిమర్శకుడని గాని కేవల కవియనిగాని కాకుండ విమర్శకకవి యని పేర్కొనదగును. ఆంగ్లేయ సారస్వతమున ఇట్టి ఉభయప్రజ్ఞలుగల మహనీయుడు గతశతాబ్దిలో మేథ్యూఆర్నాల్డు. ఆంధ్రసారస్వతమున, ఈశతాబ్దిలో శ్రీకట్టమంచిరామలింగారెడ్డి. ఆదేశమున ఆర్నాల్డును ఈదేశమున రెడ్డియును విద్యాశాఖాధికారులుగా సరస్వతీసేవ కేజీవితములను అంకితమొనర్చుకొనుటయు వీరి సాదృశ్యమును మరికొంత సన్నిహితము చేయుచున్నది.

ఆర్నాల్డుకు పూర్వమునగాని యాతనికి సమకాలమున గాని ఆంగ్లభాషలో విమర్శకులు లేకపోలేదు. అయినను కావ్యవస్తు కావ్యప్రయోజనాదివిషయములలో ఆతడు ప్రతిపాదించిన యుత్తమాదర్శములే ఆతని విమర్శవ్యాసములకును ఉపన్యాసములకును పరమప్రామాణ్యము నొసగినవి. అట్లే యిచటను శ్రీరెడ్డి విమర్శలకు ప్రామాణికత్వమిచ్చినది మన

సారస్వతములో ఈయన ప్రవేశపెట్టిన నూత్న విమర్శపద్ధతి. దీని స్వరూపమును వ్యాసమంజరి పీఠికలో యథాశక్తి ఉగ్గడించియే యుంటిని.

మన దేశములో శ్రీరామలింగారెడ్డిని విమర్శకునిగా గొనియాడుదురే గాని కావ్యకర్తగా పెక్కుమంది యెరుగరు. దీనికి కారణము ఈయన పద్యరచన సంఖ్యనుబట్టి మిక్కిలి పరిమితమగుట. పరిమితమే యయ్యు గుణమునుబట్టిచూచినచో కొత్తకవిత్వమునకు ఆధునిక పద్యవాఙ్మయమున ఉత్తమస్థానమే కలదని చెప్పుటలో అత్యుక్తి యేమాత్రమును లేదు.

మనసారస్వతమునకు యథార్థమైన యాధునికత, గత శతాబ్ది తుదిభాగములో ఆంధ్రభాషాపాండిత్యముతో పాటు ఆంగ్లభాషాభ్యాసము చేసిన విద్యాధికులవలన కలిగినది. ఆంగ్ల భాషాపరిచయము లేక పోయినను కాలప్రభావమునుబట్టియేమి, స్వకీయ ప్రతిభావిశేషము చేతనేమి ఆంధ్రసరస్వతిని నవ్యరీతుల కై సేసిన మహామహులును పెక్కుగు గలరు. వారినందరిని ఆధునిక యుగమునకు పూర్వరంగ ప్రవర్తకులని చెప్పవచ్చును. తదుపరి ఈసారస్వతరంగమున క్రొత్తవేషములను ప్రవేశపెట్టి నూత్న ప్రదర్శనములను జరిపిన సూత్రధారులు ఆంగ్లభాషాస్నాతులైన ఆంధ్రకవులే యనుట యథార్థమైనమాట, వీరిలో మరల రెండు తెగలవారు గలరు- ఛందోవ్యాకరణాది నియమములలో వలుకుబడిలో ప్రాచీనసంప్రదాయములనే పాటించుచు, వస్తు విన్యాసము, భావసంపద, మొదలైన కావ్యగుణములలో

నూతనత్వము ప్రదర్శించిన వారొకరు; ప్రాచీన నియమముల అంతగా పాటింపక, ఛందములోను పలుకుబడిలోనుగూడ సరి క్రొత్త త్రోవలు త్రొక్కినవారు ఇంకొకరు. వీరిలో మొదటి వర్గమువారు ప్రాచీనులయు నవీనులయు ఆదరాభిమానములకు పాత్రులు కాగా, రెండవ వర్గమువారు ప్రాచీనులను అంతగా మెప్పింపలేకపోయిరి. మధ్యకాలములో ఎన్ని రూపాంతరములు పొందినను ఈ యుభయవర్గములును నాటినుండి నేటిదనుక భిన్నలక్ష్యములతో భిన్నమార్గములనే నడచుచున్నవి. ప్రాచీనతా పక్షపాతముగల నవ్యమార్గ ప్రవర్తకులలో శ్రీ రామలింగారెడ్డి ముఖ్యుడు.

ఇరువదియవ శతాబ్ది యుదయింపనున్న వేగుబోకలో నక్షత్రమువలె మన సారస్వతాకాశమున నవ్యకాంతులలో ఆవిర్భవించిన నూతనాంధ్రకావ్యము "ముసలమ్మ మరణము." శ్రీరెడ్డి పంతొమ్మిది వత్సరముల యువకుడై యున్నపుడు (1899-వ సం. రములో) చెన్నపురి క్రైస్తవ కళాశాలా-ఆంధ్ర భాషాభిరంజనీ సమాజ పోషకుడగు శ్రీ సమరి రంగయ్యశ్రేష్ఠి యీ కావ్యమిట్టొక పుట్టుకకు కారణభూతుడు. ఉత్తమ కావ్య రచనను ప్రోత్సహించుటకై శ్రేష్ఠి నెలకొల్పిన పోటీపరీక్షలో నెగ్గి బహుమానము గెల్చుకొని ఉపహారీకరింపబడిన యీకావ్యమును, తత్కర్తయైన యువకవిని, సుప్రసిద్ధులైన ఆంధ్రకవి పండితు లెందరో ముద్దుగా మెచ్చుకొని బహుగా ఆశీర్వదించిరట. మన సంప్రదాయమును బట్టి కావ్యము శుభాంతముగా నుండ

వలెను గనుక, మరణాంతముగా రచింపబడిన యీకృతిని ప్రస్తు
ననుకృతిమ కల్పనతో నైనను సరే-మంగళాంతముగా
సంస్కరింప వలసినదని కొందరు ఆ బాలకవిని హెచ్చరించిరట.
ముగమోటమిచే అట్టివారికోరికను ఈగ్రంథకర్త మన్నించియే
యుండునేని ఈ కావ్యమునకు ఉండవలసిన పరిపూర్ణ నవ్యత
యుండెడిది కాదు. కథాగతినిబట్టి సహజపరిణతమైన కావ్యము
శోభావహ మగును. అసహజమైన కల్పన, అసంభావ్యమై
కావ్యకళకు హైన్యమును ఆపాదించును. అదిగాక మరణాంతము
లన్నియు అమంగళాంతములని యనుకొనుటయు దోసగే.
కథాంతమున జరిగెడి మరణము లోకకల్యాణ ప్రదముగా
ప్రదర్శింపబడునేని అది మంగళాంతమనియే భావింపవలెను.
సంఘ శ్రేయముకై నవ్యమోముతో ఆత్మబలిని అంగీకరించి,
స్వయముగా మృత్యుదేవతా శ్లేషణమొనర్చుకొన్న ఆ కాపుబిడ్డ
మునలమ్మత్యాగము ఎంత లోకకల్యాణహేతువో వేరేచెప్ప
నక్కరలేదు. ఆ మహానుభావురాలి యఖండ త్యాగమువలన
ఆగ్రామీణులందరు బిడ్డలతో పచ్చగా నిల్చియుండుటయే ఈ
కథవలన గలిగిన మంగళము. ఈకళాధర్మము నెరిగి కథకు ఈ
పరిణామమును ఇచ్చెను గనుకనే శ్రీరెడ్డి ఆంధ్రకావ్య సరణికి ఒక
క్రొత్తదనమును ఆపాదించిన వాడయ్యెను. ఆధునిక యుగమున
దృశ్యకావ్యములలో మరణాంతములను ప్రవేశపెట్టిన కవి
శ్రీధర్మవరము కృష్ణమాచార్యులనియు, శ్రవ్యకావ్యములలో
అట్టివానిని ప్రవర్తింపజేసినవాడు శ్రీరామలింగారెడ్డి యనియు
నాయూహ.

మన ప్రాచీన ప్రబంధములలోని గాథలు ప్రాయికముగా పౌరాణికములును, క్వాచిత్కముగా చారిత్రికములును, అతి సకృత్తుగా సాంఘికములును అయియున్నవి. శృంగారమల్హణ చరిత్ర, నిరంకుశోపాఖ్యానము మొదలైన నొకటిరెండు సాంఘిక ప్రబంధములున్నను, అవియు నిర్వహణమున కృత్రిమ పర్యవసాయులే యైనవి. కాశీఖండము, పాండురంగమాహాత్మ్యము, శ్రీకాళహస్తిమాహాత్మ్యము లోనగు స్థలపురాణములయందు కొన్ని చక్కని సాంఘిక కథలు ఉపాఖ్యానములుగా సంతరింపబడియున్నవి. కాని కథాపర్యవసానమును బట్టి యవియు పౌరాణికరూపమే తాల్చినవి. ఆయా మతములయెడ, ఆయా క్షేత్రములయెడ ప్రజలలో భక్తిశ్రద్ధలను కలిగించుటే ప్రయోజనముగా రచింపబడిన గాథలగుటచేత వానికిఅసాధారణ రూపమును, అలౌకికవాసనయు తటస్థింపక తప్పదు. అచ్చపు సాంఘికకథ సంఘజీవితమునకు ప్రతిబింబమై, భూలోక సంచారమును వదలిపెట్టనిదై, తత్సంఘీయులతో సన్నిహిత బాంధవము కలదియై యున్నపుడే దాని సాంఘిక స్వభావము సార్థకమగును. అలౌకిక-అసామాన్య కల్పనచేత స్వాభావికతను కోల్పోని సాంఘికేతివృత్తముగల కావ్యములు ఆధునిక యుగముననే వెలసినవి. వానిలో కొన్ని మహాకావ్యములును కొన్ని ఖండకావ్యములును గలవు. మహాకావ్యములలో శ్రీ తిరుపతి వేంకటకవుల శ్రవణానందపాణిగృహీతలును, ఖండకావ్యములలో ఈముసలమ్మ మరణమును జననకాలమును బట్టియేగాక గుణసంపన్నతను బట్టియు అగ్రగణ్యములు.

కావ్యమునకు రసాధాయకత్వమే పరమ ప్రయోజనము గదా! రచనాకౌశలమునుబట్టి యాసిద్ధి కలిగినపుడు ఇతివృత్తము ఎట్టిదైననేమి? సాంఘికమైనంతమాత్రమున విశేషమేమి? అను ప్రశ్న యొకటియున్నది. ఇది వేయదగినప్రశ్నయే; సమాధానమును అపేక్షణీయమే.

కావ్యకళకు రసానందమనెడి పరనిర్వృతి పరమ ప్రయోజనమనుట సత్యమేగాని, ఈ కళకు అవాంతరప్రయోజనములు లేకపోలేదు. గౌణములయ్యును అవి సాధింపదగిన ప్రయోజనములే. వానిలో అతిముఖ్యమైనది సదుపదేశకత. ఈ ప్రయోజనమును ఆలంకారికులు మఱచిపోలేదు, "కావ్యం సద్యః పరనిర్వృతయే"అన్నచోటనే "ఉపదేశయుజే" యనియు శాస్త్రములో వ్రాయబడియున్నది. కావ్యము చేయు ఆయుపదేశ స్వభావము దేశకాలపాత్రవశమునను, కావ్యకర్తయొక్క ఆత్మీయతా ప్రభావవశమునను రూపొందుచుండును. ఒక కవి మతనిష్ఠను, మరియొకకవి పరోపకార పరాయణతను, ఇంకొక కవి త్యాగశీలతను, వేరొకడు శౌర్యసంపాదనమును, ఇట్లే యనేకులు అనేకవిధములైన సదుపదేశములను నానావిధ కవితాలక్ష్యమునుబట్టి సల్పుచుందురు. ఈయుపదేశము వాచ్యమై రామణీయక భంజకమైనచో తిరస్కార్యమే కాని, అట్లుగాక వ్యంగ్యముగా కళావర్యాదానురూపముగా ఉన్నపుడు శిరోధార్యమే యగును. కళాసిద్ధియే కళకు ప్రయోజనమనుట సర్వసమ్మతమైన సిద్ధాంతము కాదు. చిత్రకళలలో ఇతరములకు లేని

యీసామర్థ్యము కవిత్వకళకు ఉన్నది గనుకనే, యది సోదర కళలలో అగ్రస్థానము అధిష్ఠింప గలిగినది. ఈయుపదేశము ఆచరణయోగ్యము కావలెనన్నచో, ఆ యాదర్శమునకై కావ్యమునందు చిత్రింపబడిన ఆలంబనవిభావము (పాత్రలు) మానవసంఘమునకు అతీతమూర్తులుగా ఉండరాదు. అట్టి వారి చరిత్రలను, దేవలోక చరిత్రలుగా దూరమునుండి నమస్కరింతుమేగాని అనుకరించుటకు ప్రయత్నింపము. కావుననే ఆచరణయోగ్యమైన సదుపదేశమునకు సాంఘిక కథ యెక్కువగా ఉపకరించును. ఏ దేశమందైనను, ఏ కాలమందైనను, తలచినమాత్రమున ఓహో యని తలలూపింపజాలు సాంఘిక వృత్తాంతములెన్నో జరుగుచుండును. ఆంగ్లవాఙ్మయమునందు అట్టివానిలో పెక్కింటిని కవులు కావ్యములుగా సంతరించి తమ దేశీయులను జాతీయతాభిమాన గౌరవములు గల వారినిగా దిద్దుకొనిరి. నలువైపులనుండియు అగ్నిజ్వాలలు నాలుకలు గ్రోలుచు మ్రింగవచ్చుచున్నను చలింపక ఆయగ్నికిఆహుతియగు పర్యంతము, తండ్రిచే విహితమైన స్థానమువీడని "కేసబియాంక" వృత్తాంతమును చిన్నఖండకావ్యముగా సంతరించిన ఆ యింగ్లీ కవి, తన దేశపుబాలురకు ఎంతమందిని వీరకిశోరములుగా మార్చ గలిగియుండునో యూహింపవలసినదేగాని వ్రాయవలసినది కాదు. అట్టి సాహసములు, అట్టి త్యాగములు నెరపిన వ్యక్తులు మన సంఘమునను లేకపోలేదు. కాని వారిపేర్లు వినుటయు మరచి పోవుటయు మనకు పరిపాటియైనది. పుణ్యాత్ములైన యే పద

కవులో అట్టిగాథలను కొన్నిటిని వీరపదములుగా పాడిరిగాని ఆ పదకవిత్వము నాగరకలోకమున స్థానము లభింపమి, పల్లెలలో అచ్చటచ్చట గ్రామ్యజీవనము గడుపుకొనుచున్నది. గ్రామములోసైతము ఇప్పుడు ఆపదములను పాడెడువారులేరు, విను వారునులేరు. అట్టిగాథలతో కావ్యరచనచేయుట జాతీయతాభి వృద్ధికి ఎంత యావశ్యకమో గ్రహించినవారికేగాని తక్కిన వారికి ఆ గాథలవిలువ తెలియదు.

ఈ ముసలమ్మ మరణము ప్రతి యాంధ్రుడును జదువ వలసిన వీరగాథ. ఇట్టిసాంఘికేతివృత్తముగల మరణాంతకావ్యము గనుకనే యిది నూతన కవితా స్వతంత్రరీతులకు, ఆనాడు దృష్టాంతముగా పేర్కొనబడినది.

తెనుగులో స్త్రీ పాత్రకు ప్రాధాన్యమిచ్చి వ్రాసిన కావ్యములు చాల తక్కువ. ఏకొలదిగనో యున్నను అవి శృంగారరస బహుళములే గాని యితరరస ప్రతిపాదకములు కావు. మరియు వానిలోను ఏరెండు మూడిటనో తప్ప తక్కిన వానిలో ఆపాత్రలు వర్ణింపబడినవేగాని చిత్రింపబడినవికావు. పాత్రవర్ణన యనగా దానిగుణగణము నంతయు కవి, తానై పేర్కొనుట. పాత్ర చిత్రణమనగా కథాకార్యవశమున ఆ పాత్రలయొక్క స్వరూపస్వభావములు స్వయంవ్యక్త మగునట్లు చేయుట. ఈరెండవ పద్ధతిని స్వయంవ్యక్తమగునట్లుచేసినపాత్రలే సజీవములనియు, ఆ సజీవతయే కవియందలి సృజనశక్తి తాల్చిన రూపమనియు చెప్పుదురు. ఈ కావ్యములోని ముసలమ్మపాత్ర అతినిపుణముగ చిత్రితమైనదేగానిపూర్వపద్ధతిని

వర్ణితమైనదికాదు. ఈరచనకు శోభకలిగించిన విశేషములలో ఈపాత్రచిత్రణకౌశలమొకటి.

మఱియు పూర్వప్రబంధములలో పాత్రచిత్రణము లేక పోగా మీదుమిక్కిలి కొన్నింట, అతిమాత్రమైన స్త్రీశరీరావయవవర్ణనలు. కామబీజకములైన కథాసంఘటనలును మనకు వానియెడ వైముఖ్యమును గలిగించుటకు ముఖ్యహేతువులైనవి. "స్త్రీయనగా సుందర విగ్రహమనియు, పురుషుని సుఖానుభవమునకు ఆలంబనమనియు, వ్యక్తిత్వములేని ఛాయవలె ఆతని వెంబడించు ఒకవింత యాకృతియనియు తెనుగుప్రబంధకవుల యభిప్రాయమా" అని ఆత్మగౌరవముగల యే మహిళామణియైనను ధిక్కారముతో ప్రశ్నించుటకు వీలైనంత వాఙ్మయము మనలోనున్నది.

అతి పవిత్రమును, ఆధ్యాత్మిక కోశాధిరూఢమును, జీవేశ్వరైక్య ప్రతిబింబమును కాదగిన శృంగారము, లోక తిరస్కారమునకు పాత్రమగుట యెంతయు శోచనీయము. ఈ భ్రష్టతకు కారణమైన కవుల దృష్టికి లక్ష్యభూతములైనవి, శరీర సంయోగ సౌఖ్యము. తృతీయ పురుషార్థ తృప్తియు. సమస్త ప్రాణి సహజమైన యీజాంతవతృష్ణ ఉత్తమమానవ పాత్రలలో గూడ ప్రదర్శించుటవలన ఆ ప్రబంధములకు గౌరవముకంటె న్యూనతయే యెక్కువ వచ్చినది. తెనుగు వాఙ్మయమున ఈ పతనము ప్రత్యక్షముగా తటస్థించుట విజయనగర సామ్రాజ్య పతనానంతరమునుండియు. వాఙ్మయముయొక్క పతనాభ్యు

దయములు జాతియొక్క పతనాభ్యుదయములతో సంచరించు చునే యుండును. శృంగార రసమును, స్త్రీపాత్రను, ఉద్ధరించిన వారు ఆధునికకవులు. స్వచ్ఛమైన ఆధునిక సాహిత్యములో శృంగారమనగా ఆత్మసంయోగము; సౌందర్యమనగా గుణ సౌందర్యము. ఈమార్పు సాంఘికముగా ఎంత నాగరకమైనదో సారస్వతముగా అంత ఉదాత్తమైనది. ఆధునిక కవితకు ప్రారంభ కాలమున దారిచూపినవారిలో ముఖ్యుడు శ్రీరెడ్డియని పైని చెప్పితిని. ఈయనమార్గదర్శకత్వము స్త్రీపాత్ర గౌరవ సంరక్షణ యందును గలదు. ఈయన స్త్రీపాత్రలు సురుచిరోదార వర్తనచే లోకపూజ్యత నందునవేకాని రూపసౌందర్యముచే మనస్సునకు మరులు గొల్పునవికావు.

విశేషించి ముసలమ్మ మరణమున శోభావహమైన మరియొకగుణము మృదులమైన కరుణారసపోషణ, జంత్రి గానములో, మోత లేని నాదమునకై (Noiseless sound) తంతిని గట్టిగానొక్కి మీటెడి గాయకునివలె, కరుణ భావావేశములు పొంగి పొంగలనీక నిగ్రహించి నడపగల కవికే దాని నిశితత్వమును భావితత్వమును సంపాదించుట సాధ్యమగును. ఉత్తమ కవిత్వమునకు లక్షణము భావావేశవ్యక్తీకరణముగాదు; భావనిగ్రహ వ్యక్తీకరణము. ఈవిధముగా, సాత్వికముగా కరుణరస స్ఫూర్తిని కలిగించుటలో శ్రీరెడ్డి సిద్ధహస్తుడు. తఱచి చూచినచో, సాత్వికమైన విషాదచ్ఛాయయే ఈయన కవితా ప్రవృత్తికి చోదకము అని తోచును. ఇందలి కరుణరసచ్ఛాయలు

తిక్కనశాంతిపర్వమునందలి కపోతోపాఖ్యానమును తలపించుచుండును.

అసలు, భావానుకరణములోను, శబ్దానుకరణములోను శ్రీరెడ్డి ఆధునికాంధ్రకవులలో తిక్కన ప్రథమ శిష్యుడనిపించుకొనుటకు తగిన యర్హత గలవాడు. తిక్కనయు, తిక్కన భారతమును ఈయనకు నిరంతరారాధ్య దేవతలు. కవిబ్రహ్మ "కారణజన్ము" డనియు, "ఆంధ్రలోక పరిశుద్ధతపఃఫలవాకరూపు" డనియు "కవితాప్రపంచరవి" యనియు ఈయన నిశ్చితాభిప్రాయము. ఇక భారతమునుగూర్చి "సైలసవృత్తమున నగాధాలోచనలన్ మహోద్భుతాఖిలపథ పాత్రాళి ప్రదర్శనంబున భూలోకమునందు నొకటె పుస్తక" మని ఈయనకుగల పూజ్యభావము. ఈ భారతారాధనము శ్రీరెడ్డియింట నెలకొల్పినవాడు ఈయన తండ్రి శ్రీసుబ్రహ్మణ్య రెడ్డి. భారతాభిరుచి ఆతండ్రినుండియే ఈయనకు సంక్రమించినది. శ్రీసుబ్రహ్మణ్యరెడ్డి తనబహుకాలభారతపఠనమునకు ఫలముగా లభించిన పద్యరత్నములను, లోకయాత్రానిర్వాహణమునకై యెల్లరు నిరంతరము పారాయణము చేయదగిన వానిని, భారతసారరత్నావళి యనుపేర ప్రచురించెను. ఆయన భారతపరిశ్రమకు అదఫలము. ఆయనకుమారుడైన శ్రీరామలింగారెడ్డి భారతపరిశ్రమకు ఫలము లోకమునకు ఇంకను అందలేదు, "దానికి నానేర్చిన విద్యానిపుణత కొలదిఁ జేతు నాంధ్రంబున వ్యాఖ్యానము యథార్థ సంవిజ్ఞాన విధానముల నవ్యతికి

లేర్పడగన్” అనెడివ్యాఖ్యానము మాత్రము జరిగినది. ఆభారత వ్యాఖ్యానము, కావ్యవిమర్శగా, తత్వమీమాంసగా, రాజనీతి శాస్త్రముగా, దేశచరిత్రగా, అది యిది యననేల, అందుగల సమస్తాంశములను స్పృశించు కూలంకష వివరణగా ఉండునని నాయూహ. భారతమనగా శ్రీరెడ్డికి ఆరాధ్యదేవతయేగాక ముద్దులబిడ్డయు. అల్లారుముద్దుగా పెంచి పెండ్లిచేసి, కొమారితను అత్తవారి యింటికి సాగనంపునపుడు ఈయన కోమల హృదయమునకు గలిగిన శూన్యతను పోగొట్టి, మనస్సునకు ఊరటగలిగించిన భారతము ఈయన పాలిటికి ఏమిగాదు? బిడ్డయన్నను అగును. తల్లియన్నను అగును.

కవిత్వతత్త్వవిచారమనుపేర కళాపూర్ణోదయ విమర్శము వలన ఆంధ్రసారస్వతమునకు చేకూరినమేలుకంటె భారత విమర్శమువలన ఎక్కువమేలే లభించునని చాలమంది ఆసించు చున్నారు. తిక్కనసూరన లిరువురే ఈయనవిమర్శదృష్టికి తాళిన ఆంధ్రకవులు. మరి యేప్రబంధకర్తయు ఈయన మనసునకు వచ్చలేదనుటలో దోసగేమియు లేదు. ఊరక వచ్చకపోయినవి పోనిండు, అనౌచిత్యకళంకితములైన కొన్ని ప్రబంధములు ఏవగింపునకును పాత్రములైనవి. బిల్హణీయము అట్టివానిలో ఒకటి. ఆ యేవమును పురస్కరించుకొనియే యందలి అనౌ-చిత్యప్రతిఘటనకై “నవయామిని” ఆవిర్భవించినది. ఆరచనయు దానికి ప్రారంభమున గల సవిమర్శమైన “సంభవప్రకార” మనెడి పీఠికయు పెక్కుమంది విద్వాంసుల మన్ననకు పాత్ర

మగుట నేనెరుగుదును. "తేజము దీర్ఘాయువు విభ్రాజితలోక ప్రసిద్ధివఱలుత" మని బిల్హణుడు శిష్యురాలికొసగిన దీవనయే ఈ కావ్యము నెడను సఫలమగుగాక!

ఇందు సంపుటీకరింపబడిన ఆరుఖండకావ్యములు శ్రీరెడ్డి 1899 సంవత్సరము మొదలుకొని 1926 వ సంవత్సరము వరకు గల మధ్యకాలమున అప్పుడప్పుడు రచించిన వానిలో పోయినవి పోగా మిగిలినవి. ఈయన విమర్శవ్యాసము లను సంపుటీకరించి వ్యాసమంజరి యనుపేర ప్రకటించుట యెంత యుపకారక మయ్యెనో లోకమెరుగును. ఈ ఖండకావ్య సంపుటివలన గూడ సారస్వతమునకు అట్టి మేలు చేకూరగలదను నిశ్చితాభి ప్రాయముతో దీనిని వెల్వరించితిమి. ఈసంపుటీకరణమును గురించి ఈయనకు నిజముగా అంతఅభినివేశమే లేదు. కొంతవరకు నాప్రోత్సాహమే యీప్రచురణమునకు కారణము.

నేను ప్రోత్సహించిన కార్యముగనుక ప్రస్తావనరూప మైన ఈ యుపోద్ఘాతము ను నేనే వ్రాయవలసిన వాడనైతిని.

---

# ప్రభావతీప్రద్యుమ్నము-దానిమూలము

ప్రభావతీ ప్రద్యుమ్నమునుగూర్చి, తత్కర్త పింగళి సూరనార్యుడు హరివంశ కథాశ్రయమని చెప్పియుండగా పండితులు కొందరు ఆకథ హరివంశమున లేదనియు, అందలి ఉషాపరిణయ కథనే యిట్లు రచించి, దానికి ప్రభావతీ ప్రద్యుమ్నమని, కవి క్రొత్తపేరిడెననియు అభిప్రాయపడిరి.

గతానుగతికముగ అందఱమును అట్లే యనుకొంటిమి. కాని హరివంశమున లేనికథను "హరివంశ కథాశ్రయ"మని కవి బొంకనేల? ఉషాపరిణయ కథను తారుమారుచేసి యిట్లు క్రొత్త పేరిడనేల? యనుసందేహములు జిజ్ఞాసువులను బాధించుచునే యుండెను. మఱియు కళాపూర్ణోదయమువలె ఇదియు కేవల కల్పనాకథ యేమోయనియు కొందరు శంకించిరి.

తెలుగున గల రెండు హరివంశములలోను ఈ యితివృత్తము లేమిచేసియు, ఉషాకథకును దీనికిని ఏ యొకటి రెండుఅంశములనో తక్క సర్వత్రసామ్యము లేమిచేసియు అట్లు శంకించుట కలిగినది.

హరివంశ మనగా తెల్గు హరివంశము మాత్రమే యని భ్రమించి సంస్కృత పురాణమును చూడకుండుటవలన దొరలిన ప్రమాదమిది.

ఇట్లుండ శ్రీ పురాణపండ మల్లయ్యశాస్త్రి, ఆ గ్రంథమునకు వ్యాఖ్యానము వ్రాయుసందర్భమున చక్కగా

పరిశీలించి, సంస్కృత హరివంశమున ఉన్న యీకథను కనుగొని లోకమునకు చూపి చెప్పెను. సంస్కృత హరివంశమున రెండవ పర్వమగు విష్ణుపర్వమున ప్రభావతీ ప్రద్యుమ్నకథ యంతయు తు, చ, తప్పకుండ ఉన్నది. ఏలనో, ఎఱ్ఱనయు, సోమనయు, రసవంతమైన యీకథను తెనిగింపమానిరి.

పండ్రెండవ శతాబ్దిని తిరువనంతపురమును పాలించిన "రవివర్మ భూపు"డను ఒక రాజకవి యీకథనుబట్టియే "ప్రద్యుమ్నాభ్యుదయము" అను ఒక సంస్కృతనాటకమును రచించెను. భాసనాటకములను ఉద్ధరించిన శ్రీగణపతిశాస్త్రియే దానిని కనిపట్టి యచ్చొత్తించెను. నేనుఆనాటకమునుసంపాదించి చదివిచూడగా, మనప్రభావతీ ప్రద్యుమ్నమునకు ఆనాటకము గూడ మూలము కావచ్చునని యనుమానమేర్పడెను. మన ప్రభావతి, మన ప్రద్యుమ్నుడు, మన కృష్ణుడు, మన వజ్రనాభుడు, తుదకు మన భద్రనటుడు—అందరును ఆ నాటకమున కానవచ్చిరి. కాని, పాపము! శుచిముఖి లేదు.

నేను హరివంశమునే కాక పైని పేర్కొన్ననాటకమును గూడ, మన ప్రబంధమునకు మూలముగా భావించితిని.

హరివంశ విషయము నిర్వివాద్యమే. ఇక నాటక విషయము—ప్రబంధములోని చిత్రదర్శనవిషయము పురాణమున లేదు. అది యీ నాటకమున ఉన్నది. సూరన దానిని అటనుండి గ్రహించి యుండవచ్చునని భావించితిని.

నేనిందు తలపెట్టినవిషయము ప్రభావతీ ప్రద్యుమ్నము నకును, తన్మూల గ్రంథములకును గల గుణతారతమ్య నిరూపణము. అందులకై తొల్త, మూలకథలను రెండింటిని, వివరముగ, ఇంచుమించు ఆ మాటలలోనే వ్రాసి, వానికిని మన కథకును గల విరోధాంశములను చూపి, మాతృవిరుద్ధములైన ఆ రచనలవలన ఏమి గుణము సంపాదింపబడినదో నిర్ణయింతును. మూలములతో పోల్చి ప్రబంధ గుణము వెలయించుటయే ఇందలి ప్రధాన ప్రయోజనము. ప్రసక్తము లైనపుడు తక్కిన విశేషములను కొన్నిటిని తడవినను అవి ముఖ్యములు గావు.

ఇంకొక విషయము — భావనాశక్తి ప్రదర్శకమై, కల్పనాచాతురికి నిధానమైన కళాపూర్ణోదయము వ్రాసిన సూరన కించిదూనమైన యీ ప్రభావతీ ప్రద్యుమ్నము ఏల వ్రాసెను? అని యొక సందేహము. నా అభిప్రాయ మేమన, ఆదినములలో "కేవల కల్పనాకథల"కు ఆదరము తక్కువ. ప్రబంధకవులెల్లరు పౌరాణిక గాథలనే యెత్తి కావ్యములు వ్రాసి ఖ్యాతిపడయుచుండిరి. సూరనయు "సానల దీటిన జాతి రత్నము"ను ఆంధ్ర సరస్వతికి అలంకారముగా కైసేసి సమకాలికుల మెప్పు పొందవలెనని హరివంశపు గని త్రవ్వి యీ రత్నమును ఎత్తెను. మరియు నంది తిమ్మనార్యుని పారిజాతాపహరణము కూడ సూరన రచనకు ప్రేరకమై యుండును. పారిజాతాపహరణ కథను తిమ్మన హరివంశమునుండియే

కై కొనెను. కనుక సమకాలాదరముకొరకే సూరన యీ కావ్యమును రచించియుండును. చేమకూరి వెంకన్నవలె పింగళి సూరన్నయు "ఏగతి రచియించిరేని సమకాలము వారలు మెచ్చరే కదా!" యని చిడిముడి పడెనేమో?

సమకాలమువారినే యననేల? ఈ కాలమువారిలో నైనను సూరననుమెచ్చినవారు అల్పసంఖ్యాకులు. మెచ్చనివారు. మెచ్చలేనివారనుటతప్పుకాదు. ఆ మహాకవియెడ లోకమునకు ఇప్పుడిప్పుడే భక్తిగౌరవములు కల్గుచున్నవి. శ్రీరామలింగారెడ్డి కవిత్వతత్త్వవిచారమే సూరనార్యుని భారతికి సమర్పింపబడిన ప్రథమోపహారము. నాయీ చిన్నవ్యాసము కూడ తత్పాద పీఠమున ఒక దళమగుగాక.

హరివంశమునందలి కథ

వజ్రనాభుడను మహాసురుడొకడు మేరుపర్వతసానువున తపమాచరించి బ్రహ్మను మెప్పించి అతనివలన అమరావధ్యత్వమును, సర్వాత్మమయమై శతశాఖానగర పరివృత్తమై తనయాజ్ఞ లేక యితరులకు అప్రవేశమైన వజ్రపురమును, వరదానములుగ గ్రహించెను. వరదర్పితుడైన ఆదానవనాథుకుడు దేవలోకమున కేగి మహేంద్రునితో "పాకశాసనా! ఈత్రైలోక్యమును శాసింపవలెనని నాకు ఇచ్ఛగలదు. నీప్రభుత్వమును నాకిమ్ము. లేనా యుద్ధమిమ్ము. కాశ్యపులమైన మనకు ఈజగమంతయు సామాన్యముగాదా!" యని గద్దించి యడిగెను. ఇంద్రుడు బృహస్పతితో మంత్రాలోచన చేసి, వజ

నాభునితో "స్వామ్యుడా! మంతండ్రికశ్యపుడిపుడు సత్రదీక్షితుడై యున్నాడు. సత్రావసానమున అయ్యనఘుడు ఏది న్యాయమని యాదేశించునో యట్లు నడచుకొందము," అని బ్రతిమాలెను. దానవుడు తండ్రిపాలికేగి తనకోర్కె విన్నవింపగా ఆమహాముని "సత్రావసానమున మీసంగతి విచారించి తీర్చెదను. ఇప్పటికి ఉద్ధతిమాని నీవు వజ్రపురమునకు బొమ్ము" అని కడపివుచ్చెను.

అనంతరము సురరాజు ద్వారవతికేగి శ్రీకృష్ణునితో జరిగిన వృత్తాంతము తెల్పగా, అయ్యనఘుడు "ఇప్పుడు మా తండ్రి వసుదేవుడు అశ్వమేధదీక్షితుడై యున్నాడు. యజ్ఞము కడచనగనే వజ్రనాభ వధోపాయము విచారింతును. అతని పురము ఇతరులకు చొరరానిదట. తదుపాయము మన మిర్వురమును ఆలోచింపవలెను." అని యాతనిని వీడ్కొల్పెను.

వసుదేవ యజ్ఞసమయమున భద్రుడను నటుడొకడు ద్వారకకువచ్చి గభ్యులైన మహార్షులకు తన నాట్యవిద్యచే వినోదము కల్పించెను. వారును వానినైపుణి మెచ్చి వానికోరిన వరము లిచ్చిరి. వరదానమువలన భద్రుడు అధిక తేజశ్శాలియై, నానాద్వీపముల నాటకములాడి, ఎల్లర సంతోషపెట్టుచు, ఎడనెడ పర్వదినముల ద్వారకకు వచ్చి పోవుచుండెను.

అట, ఇంద్రుడు దేవలోక నివాసములైన హంసలంపిల్చి ఆదరించి, "పక్షివరులారా! కాశ్యపులమైన మనము సోదరులము. సోదరులైన మీతో మాకొక కార్యము కలిగినది. అది శత్రు వధాన్వితమైన మంత్రము. ఎచ్చటను నుచ్చనీక నెరవేర్పవలెను.

మీసంచారములు ఎల్లెడల అప్రతిషిద్ధములు గనుక మీరు వజ్రనాభునిపురము ప్రవేశించి యంతఃపుర వాపీవీధుల సంచరించుచుండవలెను. ఆదానవునకు పార్వతీవరదానమువలన జనించిన ప్రభావతి యను కొమార్తెకలదు. ఇప్పుడు ఆకన్నెకు స్వయంవరము జరుగుచున్నది. మీరా మెతో చెలిమి కల్గించుకొని మహాత్ముడైనప్రద్యుమ్నుని గుణరూపాదులు ఆమెకువర్ణించి చెప్పి, ఆతనియందు అనురక్త యగునట్లుచేసి, యామెసందేశము ప్రద్యుమ్నునకు ఎరిగించి, ఆతనివలన మరల ఆమెకు సందేశము కొనివచ్చి వారికిద్దరకు భావబంధము ఘటింపవలెను. ఏనాటి వృత్తాంతము ఆనాడు నాకును నాసోదరుడగు శ్రీకృష్ణునకును ఎరిగించుచుండవలెను. ప్రద్యుమ్నుడు ఆ యువతిని గ్రహించు వరకు ఈయత్నమున ఏమరియుండరాదు. ఆరాక్షసుడు దేవతలకు అవధ్యుడు. దేవపుత్రులైన ప్రద్యుమ్న ప్రముఖులు భద్రనట వ్యాజమున వజ్రపురము సొచ్చి ఆదానవుని నాశముచేయగలరు. మరియు కాలోచితమైన యేయే యత్నము ఆవశ్యకమో యదియెల్ల నెరపి దేవకార్యమునుసాధింపవలయును". అని ఆదేశించి పంపెను.

ఇంద్రునిముదల గైకొని హంసలు వజ్రపురికి పోయి కేళి దీర్ఘికల విహరింపదొడగెను. వాని సంచారములు వజ్రనాభునకు ప్రీతిజనకములు కాగా ఆతడు వానిని ఆదరించి అంతఃపురమున ప్రవేశపెట్టించెను. అవియు అచట ఎల్లరతోడను చెలిమి కలిగించుకొని చక్కని కథలుచెప్పుచు అంతఃపురస్త్రీలకు ఆదర

పాత్రములయ్యెను. వానిలో శుచిముఖ యను హంసి ప్రభావతికి కూర్మిసఖియై, యొకనాడు ఏకాంతమున పరిసంగము తిగిచి యాకన్యతో "ప్రభావతీ! నీవు త్రిలోకసుందరివి. స్వయంవర స్వస్తవయ్యె దేవాసురకులోద్భవుల నెవ్వరిని మెచ్చకున్నావు. వారు నీచే ప్రత్యాఖ్యాతులై సిగ్గువడి పోవుచున్నారు. అట్టిచో రుక్మిణీసుతుడైన ప్రద్యుమ్నుడు మాత్రము ఏల రాదలచును? అతనిగుణరూపశౌర్యములు అనుపమానములు. అతడు దివ్యులలో దివ్యుడు. మనుష్యులలో మనుష్యుడు. దానవులలో దానవుడు. సూర్యతేజము, అగ్నిరుచి, పృథివీక్షమ, ప్రహదగాంభీర్యము, అతనియొకనియందేయున్నవి." అని వాచ్చరించెను. ప్రభావతి ఆమాటయాలించి "హంసీ! మానుషలోకస్థుడగు విష్ణుని గూర్చి నేనును కొంతవినియున్నాను. అతడు మాదానవకులమునకువైరి. దనుజవీరులు ఎందరో అతనిచే హతులైరి. అయినను పుట్టినింటివారికంటె అత్తింటి వారు అధికులుగ ఉండవలెనని స్త్రీలకోర్కి. నేను యాదవుల కోడల నైతినేని యదృష్టము కాదా! ఆ ప్రద్యుమ్నుడు ఇచటికి రాగల్గునేని నాయెడ అనుగ్రహము చేసినట్లగును. మాకులము కూడ పవిత్రమగును. అతని జన్మాదికథనము నేను ఈవరకే వినియున్నాను. నాహృదయమెప్పుడును అవశమై యతనిదెసనే వర్తించుచుండును. నేను అతని వరింతును. నీకు మొ్రక్కెదను. నన్ను అనుగ్రహించి దూతివై యతనిపాలికి పోయి నామీద దయపుట్టులికి తోడ్కొనిరమ్ము. నీవు విద్యాంసురాలవు. అతని

రప్పించుభారము నీయది." అని మానసిచ్చి మాటలాడి వేడు కొనెను.

అంత శుచిముఖి "నేను నీచెప్పినట్లు చేయుదును. ప్రద్యుమ్ను నెడ నీకు గల భక్త్యాదారత ఆతనికి నివేదింతును. నిన్ను సాక్షాత్కార్యముచేసెదను. కాని నీవు మాత్రము మీతండ్రికోనాటకగలకథాకుశలతను ఉగ్గడింపవలెను. నాయెడ ఆతనికి మమత్వము కలుగుట లెస్స." అని తెల్ప, ప్రభావతియు అట్లచేయ, దానవాధిపుడు శుచిముఖిని చేరబిల్చి, "హంసీ! నీవు కథాకథన ప్రవీణ అని మా ప్రభావతి తెల్పెను. నీవు త్రిలోక సంచారిణివిగదా! ఎచ్చటనేని గొప్ప వింతలు గంటివా? తెల్పుము" అనియడుగ, శుచిముఖి భద్రునిగూర్చి మిక్కిలిగాకొనియాడి, యతనినాట్యకుశలతను, విశేషించి వివిధ విద్యావేత్తృతను ఉగ్గడించి, అతని యెడ రాక్షసరాజునకు కుతూహలము పుట్టించెను. అంతవజ్రనాభుడు "ఔనౌను! నేనును వింటిని. వానిని చూడవలెనని నాకిదివరకే వేడుక కలదు. అతడు ఇచటికివచ్చు వెరవుచూడుము" అనెను హంస "చిత్త"మని సెలవు గైకొనిపోయిఇంద్రోపేంద్రులతో ఇచ్చటివృత్తాంతమువిన్నవింప, వాసుదేవుడు వజ్రనాభవధకును ప్రభావతీ సంసర్గమునకును ప్రద్యుమ్ను నియోగించి, గదసాంబులను, మరికొందరు యాదవులను తోడిచ్చి, భద్రనటుని జతజేసి నటవేషములతో అందరిని వజ్రపురికిపంపెను. వారును వజ్రపురశాఖానగరమగు సుపురము చేరిరి. శాఖానగరవాసులైన దానవులు తమ ప్రభునానతిని

నటులకు ఆతిథ్యాదిసత్కారము లాచరించి విడిదియొసగి, శ్రుత పూర్వుడైన భద్రుడు వచ్చెనని వేడ్కపడి, బహువిధనాటకము లాడించి మెచ్చి నానావిధ బహుమానము లిచ్చిరి. రావణ వధేప్సచే మహావిష్ణువు అవతరించుట యాదిగా రామాయణగాథ యంతయు ప్రదర్శింపబడగా, తత్కాల వాసులైన వృద్ధదానవులు పాత్రల తుల్యత్వమునకు విస్మయపడిరి. అనంతరము వజ్రనాభుడు మేళమును వజ్రపురికి పిలిపించి నాటకము లాడించెను. పటాంతరితలై యంతఃపుర స్త్రీలును నాటకములు చూడవచ్చిరి, ప్రద్యుమ్నుడు ప్రయోగించిన నృత్తగీతవాద్యాది విశేషములకును 'రంభాభిసరణము' అనెడి నాటకమునకును దానవ నాయకుడు పరమసంతుష్టుడై, కనకరత్నమయములయిన పెక్కు వస్తువులు వారికి కానుకలిచ్చెను.

అంత శుచిముఖి ప్రభావతిని చేరబోయి "రాజపుత్రి ద్వారవతికేగి వచ్చితిని. ప్రద్యుమ్ను నెడ నీకు గల భక్త్యనురాగములు తెల్పితిని. అతనికి నీయందు అనురాగముదయించెను. అతడు నేటిరాత్రి నీ యున్నయెడకు రాగలడు" అని చెప్పెను. ప్రభావతి సంతోషతరంగిత చిత్తయై "శుచిముఖీ! నీవు నేడు నాతో నుండుము. నిన్ను చెంతనిడికొనియే కేశవపుత్రు దర్శింపగలను గాని లేనిచో నాకు భయమగును" అని వేడికొనెను. హంసియు జటబడి ప్రద్యుమ్నుపాలికేగి సంకేత మెరిగించి వచ్చి ప్రభావతిని జేరి యతని రాక నిరీక్షించుచుండెను.

ప్రద్యుమ్నుడు, ప్రభావతికి చెలికత్తెలు కొని పోవు పుష్పమాల్యమున భ్రమరాకారుడై ప్రవేశించి అంతిపురి చేరి ప్రభావతీ కర్ణోత్పలమున అణగియుండెను. అంతలో చంద్రోదయ మగుటయు, రాజపుత్రికి విరహము దుస్సహమై వల్లభు నుపేక్షించి విలపింప దొడగెను.

అంతట ప్రభావతియెడ విశ్వాసము కుదిరి, నిజరూపమున ప్రద్యుమ్నుడు ఆమె మ్రోల తోచి నిల్చి, లజ్జావనత వదనయైన ఆ ముగుదను లాలించి కైదండగూర్చి గాంధర్వవిధిని పరిగ్రహించెను. అతడు రాత్రుల కన్యాంతిపురమునుండి రహస్య భంగ భయమున తెల్లవారక మున్నే విడిది చేరుచుండెను.

ఇట్లుండ వజ్రనాభుని తమ్ముడగు సునాభుని కూతుండ్రు, చంద్రవతీగుణవతుల నెడి కన్నెలు, ఒకనాడు ప్రభావతీప్రద్యుమ్ను-లను ఏకాంతమునచూచి అనుమానించి నమ్మకముగా ఆవివరము అడుగ ప్రభావతి యిట్లనెను:- "నేను అపూర్వమైన యొకవిద్య యెరుగుదును. దానిప్రభావమున నాకు అభిమతభర్తృసమాగమ మైనది. ఆతడు దేవత పురుషుడు, త్రిలోకసుందరుడు, సత్య సంపన్నుడు, ధర్మశీలుడు, వలయునేని చూడుడు" అని వారికి ప్రద్యుమ్న దర్శనము చేయించెను. ఆ కన్నెలు ఆతని రూప యౌవన సంపద చూచి విస్మితలైరి. వారి విస్మయ భావమును గనిపట్టి ప్రభావతి మరల ఇట్లనెను:- "దేవతలు ధర్మపరతులు, తపశ్శక్తులు, సత్యశీలురు. మీకును నావలెనే దివ్యపురుషుల

వరించి సుఖింపుడు, నావిద్య మీకును ఉపదేశించెదను" అని వారిని ఒడబరిచి యీవిషయము వజ్రనాభునకు నివేదింప, అతడు గదసాంబుల తోడ్కొనివచ్చి సునాభపుత్రికలనిచ్చి గాంధర్వ వివాహములు సేయించెను. ఆ రీతిగా యదుకుమారులు కన్యాంతఃపుర భోగముల అనుభవించుచు వజ్రనాభ వధార్థము శక్రకేశవుల ఆదేశమునకు ఎదురు చూచుచుండిరి.

కశ్యపుని యజ్ఞము ముగియుటయు, వజ్రనాభుడు త్రైలోక్య విజయాకాంక్షియై ఆ మునిపతిని సందర్శింప అయ్యనఘు డిట్లనియెను:- "నీవు స్వజనసమావృతుడవై వజ్రపురముననే యుండుము. ఇంద్రుడు నీకు అజయ్యుడు. అతడు తపోఽధికుడు, బ్రహ్మణ్యుడు, కృతజ్ఞుడు. నీకు జ్యేష్ఠుడు, త్రిజగములకు రాజు. విశేషించి కృష్ణునకు పాత్రభూతుడు. ఏల కుడిచి కూర్చుండి, రిత్తకు రిత్త, సర్పమును త్రొక్కి ప్రాణముల మీదికి తెచ్చుకొందువు? పొమ్ము. నామాటవిని నిరుపద్రవముగా బ్రదుకుము. పొమ్ము"అన వజ్రనాభుడు ఆ హితవాక్యముల దెప అనాదరముచేసి విజయారంభుడై జ్ఞాతియోధులను మిత్రులను కూర్చుకొని స్వర్గము మీదికి దండెత్తి నడవ ఉద్యుక్తుడాయెను. ఆలోగా ఇంద్రకేశవులు రాక్షసేంద్రవధను గూర్చి కుమారులకు హంసలముఖమున కబురంపిరి. వారును తమంత కూడికొని మంత్రాలోచనచేసి "వజ్రనాభుని ప్రద్యుమ్నుడే కడతేర్పవలె"నని నిర్ధారించుకొనిరి. కాని వారి భార్యలు మువ్వురును ఆపన్నసత్వలై యుండిరి. అది యుద్ధానుకూల సమయమగునా?

యనిసందేహించి కొమారులు మరలహంసలను శక్రకేశవులకడకు పనుప వారు సందేహము తీర్చి యుభయ వాక్యములు పల్కిరి.

దానవ పుత్రికలు ప్రసవించిరి. ముప్పొరకును మగపిల్లలే కలిగి సద్యోయౌవనులై హర్మ్యపృష్ఠమున వర్ధమానులగుచుండ, ఆకాశరక్షులగు దైత్యభటులుచూచి ససంభ్రములై వజ్రనాభునకు ఎఱిగింప, అతడు అవమానకరమ్మని గృహాధ్యక్షుల బట్టి బంధించి చంపుడని యానతిచ్చెను. ప్రభు నానతిని సేనలు కూడికొని నలుదెసల మూగి, పట్టుడు, కొట్టుడు, చంపుడు అని యార్చుచు అంతఃపురము చేరరాగా దనుజపుత్రికలు భయ చకితలై ఆక్రోశింప దొడగిరి. ప్రద్యుమ్నుడు సన్నాహితుడై యుభయవాక్యముల వారిని ఓదార్చి ప్రభావతితో ఇట్లనియెను:- "దేవీ! అటుచూడుము. నీతండ్రియు పినతండ్రియు జ్ఞాతులును యుద్ధకాములై వచ్చి నిల్చిరి. వారెల్లరు నీకు పూజ్యులు, మాన్యులు. మమ్ము చంపు నుద్దేశమున వచ్చిరి. ఇది దారుణముహూర్తము. మరణము సరకుగొనక పోరాడ వలెను. మాకిపుడు కర్తవ్యమేమి? నీ చెల్లెండ్రగూడ అడిగి విచారించి చెప్పుము." అన, ప్రభావతి శిరమున అంజలి ఘటించి భర్తృపాదములకడ మోకరిల్లి కన్నీరు నించుచు "ఓ శత్రునిబర్హణా! శస్త్రము గ్రహింపుము. ఆత్మరక్షణము గావించు కొనుము ఆర్యవైదర్భిని తలచియు, మహారు అనిరుద్ధుని తలచియు ఆత్మ రక్షణము గావించుకొనుము. ధీమంతుడైన దుర్వాసుని నైధవ్యగాహిత్యమును

జీవత్పుత్రిత్వమును నాకు వరములుగా ఇచ్చెను. ఆ వర వాక్యమే నన్ను ఊరడించుచున్నది. సూర్యాగ్ని తేజుడగు ఆమహాముని మాట యన్యథాకానేర" దని హెచ్చరించి ఖడ్గమును తెచ్చి యతని చేతికిచ్చి 'జయింపు' మని దీవించి పంపెను. అట్లే చంద్రవతి గుణవతులుగూడ ఖడ్గములు తెచ్చి గదసాంబులకు ఒసగిరి.

ప్రద్యుమ్నుడు మాయాప్రభావమున ఒక రథము కల్పించుకొని, గదసాంబుల అంతఃపురరక్షణకు నిలిపి, తాను ఆకాశమున సర్వదిశల పోరువాడై యసురసైన్య వధార్థము వెల్వడి యాశీవిష ప్రఖ్యములైన శరములచే దితిసంభవుల విదళించెను. వారును రణమత్తులై కృష్ణనందను ముట్టిరి. దేవగణ సహితుడైన దేవేంద్రుడు అంతరిక్షగతుడై ఆయుద్ధము చూచి మెచ్చి మాతలిసుతసారథికమైన తన రథమును గదునకును, ఐరావతమును సాంబునకును పంపెను. ప్రద్యుమ్నసహాయార్థము జయంతుండును వచ్చెను. ఇరువాగును రేయెల్ల పోరిరి. దానవ సేనలో మూడువంతులు నాశమయ్యెను.

సూర్యోదయ వేళకు గరుడవాహనుడై కృష్ణుడును చేరవచ్చి, అంతరిక్షమున ఇంద్రుసమీపమున నిల్చి పాంచజన్యమును పూరింపగా, కుమారుడు అతనిని పితృ సన్నిధికేగి నమస్కరించెను. మురారి "ఈ గరుడు నధిరోహించి నీవు వజ్రనాభుని గూల్పుము" అని బరవసము సేయ, అతడును, అట్లుచేసి,

గదచే రాక్షసేశ్వరు వ్రేసెను. వాడును మూర్ఛపడిలేచి శతఘంటికమైన గద చేకొని ప్రద్యుమ్నుని వ్రేయు ఆతడు నెత్తురు ఉమల నేలబడెను. ఆశ్వాసకరముగా కృష్ణుడు పాంచజన్యము ఒత్తుటయు, కుమారుడు లబ్ధసంజ్ఞుడై పితృప్రేషితమైన చక్రమున దైత్యుని శిరము నరకెను.

అప్పుడే గదుడు సునాభుని కడతేర్చెను; సాంబుడు తక్కటిమూకల పోరిగొనెను. కృష్ణకేశవులు భూమికి అవతరించి పుత్రుల అభినందించి, వజ్రనాభు రాజ్యమును పౌత్రులకు పంచి యిచ్చి, అవసరోచితముగైన వరములొసగి చనిరి. ప్రద్యుమ్నాదులు ఆరుమాసములు ఆపురమున యుండి రాజ్యము రూఢము చేసి ద్వారకకు చనిరి.

ప్రద్యుమ్నాభ్యుదయమునందలి కథ.

బ్రహ్మర్షియైన నారదుడు ఒకనాడు శ్రీకృష్ణ దర్శనార్థము ద్వారకకు ఏగెను. పరస్పర కుశల ప్రశ్నానంతరము కృష్ణుడు నారదుని ఆగమనకారణము అడుగగా ఆమునీంద్రుడు

"మహాభాగా! వసుదేవవితన్యమానాశ్వమేధ మహోత్సవధురంధరుండవైన నీ దర్శనమే నా రాకకు ప్రథమ కారణము. మరియు, అఖండభుజశౌండీర్య కుంఠితాఖండల సజ్జుడైన వజ్రనాభుడను దానవపతి కనకగిరి కటకమున చిరకాలము తపముచేసి, తత్స్పర్ధచే పితామహుని సంతోషపెట్టి, ఆ యనఘువలన అమరావధ్యత లోనగు

వరములు పొంది, ద్విగుణిత మదాంధకారిత హృదయుడై త్రిభువనములకు పీడ గావించుచుండెను. ఆవృత్తాంతము దేవరకు మనవిచేయుటలెంపు రెండవకారణము" అనివిన్నవించెను.

కృష్ణుడు వజ్రనాభవృత్తాంతము మున్నె దేవేంద్రుని వలన విన్న వాడగుట నారదునితో "దేవర్షి! ఈవృత్తాంతము భగవంతుడైన దేవేంద్రుడు వచ్చి నాకు ఇంతకు పూర్వమే చెప్పెను. నేనును దురాత్ముడైన ఆ సురద్వేషినిరసనమున కృత నిశ్చయుడనైతిని. అయ్యా, మాతండ్రిగారు చేయుచున్న అశ్వమేధమువలన ఇన్నినాళ్లునువిలంబమైనది. ఆక్రతువు కూడ ఆసన్నావభృథమయ్యెను. కాన యజ్ఞావసానమే దానవ హాతకుని జీవితావసానము కాగలదు. ఇంత యేల? ప్రద్యుమ్నకుమారుడే అచిరకాలమున ఆ వజ్రనాభుని యుద్ధమున కూల్చి తదవరోధనితంబినీ బాష్పాంబులచే జగత్త్రితయతాపము ఆర్పగలడు" అని తెల్పెను. నారదుండు ప్రముదితచిత్తుడై "భవదాత్మజన్ముడైన శంబరమథనునకు ఏది దుష్కరము? అదియును గాక ఇందు ఇంకొక ప్రయోజనము కూడ కలదు. ఆదానవపతికి ప్రభావతి యను పుత్రిక కలదు. ఆ కన్యారత్నము సౌందర్యనిధి. ఆమెను తజ్జనని పార్వతీవర దానము వలన కనెను. ఆ కన్యను చెట్టపట్టువాడు నిరవధిక కాలము జీవించుననియు ఆమెయు జీవత్పుత్రికగు ననియు దుర్వాసుని మాట కలదు. ఆప్రభావతి యిప్పుడు నవ యౌవనోదయ విశేష రమణీయయై తండ్రిచే స్వయంవర

స్థాపింపనై, స్వయంవరా గతులైన యువజనుల నెవ్వరిని మెచ్చక యున్నది. సకల లోకాతిశాయి సౌందర్య సంపన్నుడైన ప్రద్యుమ్నుడు వజ్రపురమునకు పోవుచో ఆతనియందు ఆమె మనసు లగ్నమగు" నని సూచించి, యిచ్చటి యత్నము దేవలోకము వారికి తెల్పుటకై యటకేగెను.

సకల దుష్ప్రవేశమైన వజ్రపురమును ప్రద్యుమ్నుడు ప్రవేశించుట యెట్లని కృష్ణుడు విచారించి, వసుదేవ యజ్ఞ కాలమున నాట్య ప్రయోగములు నెరపి మునిజనసంఘము వలన సర్వప్రదేశాప్రతిహతప్రవేశాది వరములు వడసియున్న భద్రుడను నటుని ముఖముననే యీదుర్ఘటకార్యము సాధనీయ మని నిశ్చయించి, వానిపిలిపించి వజ్రనాభవధోపాయాత్మకమైన తమ కార్యము వాని కెరిగించి తంత్రోపాయమును ఉపదేశించెను. వాడును జగత్పతి తనను స్వయముగా పిలిపించి మహాకార్య నిర్వహణమున నియోగించుట తన పూర్వ పుణ్యఫల మనుకొని సంతసించెను.

భద్రుడను నటుడు నిస్సామాన్య విద్యా విభవుడని హంసుడను చారణపతి వలన విని వజ్రనాభుడు ఆకుశీలవుని చూడ కుతూహల పడెను. ఇంతలో అతడును దేశదేశములు తిరుగుచు వజ్రపుర శాఖానగరమునకు వచ్చి రామాయణ కథానుబంధినాటక ప్రయోగముల వలన అచటి దానవులు సంతోషపెట్టెను. సమీపనగరపౌరుడగు ఆతని వృత్తాంతము విని వజ్రనాభుడు ఆతని రప్పించి సత్కరించి ప్రభావతికి సంగీత

విద్యాగురువుగా నియమించెను. ఆ కన్యయు గానకళాభి యోగమున అసదృశస్థై గురుజనామోదము పొందుచుండెను.

ప్రభావతి చెలికత్తె కలహంసిక యను చేటి భద్రుడు విడిసియున్న చోట అతివిస్మయకారణమగు నొక చిత్రపటమును చూచి, దానిని హరించుకొని పరుగు పరుగున ప్రభావతిని చేరి యా చిత్రమును చూపెను; అది యేమహాభాగుని ప్రతిబింబమో, ఎవరు వ్రాసినదో తెలియగోరి ప్రభావతిభద్రనటుని పిలిపించెను.

ఆ చిత్రపటము భద్రుడు వ్రాసినదే. అందలి ప్రతిబింబము ప్రద్యుమ్నునిదే. ప్రద్యుమ్నుని రూపాతిశయము ప్రభావతి కంటబడెనని, ఆ యువతి ఆ మన్మథావతారుని యందు బద్ధానురాగ యగుననియు ప్రసంగావసరముల తాను ఆమె భావమును పోషింపవచ్చుననియు ఎంచి భద్రుడుఆయుపాయము పన్నెను అనుట యూహామాత్త్రమే లేదు. ఆచిత్రము చూచినతోడనే ప్రభావతికి మనసు చెదరెను. కాని యది వాస్తవరచనయో బుద్ధికల్పితమో అరయవలెననియే గురుని పిలిపించుట. భద్రుడు వజ్రపురమును ప్రవేశించుటయే గద సాంబ సహితుడైన ప్రద్యుమ్నుని ప్రవేశము. అతిసుపరిగృహీత శైలూషవేషుడై సపరివారముగ భద్రునిమేళమున ఉండెను. సఖీసమేతయై ప్రమదవనమున ఉన్న రాజపుత్రిని సమీపించి భద్రుడు ఆశీర్వదించి కూర్చుండ, కలహంసిక మెల్లగా ప్రసంగము తిగిచి "ఆర్యా! త్రిభువన సంచారివగు నీకు

తెలియరాని సంగతులుండవు. ఎచటనేని నిస్సామాన్యరూప గుణముగల ఆకృతివిశేషముకంటివా?' యని ప్రశ్నింప ప్రద్యుమ్ననామగుణకీర్తనలను సమయితానరయము కల్లెగదా యని సంతోషించి, యతడు ప్రద్యుమ్నుని కులగోత్రాదికమును సౌందర్య శౌర్యాదులను వర్ణించెను. ప్రభావతి ప్రద్యుమ్నుని గూర్చి ఆవరకే అభిరూపయువప్రసంగముల వేళ వృద్ధస్త్రీల వలన విని యుండుటవలన, భద్రుని వర్ణనకును ఆ వినికిని పొత్తు కలిపి యేమేమో భావించుకొనుచు, ఒకవిధమైన దశావిశేషము అనుభవించుచుండెను. పరేంగితాకారజ్ఞుడైన భద్రుడు అనుకూల వచనరచనా దోహదంబున ఆ రాగాంకురము పోషించు ప్రసంగము చేసెను. అంత ప్రభావతిచే ఆదేశింపబడి, కలహంసిక తొల్లిటి చిత్రపటమునుజూపి "అతడిట్లుండు నా"యని ప్రశ్నింప భద్రుడు, కార్యము ఫలించినదని లోలోన ఉప్పొంగి ప్రతిబింబము ఆకుమారుని దేయని తెల్పెను. ప్రభావతికి ఆతని సాక్షాత్తు దర్శింప కుతూహలము ఇనుమడించెను, భద్రుడు తన విద్యాప్రభావమున ప్రద్యుమ్నుని అనతికాలముననే తెచ్చి దగ్గర నిప్పించెదనని ఆ యువతికి మాట యిచ్చెను.

దనుజరాజకన్య ప్రద్యుమ్నునందు బద్ధభావయై దుస్సహమైన కామదశ ననుభవించుచు తన, మనస్సు సంగీత గురునకు విన్నవించెను. అతడును వజ్రపురవృత్తాంతమును గగనపథ సంచారులచేత శ్రీకృష్ణునకు తెలియనంపెను.

పిదప వసంతాగమము కాగా, వజ్రనాభుడు వసంతోత్సవము చేయువాడై ఏదేని యొక నాటకము ప్రదర్శింపుమని భద్రుని కోరగా అతడు ప్రస్తుత కార్యమునకు ఉపయోగ్యమైన "రంభాభిసరణము" అను నాటకమును సంకల్పించి, అందు ప్రద్యుమ్నుడు నలకూబర వేషము వేయుటయు తాను విదూషకుడగుటయు మనోవతియును శైలూషి రంభయగుటయు తగునని యేర్పరచికొనెను.

"రంభాభిసరణ" నాటకవస్తువు అనతివిస్తీర్ణము. నలకూబరుడు విదూషక సహితముగ చైత్రరథ సంభూతమైన సంకేత లతామండపము చేరి రంభరాకను నిరీక్షించుచుండెను. ప్రియ సమాగమ కాంక్షిణియై వచ్చు రంభను రావణుడు చూచి తరుముకొని రాగా, ఆ చకితాక్షి ఉపాయముగా తప్పించుకొని భయవిహ్వలయై సంభ్రమమున వచ్చి నలకూబరు నక్కున వ్రాలెను. అతడు తద్భయకారణము కని, క్రోధ వివశుడై రావణు నుద్దేశించి "భోగేచ్ఛుడవై అనురక్తకాని స్త్రీని ఎప్పుడు బలవంతము సేయుదువో యప్పుడు నీశిరము శతధాభిన్నమై పుడమిని పడుగాక", యని శాపోదకము విడిచెను పిమ్మట. ప్రియు లిర్వురు నొండొరు కౌగిలించుకొని రసానందమున తేలిరి.

—

ఈ నాటక ప్రదర్శనమునకు ప్రభావతియు సఖీసమేతయై వచ్చి ప్రేక్షణక మండపమున నుండి చూచుచుండెను. నలకూబర వేషమున నున్న ప్రద్యుమ్నుని సఖీజనోపదేశము వలన

ఆమె గ్రహించెను. భద్రనటోపదేశమున ప్రద్యుమ్నుడును ఆమెను గుర్తించెను.

ఆతని రూపమును తదనుగుణమగు విద్యాచాతురియు కనుల చూచుచుండిన ప్రభావతికి ఉత్కంఠ పెరిగి, యతడు తన కెట్లు లభ్యుడగునో యని సందేహింప కలహంసిక, భద్రనటుడు "తన విద్యా ప్రభావమున ప్రద్యుమ్నుని తెప్పించెద"నన్న వాక్యము స్మృతికి దెచ్చి శంకానివృత్తి చేసెను.

ప్రభావతి ఉద్యానమున మదనోత్సవము సేయుచుండ, భద్రనటుడు ప్రద్యుమ్నుని తోడ్కొనివచ్చి వారికి పరస్పర ప్రత్యక్షాలోకన సుఖము సంఘటించి, మరియొకప్పుడు ఆయుద్యానముననే సంకేతస్థానమునకు వచ్చెదనని చెప్పి ప్రద్యుమ్నుని తోడ్కొనిపోయెను. ఆయువతియొకనాడు ప్రియుని రాకకై సంకేతమున సఖీసమేతయై వేచియుండ, భద్రుడు ప్రద్యుమ్నుని తోడ్కొనివచ్చెను. ఆ సుముహూర్తముననే మన్మథ సాక్షికముగ వారికి గాంధర్వ వివాహమయ్యెను. వజ్రనాభుని తమ్ముని కూతుళ్ళగు చంద్రవతీ గుణవతులకు గదసాంబులు భర్తలైరి.

ఇక వజ్రనాభుని వధయే అవశిష్టము. అతడును స్వర్గవిజయ యత్నములు సలుపుచుండెను. "ఆదానవు డెప్పుడు సురలోక విజయోద్యోగియగునో, యప్పుడు కుమారులు ఆతని వధింపవలె"నను కృష్ణుని యాదేశము కలదు గనుక, ప్రద్యుమ్నుడు సహాయకరుడై ప్రకట సంచారుడై వర్తింప దొడ-

గెను. అంతఃపుర రక్షకులు అతని కనిపట్టి వజ్రనాభునితో విన్నవింప వాని నిగ్రహించుటకు రాక్షసరాజు సేనల పంపెను. వారెల్లరు ప్రద్యుమ్నుచే మడిసిరి. అంత వజ్రనాభుడే యుద్ధమునకు దిగెను. వారికిరువురకును ద్వంద్వ సంప్రహారము జరిగెను. ఒకరికి ఒకరు తీసిపోక పోరాడుచుండ సునాభుడు అన్నకు సాయముగ రాగా, గదుడు ప్రద్యుమ్నునకు తోడువచ్చెను. ఆవల సాంబుడు దానవ సైన్యముల చెండాడసాగెను. ప్రద్యుమ్నుడు వజ్రనాభుని సుదర్శనాస్త్రమున త్రెళ్ళవేసెను. సునాభుని శిరము గదుడు ఖండించెను. సైనికులందరును హతులైరి. అంత దేవతలు పుష్ప వృష్టి కురిసిరి.

ఈ యుద్ధమును శ్రీకృష్ణుడు నారద సహితుడై, ఆకాశమున నిల్చిచూచుచుండెను. తుదకు కుమార విజయమునకు సంతసించి వారి నాశీర్వదించి యభినందింప కృష్ణుడు భూమికి అవతరణము చేసెను. కుమారులును ప్రత్యుద్గతులై నమస్కరించిరి. ఆ సంతోష సమయముననే ప్రభావతి చంద్రవతీ గుణవతులకు కుమారులు జన్మించిరని వార్త వచ్చెను. సంపదలు సానుబంధములు గదా! అంత వజ్రపురమునకు ప్రద్యుమ్నుడు అభిషిక్తుడయ్యెను.

హరివంశమే యీనాటకమునకు మూలమనుటకు ఇంచుకయు సందేహము లేదు. హరివంశములోనివే కొన్ని శ్లోకములు ఈనాటకమున గలవు. అంతకంటె వేరుపదర్శన మేల?

ప్రాయికముగా పురాణగాథలు విషయప్రధానములును ధర్మోపదేశకములును అగుటచేత వానియందు కావ్యతా గుణము కొంత వరకు కొరవడియుండుట సహజము. అందును తత్కథలయందు కొన్నిట అంగప్రత్యంగభావము బొత్తుగా నుండదు. అందుచేతనే యెన్నో అసమంజసములు అసందర్భ-ములు దొరలుచుండును. కావ్యవిమర్శ సూత్రముల పురస్క-రించుకొని పురాణగాథలను పరామర్శించుట వ్యర్థ ప్రయత్నమే యగును. అట్లని వానిలో కవిత్వము ఉండదని కాని, రసము శూన్యమని కాని అనుకొనరాదు. ముఖ్యముగా అసంగతములగు విషయములు మెండుగా ఉండుననియు, వస్తుసన్నివేశము నిబిడముగా ఉండదనియు అంగీకరింపవలెను.

సంస్కృత పురాణేతిహాసములను భాషాంతరీకరించిన తెలుగు కవులు, మూలముల యందలి అనౌచిత్యములను పరిహరించియు సంస్కరించియు తమ గ్రంథముల ఉచితరీతిని రచించిరి కనుకనే, వారు కేవలాను-వాదకులు కాక స్వతంత్రు లనిపించుకొనిరి. అందును, ఔచితీ సంపాదనము కవిత్రయము వారికి ప్రథమ లక్ష్యము. వారితోను కవిబ్రహ్మ రచనకు అది జీవగఱ్ఱ. శ్రీహర్షు నంతవాని నైషధ చరిత్రమను ప్రసిద్ధ కావ్యమును తెనిగించుచు, శ్రీనాథుడు "ఔచిత్యం బాదరించియు ననౌచిత్యంబు పరిహరించియు" శృంగార నైషధమును వ్రాయ సాహసింపగా, అంతకంటెను

ఎక్కువ యసందర్భములు గల పురాణేతిహాసములు తెనిగించు మనకవులు వానిని పరిహరింప సాహసింపజాలరా?

హరివంశమునందలి ప్రస్తుత కథలో అట్టి యసంగతము లుండుట వింతకాదు. అందు,

మొదటిది:- వజ్రనాభ వధకును ప్రభావతీ ప్రద్యుమ్నుల వివాహమునకును ఏమిసంబధము? వారి వివాహమగుచో నీవి వధ జరిగి తీరవలెనని కాని, నీవివధ జరుగుచో వారి వివాహము జరిగి తీరవలెనని కాని యేమేని కార్యకారణ యోగమున్నదా? అతని యాజ్ఞలేక తత్పురము ప్రవేశింపరాదు గనుక ప్రద్యుమ్నుడు నటరూపుడై యతనిచే ఆహూతుడయియే ప్రవేశింపవలెను, సరే. ప్రవేశము కల్గిన పిమ్మట అతడు దానవ పతిని మార్గాంతరమున జయించుటకు ఆటంకము ఏమియుండును? ప్రభావతిని పెండ్లి యాడనిచో ఆ వధ జరగదా? పురాణమున ఇది ప్రథమ సందేహపదము.

రెండవది :- గదసాంబులకు చంద్రవతీ గుణవతులను గూర్చి ఏమియు తెలియదు. వారు ప్రద్యుమ్నుని వలె కన్యాసంసర్గాపేక్షచే వజ్రపురమునకు వచ్చిన వారు కారు. అట్టి వారికి, అదను దొరకెగదా యని హఠాత్తుగ సునాభుని కూతుండ్రనిచ్చి ముడివేయుట బలవంతముగ కథకును కథకును ముడివేయుట.

మరికొన్ని స్వల్పవిషయములు :- ఇంద్రకేశవులు చేసిన యత్నము పరరాజ్యమును అస్తమింపజేయు కార్య తంత్రము

గదా! లేశమాత్రము ఎచ్చటనేని పొక్కినకార్యభంగమగుటయే కాక మానభంగము గూడ నగును! ఆ రహస్యమును రాజనీతి ధురంధరుడగు శ్రీకృష్ణుడు, భద్రుడను తేలికమానిసికి ఎరిగించి వాని భుజమున తత్కార్యసాధకభారము పెట్టుట యెట్లునీతి? భద్రుడు నటకుడు. ఆడియు పాడియు జీవించు నతనికి, పెట్టిన చోటులన్నియు పెండ్లియే. వానికి ఇంద్రలోకపుటెట్టి ద్వారలో వజ్రనాభుకును అట్టి ద్వారయే, వానికి శ్రీకృష్ణునెడ పక్షపాతముకల్గి తీరవలెనని లేదు ఒకవేళ అది దేవహితము కనుకను శ్రీకృష్ణుడు లోకైక పూజ్యుడు గనుకను నిర్హేతుక పక్షపాతము కల్గిన కల్గనచ్చునుగాని, ఆ సామాన్య మానవుని, ఉపధా శుద్ధుడు కాని వానిని శ్రీకృష్ణుడు నమ్మి ఆ రహస్య మెరిగింప వచ్చునా?

రెండవది :- వాసుదేవుడు వజ్రనాభవధకును ప్రభావతీ సంసర్గమునకును ప్రద్యుమ్ననియోగించి గ ద సాం బు ల ను మరికొందరి యాదవులను తోడిచ్చి భద్రనటుని జతజేసి యుండగను వజ్రపురమునకు పంపుట. వాసుదేవుడు వజ్రనాభ వధార్థము ప్రద్యుమ్ను నియోగించుట సమంజసమే కాని, ప్రభావతీ సంసర్గమునకు నియోగించుట బాగు కాదు. కాముక కృత్యములు దూతీముఖమున నడవలసినవేకాని తల్లిదండ్రుల చెవి సోక దగినవికావు. ఒకవేళ ప్రయోజనాంతరముచే వారికి ఎరుగవచ్చినను ఎరుగనట్లుండ దగువారేకాని, తామైకొడుకును ప్రేరేచ తగదు. ప్రభావతీ ప్రద్యుమ్నుల వివాహము మదన సాక్షికమే కాని యగ్నిసాక్షికముకాదు. కనుకనే కాముక

వ్యాపార మంటిని. ప్రభావతీ సంసర్గాపేక్ష ప్రద్యుమ్నుని వీరకృత్యో త్సాహమునకు ప్రోద్బలకమగుటచే, లభింప బోవు ఫలము మునుముందుగా ఆతనికి తెల్పుట యావశ్యకమే యగును కాని, యది కృష్ణుడు తెల్ప దగిన విషయము కాదు.

మరియు, తిర్యగ్జంతువునకు దేవ మనుష్యత్వము ఆరోపించుట, ప్రద్యుమ్నునకు పల్పదాకార ధారణాది నిపుణత కల్పించుట, మొదలగునవికూడ కొందరు ఆక్షేపింప వచ్చును. అవన్నియు అలౌకికాద్భుతములు. మన గ్రంథము లన్నియు తాదృశ చరిత్రలతో నిండియే యుండును. ప్రపంచమున ఏసారస్వతమునందైనను అట్టి యద్భుతములు కొన్ని వర్ణింపబడియే యుండును. వానిని తుడిచివేయు వలెననుట తగదు. తుడిచివేయుట పొసగదు.

ఈకథను నాటకీకరణ మొనర్చిన రవివర్మ భూపుడు తన రచనలో చేసినమార్పులు పైని పేర్కొన్న లోపములలో ఒక్క దానినైన సవరింప జాలవు.

ఆ కవి చేసిన ప్రధాన సంస్కారము శుచిముఖీపాత్రను తీసివైచుట, తిర్యగ్జంతువు మానుష వ్యాపారము సేయుట రంగోచిత్యమునకు భంగకరమని, రవివర్మ శుచిముఖిని తొలగించి ఆ దౌత్యభారము భద్రనటుని మీద పెట్టెను. అట్లు చేయుటచే ప్రదర్శనానుకూల్యము కలిగినమాట నిజమే కాని, తొల్లిటి సందేహము మరింత యెక్కువైనది. భద్రుడు కృష్ణునకు మరింత అంతరంగిక మిత్రుడైనాడు. అదియును గాక

మగవాఁడు శృంగార వ్యాపారమున దౌత్యము చేయుటవలన ఇంకొక అనౌచితి దొర్లినది. కనుక నాటకమున జరిగిన మార్పు "ముల్లుదీసి కొఱ్ఱుఁజొచ్చిన చంద"మయ్యెను.

రవివర్మ రెండవకల్పన చిత్రరూప దర్శనము :- ఈకల్పన నిజముగ రసమునకు పోషకమైనది. చిత్రకలి చేతనే నాయిక, నాయకుని నెడ బద్ధభావయయ్యె ననుట కంటె, కనుకలికూడ గల్గించి భావమునుద్దీపింప జేసెను గనుక, ఆ రాజకవి కొంత మంచి మార్పే చేసెను.

ఈతని మూఁడవ సంస్కారము, రంభాభిసరణ ప్రయోగము :— హరివంశమున ప్రద్యుమ్నాదులు రామాయణకథను రంభాభిసరణమును నాటకములాడిరని యుండగా, నాటకకర్త రంభాభిసరణమును మాత్రమే కయి కొనుట యౌచిత్యసంపాదకమే. ఇది కొంతవరకు సందర్భోచితముగా నున్నది.

రామాయణకథ దానవులకు దుష్కీర్తికి నిధానము. వారు దానిని ఆలించి తమ మూలపురుషుల పరాజయమును దుర్దశను కన్నులార గనుచు వినోదించి మెచ్చులు కానుకలు కురియుదురా? భద్రనటుఁడు ఆకథా ప్రదర్శనమున ఎక్కుడు ప్రవీణుఁడై, పొరపాటున దానినే యాడ గట్టెనేని వేషము రంగమునకు వచ్చినవెంటనే చండస్వభావులగు దానవ ప్రేక్షకులు వేషధారిని చీల్చి చెండాడుదురు.

ఇక రంభాభిసరణ నాటకముగూడ రావణు ముష్కరత్వోత్పాదకమే. దానినిగూడ దానవులు సహింపుట కష్టమే అయినను ఆకథ శృంగారరసప్రధానముగనుక ప్రస్తుత ప్రభావతీ భావము ఉద్దీప్తమగుటకు భద్రుఁడు దానిని ఆశించెనని సమాధానము కుదుర్చుకొనవలెను.

ఇంక, మన తెలుఁగు ప్రబంధమును ఆ రెండు మూలములతో పోల్చి చూచితిమేని, సూరనార్యుఁడు ఆ యాలోపముల నెట్లు సవరించెనో, అసంగత భాగముల నెట్లు గాఢసంగతములుగ చేసెనో, అనుపపత్తికములకు ఎట్లుపపత్తి కల్పించెనో, తుదకు రసము నెట్లు పోషించెనో, విదితమగును. అది యద్భుతావహమైన యత్నము.

ప్రబంధ కల్పనను అనుసరించి వజ్రనాభవధకు ప్రభావతీ పరిణయము కారణము.

ఎల్లన :- "హేమగిరి రాజకన్య పరమేశ్వరి", ప్రభావతికి కలలో సుప్రసన్నయై "మమతను జేరగాఁ బిల్చి మక్కువచే నొకకేల మే నిమురుచు నీకునొక్క మగనిఁ ఘటియించితి" ననిపల్కుచు, సంకల్పమాత్రతత్ క్షణ సన్నిధాపితంబగు చిత్రఫలకంబునందు నొక్కపురుషు నత్యాశ్చర్యతర రూప లావణ్య గాంభీర్య శౌర్యాది శుంభ దఖిల గుణముల గోమ రొందు కొమరు బ్రియము వ్రాసి వ్రాసి యితండు నీవల్లభుండు, ప్రద్యుమ్నుఁడనియెడు ప్రభు కుమారుఁడు, మీకు నిద్దఱకును జనియించునట్టి పుత్రుఁడీ పురినేలునో పొలతి" యనుచు పలికెను.

అది కేవలస్వప్నముకాదు – కొంత నిజము, కొంత స్వప్నము. "చిత్రఫలకంబు ప్రత్యక్ష సిద్ధ మగుటఁ జేసి యాకల యధిక విశ్వాసయోగ్యము. అదియు వేకువ గావున నచిరభావి ఫలము."

ఆ వివాహ ఫలముగ ప్రభావతీ పుత్రుడు వజ్రపురము నేలును; అది జరిగితీరును. అట్లు జరుగుచో వజ్రనాభుని వధ తప్పదు; ఎట్లన:—

"ఆ యింతి ప్రద్యుమ్ను జాయగాఁ బలికిన
గౌరిమాటకు బొంకు కలుగదు,
దనుజవిరోధిపుత్రునకు నాదుష్టదైత్యుఁడు
తనంతఁ దనూజ నొసఁగఁడు,
ప్రద్యుమ్నుఁడట్లు ప్రభావతీపతియైన
దానవునకుఁ బోరు తప్పదు,
వజ్రపురము ప్రభావతికొడుకు కేలఁట
యసురకు జయమైనఁ బొసఁగదు."

ఈవిధముగా ఆ రెండు ప్రధానాంశములకును కల్గిన గార్య కారణ యోగమువలన కథాసన్నివేశము సుఘటిత మయ్యెను.

మరి యింకొకమాట. ఈసంబంధ కల్పనచే ప్రభావతి చరిత్రయు కొంతచక్కబడినది. పురాణముననుసరించి ప్రభావతి ప్రద్యుమ్ను నెడ వినుకలిచేతనే బద్ధానురాగ యయ్యెను. నాటకకవి కేవలము ఆ యుపపత్తి చాలదని కనుకలి కూడ

కల్పించెను. అట్టి కనుకలిచేతగాం వినుకలిచేతగాని ఆ దనుజ కన్య యదుకుమారుని వరించుట సంభావ్యమా? దానవ కులాంతకుడైన శ్రీకృష్ణుడు వజ్రనాభాదులకు ఆజన్మశత్రువు గదా! అట్టి శత్రుకులజనితుని దూతికోపదేశమున వరించుటకు ఆ కన్య సాహసింపవచ్చునా? దూతికోపదేశము కంటె పితాజ్ఞ బలవత్తరమును అవశ్యానుష్ఠేయమును గాదా! పితాజ్ఞను గూడ తిరస్కరింపజాలు మహాకారణ మొకటి వేరేయుండినచో ఆమె వలపును సమర్థింపనచ్చును గాని లేనిచో ఆమె పితృవకారిణి యనుటకు సందియములేదు. ఆమె స్వయంవరన్యస్తగమక మనువచ్చినవాని వరింపవచ్చుననియు, అది తండ్రి యిచ్చిన యధికారమే కాన ఆ కార్యము పాపము కాజాలదనియు అందురేమో! సరే! ప్రభావతి ప్రద్యుమ్ను వరించితినని తండ్రికి విన్నవించుటకాని, అతడు తానిచ్చిన యధికారమే కాన కూతురు తన యిచ్చవచ్చినవానిని వరించినదని సంతసించి యాదవునిపిల్చి కన్ననిచ్చి వివాహము సేయుటగాని జరిగెనా? అది కాముక వ్యాపారమే కానిచో ఆ రహోవర్తనమేల? అది తండ్రికిష్టములేని కార్యమని ప్రభావతి యెరుగును. మనమును ఎరుగుదుము.

ప్రబంధ ప్రభావతి వలపును సమర్థించుటకు అట్టి మహాకారణమొకటు. అది పరమేశ్వరి యాదేశము. తన పుట్టుకకు కారణమైన జగన్మాత ప్రత్యక్షమై "నీ కొరకే పురుషుని సృజించితిని. నీబిడ్డ యీ పురము నేలు" నని

అనుగ్రహించి వరమీయగా తదాదేశము శిరసావహించి వరసిద్ధికి ఎదురు చూచుటయే ప్రభావతి పని. మరి యీ ప్రద్యుమ్నుడు యదుకుమారుడని ఆమె యెరుగదు. పరమేశ్వరియు, ఆ రహస్య మెరిగింపలేదు, కనుక మొదట కుల విరోధియెడ మనసు నిల్పదగునా యని యామె సందేహించుటకు అవకాశమే లేదు. పదపడి రసభావము వెల్లివిరియు కాలమున శుచిముఖీ ముఖమున ఆరహస్యము విన్నది. ఆవిన్నప్పుడైనను కొంత వెనుకముందులు విచారించి యాదవుని వరించుట స్వకులహాని హేతువని మనసు మరల్చుకొన వచ్చునేమో కాని, అది యట్టి విచారము చేయదగిన కాలము కాదు. మిత్రవాక్యము, పితృవాక్యము దేవతావాక్యము క్రమముగ ఉత్తరోత్తర బలాధికములుగాన, దేవతావాక్యాను సారమువర్తించిన ఈప్రభావతి మిత్రవాక్యానుసారము వర్తించిన పురాణప్రభావతి కంటె గుణోత్తర.

లక్ష్యమును బట్టి వర్తనను సమర్థింపనగుచో ప్రభావతి వర్తనము సమర్థనీయమే! మాతృత్వము తాల్చుటయు జీవత్పుత్రి యగుటయు పుత్రాభ్యుదయము చూచుటయుగదా స్త్రీత్వమునకు సత్ఫలములు. ఆట్టిసత్ఫలనిరీక్షయు దేవతావాక్య విధేయతయు కారణములుగా ప్రభావతి నెరపిన పురుషకారము దుష్టము కాదు. అయినను సూరనగారు తలచినచో ఈపాత్రను ఇంకను చక్కదిద్దు నవకాశము లేకపోలేదు. ప్రద్యుమ్నుడు యాదవుడని శుచిముఖి తెలిపినపుడయినను ప్రభావతి కొంత

ధర్మసంకట స్థితిలో పడుటకు అవకాశమున్నది. "కటకటా! పితృకులవైరిని నాకు భర్తగా పరమేశ్వరి యెట్లు నిర్ణయించె! దీనిని నాతండ్రి యెట్లు సైచును! నేను పితృభక్తి నెరపుదునా! పతిసమాగమము కోరుదునా! ఒకట పరమేశ్వరికిని ఒకట గురునకును అవిధేయురాల నగుదుగదా!" యని ధర్మాధర్మ విచక్షణ నెరపి, తుదకు అవశ్యంభావియగు విషయముకాన భర్తృసమాగమ యత్నము చేసిన బాగుగనుండెడిది.

మూలముల యందు చంద్రవతీ గుణవతుల వివాహము లకును ప్రధానకథకును పొరానిపొత్తు లేదనియు, అవిమాత్సం భవములనియు నుడివితిని. ప్రబంధమున ఆలోపము పూర్తిగా పరిహృతమైనది. "ఎట్టి యర్థమును దగులొ్కనఁ దివియక వెలివోని చ్చెన బుధుఁడూహించిచేయు సుకవిత్వంబుల్" తత్సంపాదనార్థము సూరనార్యుడు చేసిన కల్పన "చిలుక రాయబారము." ప్రభావతికి ప్రద్యుమ్నుతోడి వివాహము పరమేశ్వరి యాదేశించినట్లే, చంద్రవతీ గుణవతులకు గద సాంబులతోడి వివాహములు నారదుడాదేశించెను. అక్క పెండ్లికి హంసిదూత్యము నడపుచుండ, చెల్లెండ్రపెండ్లికి చిలుక రాయబారము చేయుచుండెను. ఈ రెండు కార్యములును, కుడి యెడమలుగా మొదటనుండియు జరుగుచునేయున్నవి. మాతృనది పుట్టిన చోటనే ఉపనదియు పుట్టినది. అవి సంగ మించు ప్రదేశము తీర్థభూతమైనది. ఇందు మాతాత్సంభవత లేదు. ప్రభావతివలె చంద్రవతీ గుణవతులును భర్తృసమాగమ

కాంక్షిణులై యుత్కంఠతోనే యుండిరి. గద సాంబులకు గూడ ప్రద్యుమ్నునకువలెనే నూత్న వధూసంగ మాపేక్ష యుద్ధయాత్రాప్రోద్బలక మైనది. ఒకరికి తెలియకుండ ఒకరు వజ్రపురీ యాత్ర "నాభాగ్యవిలసనంబ" యని "నాభాగ్య విలసనంబ" యని లోలో మురిసిరి. ప్రద్యుమ్నుడు నిరహార్యుడై దెసలకు చేతులు సాచి "కృపనీక్షింపరే కీరోత్తములార! వజ్రపురికిం బోవువారె మీరు!" అని ప్రార్థనాపూర్వ దీనాలాపములువలుకుచున్న సమయంబున, అభ్రమార్గమున ఎగురు చున్న శుకము, కారుణ్యమునకిల్చి యాతడిచ్చిన పత్రిక గైకొని దానిని శుచిముఖికి మోదికొని వచ్చియిచ్చినపోలే ఈరెండు గాథలయొక్కయు సంగమస్థానము. పదంపడి హంసి చంద్రవతీ గుణవతులను జేరి "మీపతులిట వచ్చుట కుచితోపాయము మిగులం దడయు కొక్కటి నేనాపాదించెద" నని వారి మైత్రి సంపాదించుటయే యువి మరింత పరస్పర లీనములగుట రెండంశములునను శుచిముఖ పోగునకు తగుల్పడియేకమయ్యెను.

ఇక భద్రనటుని విషయము. వానికీ ప్రబంధమున ప్రవేశమేలేదు. ఉండనుగూడను. ఆవిషయము పైని వివరించితిని. నటునకును వటువులకును జరిగిన సంవాదమున, విశ్వంభరుడు వటు వచనంబులు ఉపశ్రుతిగ చేకొని, తదనుసారంబున వజ్రపుర ప్రవేశంబును వజ్రనాభ వినాశంబును అతి సుకరంబులుగ మనంబున నిశ్చయించుకొనెను. అంతమాత్రమే, భద్రుని ప్రయోజనము.

మరియు ఇందు, కృష్ణుడు యదుకుమారులను వజ్రనాభ వధార్థమే నియోగించెనుగాని కన్యా సంసర్గరూపమైన అనుషంగిక ఫలము వారికి ఎరిగింపలేదు. ఆవిషయము అత్యుసఘు డెరిగియు ఎరుగనట్లేయుండి పితృగౌరవమును దక్కించుకొనెను. ఆ కార్యమంతయు దూతీముఖమునే నడచినది.

అదియును గాక, సూరన రామాయణగాథను గాని రంభాభిసరణముగాని ప్రద్యుమ్నుచే ప్రదర్శింప జేయలేదు. ఆ కథలు దానవులకు సమ్మతములు కావనియో వానిని విడిచి గంగావతరణాది నాటకములాడించెను.

ఈ విధముగా అనౌచితిని పరిహరించుట, అసంగత వ్యాపారముల సుసంగతములు చేయుట లోనగు వస్తు సన్నివేశ చాతురిని కొనియాడిన పిమ్మట, మనము ఈ కావ్యమున విచారింపవలసినది ఇంకొక్క విశేషమున్నది. అది,

శుచిముఖీ పాత్ర నిర్మాణశక్తి.

పురాణమున శుచిముఖికి స్వతంత్రత లేదు. అందు ఇంద్రోపేంద్రుల ఆనతిని శిరసావహించి వారు చేయుమన్న పనుల భక్తిమై నెరపి, ఎప్పటి కప్పుడు వినయవతియైన పరిచారికవలె సంచరించినదే కాని. తానై ఒక్కపనినికూడ తలపెట్టలేదు; చేయులేదు. ఇక కావ్యముననో కథ యంతయు శుచిముఖి వశముననే నడచెను.

ఆహంసీమతల్లి, ఉపాయములు గానక తదన్వేషణ తత్పరులైయున్న ఇంద్రకేశవులకు ఉపాయములు బోధించి

గురుత్వము నెరపెను; వారికార్యము సాధించిపెట్టి మంత్రిత్వము చేసెను. దాని ప్రౌఢగుణ వర్ణనములు వర్ణించుటకు కథ యంతయు వివరింప వలసినదే కాని "యిట్టిది, ఇట్టిది" అని విశేషణ పరంపర కురిపించిన చాలదు.

ప్రభావతీ ప్రద్యుమ్నము పేరు చెప్పినంతనే శుచిముఖీ పాత్ర మనోగోచర మగును. దానికి కారణము, కవి యా పాత్రకు గలిగించిన ప్రాధాన్యమే. కథలో ఏది ప్రధాన పాత్రయో దానినే తత్కర్త సర్వాంగసుందరముగా చిత్రించును. ఈకథలో శుచిముఖివంటి సర్వాంగ సుందరమైన పాత్ర యింకొకటి లేదు. దానిని అతిప్రౌఢముగ చిత్రించుటయే ఏతత్కావ్యరచనా ప్రయోజనముగా సూరనార్యుడు తలచి యుండును. ఈపాత్రనిర్మాణ ప్రౌఢియు మూలమునకు వన్నె పెట్టిన విషయములలో ఒకటిగా భావింపవలెను.

శుచిముఖి కార్యరంగమున ప్రవేశించు నప్పటికి పనులు ఏముఖమునకున్నవో, యే వెంట నడచుచున్నవో విచారింతము.

ఇంద్రుడు ద్వారకకు వచ్చి శ్రీకృష్ణునితో తాను పడిన బన్నములు విన్నవింప, వాసుదేవుడు "ఆ దుష్టరాక్షసు సాధించుటకుం బ్రద్యుమ్నుడు తగం గావంతు మేకాగ్రతన్".

"నీవు నుపాయాన్వేషణ,
గావింపుచునుండుమల్ల కార్యంబటుగా
దేవేంద్రునం దత్పురిచోరం,
గావలయును, యిప్పుడొప్పగలవో వాసిన్,"
అని ఆదేశించి పంపెను. పిదపడు,

"వనజాక్షుండప డిందరికాని. ము దెసన్ వర్తిల్లు చిత్తమ్ములో
నవికీ వజ్రిపురంబు సొచ్చుట కుపాయాన్వేషినై యుండి,"

"వటువాక్యక్రమంబాతయును నిజాపేక్షకు నుత్తరంబుగ
గ్రహించి దాని నుపశ్రుతిగాఁ జేకొనెను."

వటువాక్యములవలన శ్రీకృష్ణుడుగ్రహించిన విషయము
నటవేష ధారులై యనవక్ష్యమువాడు వజ్రిపురము ప్రవేశింప
వచ్చుననుట. కాని, అందులకు అప్పు డెవడో యతనికిని
స్ఫురింపక విచారవముస ప్రవర్తిల్లెను.

ఇక, ఇంకొకవిషయము. ఇతడును కార్యభరమంతయును
వాను దేవుని మీదనే పెట్టి ఊరకొనక, స్వవిషయము
గనుక తనచేతనైన ఉపాయములు తానును అన్వేషించు
చుండెను. వజ్రనాభు డెప్పుడు ఏమరుపాటున వచ్చిపై బడునో
యను శంకచే, ఇందురిడు వానివర్తనల ఎప్పటి కప్పుడు ఎరుగ
గోరి, వజ్రపురమునకు రాక పోకలు సలుపు హంసముల పిల్చి

"మాకంటె వాఁడు మునుపుగ
నేకార్యము చేయుఁగలఁడో యెఱుఁగము, మీరల్
జోకగఁ దత్పురి మెలఁగుచు
నాకే దొరక పనికి వేగు నడపఁగవలయున్."

"ప్రతి దినసంబు వాని నగరంబునఁబుట్టువిశేషముల్ భవ
న్మతివసనన్నయుండెలిసిమాకెఱిగించుటమీప్రయోజనంబు"

అని వేగు నడపగోరెను.

ఇక, ఆతఁడు చేయుచున్న యుపాయాన్వేషణమెట్టిదో యెఱుఁగరాదు. అతనికిని అది గోచరము కాలేదు. కేశవుని వటువాక్యము వలన మార్గము పొడకట్టినదికాని ఆదారిని నడచు మాటసి చిక్క లేదు. కనుక ఇప్పుడతనికి భావికార్యము స్ఫురింపనేలేదు.

ఆ సందర్భమున శుచిముఖి కార్యరంగమున ప్రవేశించి, తొల్త వజ్రపురమున జరిగిన రహస్యవృత్తము తెలిపి, అపేక్షిత పరిణామానుకూల్యము నెరపెను. స్వప్నకథయు చిత్రపటవృత్తమును కారణములుగా "ప్రభావతీ ప్రద్యుమ్న శీఘ్రపరిణయనంబునకు నుద్యోగంబు తద్దయుం జేయుట సంభావితంబు గావున నా యుభయ కందర్పరాగము దేవకార్యమున కుపకారంబగు" ననుచు మోవకౌశము చేసెను. ఈయుపదేశమునకు ఇంద్రుఁడెంత మెచ్చెనో చూడుడు. అతని వేయికన్నులును ఒక్కుమ్మడి విప్పారినవి. అర్థించిన దానికి కోటి మడుంగులు లభించినది.

"మీఁది కార్యంబునకుం బర్యాకులిత భావంబునం జేసి తోఁపకుండ నుమ్మలించుచున్న మాకు మాపాలి భాగ్యదేవత యీవిధంబున నిన్ను నన్నిటికి నాధారంబుగా ననుగ్రహించెం గావున దేవకార్యంబు నడపుట నిర్వహించుటకు నీవతక్క నొరులు నేరరు. ఆ యిద్దఱకును శీఘ్రసంగమం బెవ్విధంబున నగు, నది నీవు యెఱింగి సంఘటింపు" మని తన కృతజ్ఞతను వెల్లడించి శుచిముఖిని స్తుతించి తక్కుఁగల కార్యభారమంతయు

దాసిమీఁద నే పెట్టి చేతులు జోడించి నిలబడి రాజ్యభిక్ష వేఁడెను. శుచిముఖి అతనికిప్పుడు వేగు నడపు పిట్ట గాదు. మంత్రియు ఉపదేశించిన గురువు, కార్యము సాధించు మంత్రి.

శుచిముఖి పాత్రకు అలంకార భూతములగు ప్రధాన గుణములు రెండు. ఒకటి బుద్ధివైభవము, రెండవది వాక్య వైదగ్ధ్యము. ఆహంసి వర్తించిన ప్రథమ రంగముననే యీ రెండుగుణములును విస్పష్ట శోభతో వెలుగొందెను.

హంసలు వజ్రపురమున కన్యాకాంతఃపురమున ఒక్క సరోవరంబున బంగుచెడ నామా[illegible] నాక్ష[illegible] కారిణియైన ప్రభావతి తాను వేకువవేళ గాంచిన యద్భుత స్వప్న వృత్తాంతమును తనచెలికి వరిగింప దొడగెను. ఆమత్త కాశినులయుత్తర ప్రత్యుత్తరంబుల వెంబడి యెరుగనైనవి శేషము, పరమేశ్వర ప్రభావతి టస సుప్రసన్నుఁడై చిత్రఫలకమున ఒకసుందరాకారుని రూపమువ్రాసి "ఇతఁడ నీవల్లభుండు. ప్రద్యుమ్నుఁడనియెడు ప్రభు కుమారుండు, మీకు సృష్టికును జనియించినట్టి పుత్రుఁడు పురనేలు" నని వరమిచ్చెనుట. ఈ మాటలు చెవిన బడినంతనే వసనాభునకు కాలుయు చేతు వాలు శుచిముఖి నిర్ణయించదు. అట్టి నిర్ణయము చేయుటకు ఎంత యస్నిక నేర్పు కావలయునో విచారింపుడు. ఆ యస్నిక యెట్టిదో శుచిముఖియే వివరించి తెల్పెను:—

"అయింతి ప్రద్యుమ్ను జూడఁగాఁ బలికిన
గౌరిమాటకు బొంకు కలుగఁబోదు.

దనుజవిరోధపుత్త్రునకు నా దుష్టదై
త్యుఁడు తనంతఁ దనూజ నొసంగఁబోఁడు.
ప్రద్యుమ్నుఁ డట్లు ప్రభావతీ పతియైన
దానవునకుఁ బోరు తప్పఁబోదు,
వజ్రపురము ప్రభావతి కొడుకేలుట
యసురకు జయమైనఁ బొసఁగఁబోదు.
చిత్రఫలకంబు ప్రత్యక్ష సిద్ధముగఁ
జేసి యా కల యధిక విశ్వాసయోగ్య
మదియు వేకువ కావున నచిరభావి ఫలము."

ప్రభావతీతనయుఁడు వజ్రపురమేలుటకు ఇంత కార్యకలాపము జరుగవలెననియు, అదియు జరిగి తీరుననియు ఊహించుటయే శుచిముఖబుద్ధిబల ఫలము.

"తనబుద్ధి నిర్ణయమున ఇంచుకయు పొరపాటు లేదని చాటుటకో" యన "దేవేంద్ర! నీవెంచి తెలిసికొను" మని హంసి పన్నిదము చరచినట్లు పలికినది. ఎన్నిహంసలు ఆ స్వప్న కథను వినియుండలేదు? అందు ఒక్కదానికేని యీ కార్యకారణ ప్రపంచము గోచరించెనా? వానికి అట్టి బుద్ధిప్రకాశము లేదు. శుచిముఖది యచ్ఛపుబుద్ధి. దానికి అగమ్యములు లేవు. కనుక స్వప్నమునకు వ్యాఖ్యానము సేయుటయే హంసియొక్క మతిపసకు నిదర్శనము.

మరియు, శుచిముఖ తనభర్త పనుపున శుచిముఖునకు వజ్రపుర వార్త విన్నపంబు చేయునదియై వచ్చి యభిముఖయై

నిల్చి ప్రసంగించుటకు దొరకొనుటతోనే యెట్టివచన సారస్యము కురిపించినదో చూడుడు. వచ్చిన మొగముననే తానెఱిగిన విషయమును రెండు మూడు పాఁముక్కలతో నెఱింగింపరాదా? అది నీరసపద్ధతి. శుచిముఖి వచనరచనాప్రక్రియ రసమయము. రిపునగరము చేరెడి తమ్ము ఇంద్రుడు అనుమానింపకుండునట్లు మునుముందు క్షమాపణవాక్యము విన్నవించినది. పిమ్మట "అటుచనక హంసములకు మేఁత నడమనే" యని తమవర్తనమునకు ఉపపత్తి కలిగించి నిర్దోషతచూపినది. అంతట కథయందు కొన్ని పూసగ్రుచ్చినట్లు ఏ యర్థమును వెలివోకుండ, "బుధుఁడూహించిచేయు సుకవిత్వము" వలె, చెప్పినది. ఆ కథాకథనమునందుగూడ "శబ్ద సంస్కారము జాఱనీక, పునరుక్తిదోషంబు పొంతఁబోక, ప్రకృతార్థభావంబు పాయకో నడుకుచు, నుపపత్తియుక్త్యార్జితముగఁ బూర్వోత్తర విరోధమొదవకుండ, బహుతరఃఫలమైన" తనపలుకు నేర్పును ప్రకటించినది. బృహస్పతిప్రముఖమహర్షి సంభాషణములు ఆలకించు దేవేంద్రునకుగూడ దాని "వచనరచనావిచక్షణత్వంబు చిత్తంబునకుఁ గ్రొత్తయింపుసొంపు సంపాదింప" అతఁడు "ఓవగటామణీ! విహంగయోషవే! భాషాప్రావీణ్యముచూడ వాగ్దేవతవో? కాక యూకె దిద్దిన కవివో!" యని మెచ్చుకోలు పలుకులు పల్కెను. ప్రసక్తమైనది గనుక తనపూర్వచరిత్ర ఎఱిగింపక మానరాదనియు అల్లరిగించుటయు మున్ననకు హేతు వగుననియు ఊహించి శుచిముఖి.

"విను సురేంద్ర! పద్మజుని తేరుఁదివురుచు
సారంధరాఖ్యుఁడగు మరాళవిభుని
బిడ్డనేను వాణిపెనుపంగఁ బెరిఁగి త
ద్విమల శిక్షగంటి విద్యలెల్ల"

అని పూజ్యపాదులయిన తన గురుజనుల పేర్కొని తన గొప్పదనము ఇంద్రునకు వ్యంగ్యముగా తెల్పెను. ఎప్పటికెయ్యది ప్రస్తుతమో యప్పటికది సరసముగా మాటలాడి, యెదిరి హృదయము చూరగొను నేర్పరితనమే శుచిముఖి వాక్కునకు తొడవు.

పిమ్మట, తానెరిగిన విషయము చక్రికి విన్నవించునదై శుచిముఖి యింద్రుని పనుపున ద్వారవతికేగెను. అప్పట్లి శ్రీకృష్ణుడు అష్టమహిషీ సహితుడై ఆలయోపవన సరస్తీర మండపవర్తియై యుండెను. హంసి యతని దవు దవ్వుల విలోకించి తెలిసి "ఇతని నెఱిగించుకొనవేళ యిదియనుచుఁ దానొక్కతయె రక్కసులగొంగ చెంగటికి నల్లనల్ల నడచి నీకొక్కమాట చెప్పగ నన్నమర విభుఁడు పనిచెను. అదియేకాంతపుఁబల్కు" అని విన్నవించెను. కృష్ణుడుసతీసమేతుడై వినోదించు సమయమే తగిన అదనని గ్రహించుట హంసీమణి యొక్క సమయజ్ఞతకు గుర్తు. సదరు బెదరు లేక నిబ్బరముగ లోకనాథుని గదియవచ్చి "నీకొక్క మాట దెల్ప నన్నమరవిభుడుపనిచె" ననునప్పటి దానిదిట్టతనము అవరోధ జనమునకు అరుదయ్యెను. మరియు, తన తనయుడు రాక్షసునిపై

చనియెడు నని రుక్మిణికి అసమ్మత మగునో యను శంకచే హంసాంగన యేకాంతపుమాట గలదని చెప్పెను. ఈ యుక్తార్థము కృష్ణుడూహించెనో లేదో కాని తత్పూర్వవాక్యక్రమముచేతనే యాపులుగుపడతియొక్క మాటనేర్పును బుద్ధి కౌశలమును మెచ్చి యేకాంతమిచ్చి దాని ప్రసంగము విని,

"వడుగుల పల్కు పశ్రుతిగ వారకమున్న సునిశ్చితత్వముం
బడిసిన కార్యపద్ధతికిఁ బక్షి వధూవచనక్రమంబుచే,
గడమ సమర్పితంబగుడుఁ గంజదళాక్షుఁడు సంతసిల్లె, నే
ర్పడియెను వజ్రనాభవధభారవహుండిపుడంచు నాత్మలోన్"

కృష్ణునకు గూడ ఉత్తరకార్య పద్ధతి స్ఫురింపక ఆలోచనామగ్నుడై యుండుటయు అది హంసిచేతనే సమర్పితమగుటయు ఇపుడు తెల్లము.

యదూద్వహుఁడు శుచిముఖిని నమ్మదగిన బంటుగా, ఆత్మీయగా భావించి కాదగిన రహస్యకార్యక్రమము అంతయు ఎంగించి "ప్రద్యుమ్నుపై దితిసుతునకు వేడ్కపుట్టంగఁ జెప్పి యువ్విదు చేరగ ముదలగొనుము, అతడై వచ్చుమదనుఁడంటే" అనియొక ప్రయోజనము నిర్దేశించెను. దానిని ఉపయోగింప దగిన యవాంతర కృత్యములు తత్తదుపాయంబులు ఆమున యెరిగింపలేదు. "అవన్నియు నీవ యెఱుంగుదు. పొమ్ము" అని తనకు దానియెడగల పరమవిశ్వాసమును, ప్రకటించెను. భారతోద్యోగ పర్వమున కృష్ణుడు రాయబారమునకు చను నెడ ఇట్టిదే ధర్మజునివాక్య మొకటియున్నది. "పొమ్మువ్వడ నీకు

నేను బుద్ధులు సెప్పన్" అని, అదియుధిష్ఠిరుడు కృష్ణునుద్దేశించి పల్కినది. ఆ సందర్భమున పాండవుడు తన్నెంతగా నమ్మి తనపై ఎంత భారముంచి ఆత్మార్పణము గావించెనో, ఈ సందర్భమున కృష్ణుడును హంసను అంతగానమ్మి దానిపై అంత కార్యభారముంచెను.

హంసలు ఆకాశమార్గమునమరలిపోవు నెడ ప్రద్యుమ్నుడు కానవచ్చెను జరుగనున్న విరశృంగార కార్యములకు మూలభూతుడు అతడే కాన, అతనిని హెచ్చరించి, మనసులోను అరసిపోవలె నని శుచిముఖి "అల్ల యుండెడితండ కావలయు నవశ్యమీ వపురుషునితో మాటలాడి చనుట మనకు మేలని యతనికి వినబడునట్లుగ తోడి యుంచలతో పల్కి యతనికి నెరగు గల్పించి ధరణికి డిగెను.

నిజమారసిన, ప్రద్యుమ్న వజ్రపురయానము నందు భారము కృష్ణుని దేయయ్యు, కంటబడిన ప్రధానవస్తువును బరసి చూడక యూరక పోవుటేల? యని శుచిముఖి పన్నిన కల్పన యిది. అందుకు తాను చెప్పదలచిన విషయము నెడ అతనికి అతిసతూహలము కల్గుటకై "అల్ల యతడితండ కావలయు" నన్నది. ఈ ప్రౌఢత్వము వర్ణనాతీను అతకరించెను. పదపడి యాతడు "ఇచ్చట నెవ్వనితో నేమి మాటలాడవలయు నతనిం బిలచి సంభాషింపుడు" అన, శుచిముఖి యఖిలజన మనోహరంబైన మధురస్వరంబున చెప్ప దొరకొనెను. శుచిముఖీ వాక్యములు అతినిపుణములే కాక మధురములనియు

భావింపవలెను. అవిశేషమును కవి పెక్కుచోటులఁ గొనియాడెను. వానిలో గొన్నిటిని ఉదాహరించుచున్నాను:-

"సహజ మాధురీ ధురీణ వాణీ రామణీయ
కంబు, కార్యకామనీయకంబున నినుమడించి
బిడౌజు నిబిడౌజుఁ జేయుచుండ నిట్లనియెను."
"శుచిముఖి యఖిల జనమనోహారంబగు
మధురస్వరంబున నిట్లనియె."
"అంత నంచచెలువ చెలువంపుఁ జెలువు
గులుకు లలికివలుకుల కలకలంబు వీనుల
కపూర్వపర్వంబగుచుఁ బర్వుచుండ నిట్లనియె"
"వీనులకు సుధారసముల
సోనలు వర్షించు మృదుల సుస్వరఫణితిన్.
కావ్య నాటకాలంకారగాన మదనశాస్త్ర
పరిచయ సుహానంబు జాలపాదభామినీమణి నెఱపె..."

మాటనేర్పులేని బుద్ధికుశలత వ్యర్థము. సంస్కారపూతముగాని మాట నేర్పు కూడ వ్యర్థమే. సంస్కారపూతమయ్యు కటుత్వదూషితమగునేని యదియు వ్యర్థమే బుద్ధికుశలతయు, సంస్కారపూతమగు వాక్కును, ఆ వాక్కును ఉపయోగించు నేర్పును, తదనురూపమగు సుస్వరసంపన్నతయు, ఒక్కచో కూడియుండుట సృష్టికి అలంకారభూతము. శుచిముఖికి ఈ గుణసంపద సంపూర్ణముగా కలదు. ఆహంసి పెదవి కదల్చిన మోహనాస్త్రమగుటకు ఈగుణసంపదయే కారణము.

ప్రకృతము అనుసరింతము. శుచిముఖ ప్రద్యుమ్నుని శత్రుసూదనత్రాకుతూహలమును ఒరసి చూడ దలచినది. ప్రసంగము తిరుగుటకు మున్నే, తాము ఇంద్ర కేశవుల యాజ్ఞలు ధరించి యొకచోట కేగుచుండుటయు తనయెడ ఆ యింద్రో పేంద్రులుచూపు మన్ననయు, తాము కాశ్యపులగుటయు లోనగు ఆత్మోత్కర్షమును సూచించి, అవి ప్రాకృతపక్షులు కావని యాతనికు గూడ గౌరవింప దగున ట్లుగా చేసినది. అప్పట్లనే "మేము మఱి యెవ్వరికోడ మాటలాడగా వచ్చెదము. ప్రస్తుత ప్రయోజనసిద్ధికి నీ యనుగ్రహము గాంచిపోవుటమాలము." అని ఆతని కుతూహలమును పెంచి చిత్తమును మరికొంత ఆవర్జించినది ఏకాంత ప్రసంగ యోగ్యమైన విషయమును అంతకంటె ఎక్కువచెప్ప వలను పడదు. ఆరీతి సముచ్చారాంగ శుచిముఖికి ఎవరు నేర్పవలెను? ఏకతమున గూడ ఆతనితో చెప్పిన విషయము మిక్కిలి స్వల్పము. "వజ్రనాభుండనుయెడు నొకదైత్యుఁ జంప యత్నము సతతంబును నడచుచున్నయది బహు దినములనుండియును హరికి దేవేంద్రునకున్."

"తమకంటె మున్ను వాఁడే
తమ మీఁదట నేమికీడుఁ దలఁచునోయనుచుర్జ
మము వారు వేగఁ బంపఁగ
నమరాహితు వీటికిప్పు డరిగెద మనఘా!"

అని సుంత మాత్రము చెప్పినదే కాని, తద్వ్యాఖ్యానమై మిత్రపుత్రి సిన్నే యనువ నుగ్గాడని తా నెరిగిన వివరమును

తెల్పలేదు. అప్పటికి అంతియే ప్రస్తుతము. ఎన్ని రహస్యముల నైనను పుక్కిటబట్టి యుంచుటయు, సమయమునకు ఒక్కొక్కటియే ప్రయోగించుటయు దాని నీతి. మరియు "సరసిజనేత్రు దక్షిణభుజంబవు నీ"వని పల్కి ఆతని భావికార్య భారమును కొంత ధ్వనితము చేసెను.

శత్రువధ యత్నము విన్నంతనే శంబరారి రక్తముప్పొంగి "మరుత్కాంటకు పీచ మడపనె, నన్నొకని నె పంపినను దమ నియోగ బలమునన్"అం బరవసము చేసెను. అపేక్షిత ప్రయోజనాను కూల్యము కలిగెను గనుక శుచిముఖి తలయూచి మెచ్చినది. కాని, ప్రద్యుమ్నుడు ప్రభావతీ సంగమాపేక్షకుడయిననే కాని వజ్రనాభవధాసక్తుడు కాడుగదా! అతని మనస్సును తత్కార్యాభిముఖము సేయుటకు అదియే ఉచితసమయము. కనుకనే హంసి ప్రభావతీరూప వర్ణన ప్రారంభించి, అప్రత్యక్షమూర్తిని ప్రత్యక్షముసేయుటకో యన, ఎన్నో యుపములు ఎన్నో యుత్ప్రేక్షలు సాధనములుగా, తత్సౌందర్యమును చిత్రించినది. ఉపమాతిశయోక్తి కామధేను వినుదాంచిత యీరీతిగా గాక పొడిమాటలతో వర్ణించునా? పిమ్మట, పార్వతీ దత్తమైన చిత్రఫలక వృత్తాంతమును దెల్పి "ఆయాకృతి పోలుపంతయు భవదాకృతిం గని యతండితండ యనుకొంటిమి" అని యతనికి మిక్కుటముగ ఆసగొల్పి మరిసిల్వక "పోయివచ్చెద"నని యెగిరిపోయినది. గాలము వేసి మీనకేతనుని పట్టినది.

పేలవము. చిత్రరూప ప్రకృతిని ఎరిగినట్లు నటించుట, అది హేతువుగా వారిచే నిలిపించుకొనుట తదుద్దిష్టములు. అవి చేష్టాసాధ్యములు గాని వాక్యసాధ్యములు కావు. ఇచట నోరువిప్పి పలుకుటకు అవకాశమే లేదు. కాలుకదల్చుట కన్ను త్రిప్పుటయే ప్రయోగార్హములయిన అస్త్రములు. ఆ యస్త్రములే శుచిముఖి గరువతనముతో ప్రయోగించినది. అవియు అమోఘములుగ లక్ష్యభేదకములయ్యెను. పాత్రము సమగ్ర సుందరమగుటకు ఆకారేంగితచేష్టాదులన్నియు అనురూపములుగ నుండవలెను, ఒకచో కొరతపడిన అంతయు వికృతమే యగును. ఈశుచిముఖిపాత్ర సర్వాంగ సుందరమనుటకో యన సూరనార్యుడు దాని చేష్టలసొంపును గూడ వర్ణించినాడు.

చిత్రఫలకంబుఁ గాంక మరలి మరలి వీక్షించు మరాళి చందమునకు కొంచెము నకు నవ్వుకొని, ప్రభావతి,

"కలదుల పులుఁగిది తానే
మెఱుఁగునొకో తిరిగి తిరిగి యీఫలకముపై
బఱపెడుఁ జూడ్కుల"

అని తనప్రియసఖియైన రాగవల్లరితో అనెను. ఆ పలుకు తననుగూర్చి పలుకుటయే గనుక హంసి యామాట యందుకొని తానాచిత్రమును అబ్రపడి చూచుటకు కారణము వినుమని "మున్నొకచోట నొక్క పురుషుంజూచి, తత్సమాన రూపుని మఱియెందునుం గానక యిప్పుడిందు నతనికై పడిఁ

దోఁచిన నిది తదీయ రూపంబెట్టిదిగ వ్రాసిన తెలంగో యట్లు గాక యట్టివాఁడే వేఱొక్కఁడొక్కఁడున్నను గలిగెనో యని యించుక విమర్శించి వీక్షించితి" నన్నది. ఈమాట లెంత యుదాసీనములో తిలకింపుఁడు. "ఇట్టి మనోహరాంగుఁ డొకఁడు ఎందైనను గలఁడాయనియు, కలిగెబో యాతని గంటువ రొటిగిన వారెవ్వరా యనియు, సంశయమున ప్రభావతిరుండు చున్నయెడ హంసీవాక్యముల వలన అట్టివాఁడొకఁ డొకఁడనియు అతని గంటువ హంసి యెఱుఁగుననియు తేలినది. కనుక ఆపడఁతి, అద్భుతప్రమోద సందేహములు డెందమున గ్రిందుకొనుచు గందళింప, "ఓ హంసీ! నీవు మహాత్మురాలవు. ఇటురమ్ము చక్కగా వీక్షించి యారూపును ఈరూపును ఒకటియో విభేదమ్ము గలదో తెల్పు" మని బతిమాలెను. "ఇన్నియేకత మాడుచోటికి బిలువక చేర నేనెట్టివా" యని బెట్టు చేసి శుచిముఖి దూరముగానే నిలిచినది. దాని గరువతనంబు, దాని నేరుపులు అరుదు లని వెంటనే రాగవల్లరి గ్రహించెను. రాగవల్లరియు గరువతనంబుల పోఁడయే. అసలుగుట్టు తెల్పక శుచిముఖిని వంచించి కావలసిమాట విని కడపిపుత్త మని రాగవల్లరియెత్తు. ఆ గుట్టు తానెరిగినదే యయ్యు వారినోట తెల్పించుకొని వేడించుకొని మనసు లోఁగొని కాని కావలసినమాట తెల్ప గూడదని శుచిముఖి పైయెత్తు. పాత్రముల గుణాగుణములు ప్రతియోగ ఘటనావశమునగాని స్పష్టతరములను ప్రకాశ ములును గావు. ఇచట శుచిముఖి గరువతనమునకును రాగవల్లరి

గరువతసముచకను ప్రతియోగ భావము సంఘటిల్లినది. ఇరువురును ఎత్తులును పై యెత్తులును వేసిరి. రాగవల్లరి యాట కట్టినది. సుచిముఖి జయించినది.

ప్రభావతీ రాగవల్లరుల గుట్టంతయు శుచిము ఖియెరిగిన దే పుము! వారు కాసంగతి తెలియక "నీవు కానరా దాగురు మాత" లాడదొడగిరి. "ఇట్టివాడెందును లేడు, కలడని యిప్పుడుచును నేనును బన్నిదంబు చఱచినారము. ఈదండకు వచ్చి నిశ్చలంబుగాఁ జూచి నిశ్చయించి చెప్పుము" అని రాగవల్లరి హాసించి పంచంప నెంచినది "పందెము తీరుటకు మీకు నాచే వినవలసిన యర్థమెంతయో యంతిమాత్రము వినిపింతు విను" డని శుచిముఖి "వివరింప నతని రూపమ యానొసిది, యిందు సందియము లే" దనెను. రాగవల్లరి మహాత్రర్మైనాద విశేషసంభ్రమున పరితెంచి, యువ్వాలుగు ముద్దియను ఎత్తికొని పలువిధముల కొనియాడెను. నిజముగ రాగవల్లరి సంతోష కారణము ప్రతిశ్రుతియుక్త ప్రకృతి జగత్తున గందనివినులచేత గలిగినది. కాని యా సంతోషము పందెము గెల్చుటవలన కల్గినదిగా మరికొంత ప్రోత్సహనటన నల్పెను. అంతమాత్రమున నేమైనట్లు! రుజావడుగుపలకుపపు అపురుషునతులగో ఆాదికము అడుగవలెను. ఆ కపొములగతిపాడ రాపట్టుటకే రాగవల్లరి శుచిముఖిని స్తోత్రంబులచే లోగొన చూచెను. అంతి ప్రభావతి "అతని లక్షణము తే వై న నీ చిత్రమూర్తియందు గలవా" యని ప్రశ్నింప హాసి యూరుజాపునుచూపెను. కాని

ఆలక్షణకథనములో శంబరారియనియు రతివల్లభుడనియు విశేషములే తెల్పినది కాని 'ప్రద్యుమ్న' డను నామము తెల్పలేదు. ఏమన, ఎవ్వరెంత మనసిచ్చి వచింతురో తాను వారితో అంతమాత్రము ప్రతిభాషణ సల్పుట యుక్తము అంతతో నిల్వక వారినింకను లోగొను కోర్కెమై,పోయి వత్తు నని గగనభాగమున కెగయజూచెను. ప్రభావతి "నాకు చెలిమి కాడబడు" మని ప్రార్థించి నిల్వ జూచెను. ప్రార్థించినదే కాని యిప్పటికైనను మనసులోని గుట్టు తెల్పలేదు. ఈలోపుగ, ప్రస్తుత మేమిచేయదగునో యని రాగవల్లరి కొంచెము తలపోసి చూచి, ఎట్లును హంసినిమాటల గెలువరాదని గ్రహించి, తమ యోటమి యొప్పుకొని, ఆ ఈషద్రహస్యమును బయట పెట్టినది. అంత శుచిముఖి వచన వక్రత చాలించి ప్రద్యుమ్న నన్వయాది కథనముచేసి "త్వమేవశరణం, గతి రన్యానాస్తి" యని రాగవల్లరిచే వేడించుకొన్నది.

మొదలు,ప్రభావతివలపు స్థిరరూపము తాల్చినదో లేదో తెలియగోరి "రతి కాంతుని దేగల ననరాదు. సిద్ధ గంధర్వాదులలో నెవ్వనినైనను గోరికొనుము. అవశ్యముం దెచ్చెద" నని శుచిముఖి ఆకన్నెను ఇంకొక శుద్ధికి దాకొల్పెను. ప్రభావతియు తన గాఢానురాగము తేటపడు నట్లుగా పలుకుటయు, హంసి సంతసించి "నీవు నమ్ముము. ఏ నిదేభవదీశుం దెత్తు" నని పంతము పల్కి, యంతతో ఊరకొనక ప్రభావతి మనస్సు ఊరట చెందుటకును, ఆశ

యి న మ డిం చు ట కు ను, దైవ నియమంబును గల" దని దేవతా రహస్యాత్మకమైన యొక యుపాఖ్యానము కల్పించి చెప్పినది. ఆ కథలో ప్రిస్వామ్న శబ్దమునకు కామిశబ్దము పర్యాయపదమన్న జ్ఞానము రాగవల్లికి లేకపోవుట నిరూపించి "మాటలనేకాక పాండిత్యమందును నీవు నన్ను గెల్వరాదు సుమా!" అనినట్లు ఆ కన్యాపక్షికి బుద్ధిచెప్పినది.

తరువాతిది చిలుకరాయబారము బయలైన ఘట్టము. "శుకపక్షంబుల లోననుండి తదతి క్షోభంబునంజాటి పత్రిక పడ్డన్" ప్రభావతి వెరగంది "హంసీ! యిది కడువిచార్యము. కొంకక యిందెవ్వరి కెవ్వరంపిరొకో చిల్కంబట్టి తేవోవుదే. యని హెచ్చరించెను.

"మాకంటె వాఁడు మునుపుగ
నేకార్యము సేయఁగలఁడొ యెఱుఁగుము, మీరల్
జోకగఁ దత్పరి మెలఁగుచు
నాకేదొక పనికి వేగు నడపఁగ వలయున్.

అనిగదా, ఇంద్రుడు హంసల సాయమపేక్షించెను. ఆ చిల్క పత్రిక మోచికొనిపోవు చిత్రచరిత్ర చూచుటతోనే శుచిముఖికి మనసున అనుమానము కలిగెను. ఆ పిట్ట వజ్రనాభునికి వేగు నడపుచున్నదేమో యని దాని యనుమానము. దానిని నిగ్రహించి నిజమూరయవలె, ననియు లేనిచో కార్యభంగము వాటిల్లుననియు దాని తలంపు. పోనీ! పత్రిక లభించినది. గనుక వృత్తాంత మెరిగి యూరకొన

వచ్చు ననుకొన్నను, చిల్కను స్వాధీనము చేసికొనక యూరక పోనిచ్చిన కార్యము మరింత చెడుటయేకాని ప్రతిక్రియ దొరకిన లాభములేదు. ఒక్కక్షణములో హంసిహృదయమున అన్ని భావతరంగములు పుట్టి ప్రభావతియొక్క యాదేశము మిషగా ఆ చిలుకను కూడముట్టి పారినది. దాని రహస్యములన్నియు నెరిగినది. కాని అంతమాత్రమున దానిని విశ్వసింపక సునాభు కూతుండ్రను పిలిచి 'నాయెదుటను గలదనిపించి వినఁగాని విడువ' నని చెప్పి చిల్క యారుజువుమాపిన పిమ్మట చంద్రవతీ గుణవతులతో మైత్రి నెరపి, వారిని కూడ తనకు వశలఁ గావించి కొని, యన్ని పూసలును తనపోవునకే తిరుగునట్లు యత్నము చేసినది.

ప్రభావతి ప్రేరణమున వజ్రనాభుఁడు, శుచిముఖిని రాజసభకు పిలిపించి, ప్రసంగించునప్పుడు దాని పాండితీ విలసనము మరింత స్పష్టమయ్యెను. తనుపరి ద్వారకకు పోగి కృష్ణునకిచ్చిటి వృత్తాంతమంతయు చెప్పి, ప్రద్యుమ్ననకు ప్రభావతి విషయమంతయు తెలిపి, యన్నివిధముల ప్రారంభానుకూల్యము నెరపి, జరుగబోవు విచిత్రనాటకమునకు పూర్వరంగము నిర్వహించినది

తుదకు ప్రభావతీ ప్రద్యుమ్నుల గాంధర్వ వివాహ ముహూర్తమున "అయం ముహూర్తస్సుముహూర్తోఽస్తు" అని మంగళాక్షతలు చల్లి పౌరోహిత్యముచేసి నిష్క్రమించినది.

ఈప్రబంధ శుచిముఖికిని ఆ పురాణ శుచిముఖికిని పోలికయే లేదు. ఇది రాజహంసి. అదిపక్షి. ఈపాత్రయే ఈ ప్రబంధలక్ష్మికి రత్నాలంకారము.

